# అపరాధ పరిశోధన

రు. 6.50 | అక్టోబరు '85 |

సప్లిమెంట్

142



'PRABHAKAR'

అపరాధ పరిశోధన అనుబంధం—142

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అద్భుత శక్తి
రచన: ప్రతాప రవిశంకర్

## మంచి కుటుంబం
రచన : వసుంధర

## స్వప్నలోకం
రచన: పి. అరుణ

## పోలీసు ఆతిథ్యం
రచన: వక్కలంతం సూర్యనారాయణరావ్

విషకన్య - నాలుగవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—142**
అక్టోబరు, 1985
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**శ్యాంబాబు**
**ఏ. వీ. మోహన్రావ్**
**బొమ్మిడి అచ్చారావు**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అద్భుత శక్తి

ప్రతాప రవిశంకర్

"పునర్జన్మలున్నాయా?" అడిగాడు జమదగ్ని.

ఆయన నవ్వాడు. తలవూపి "వున్నాయి" అన్నాడు.

చాలామంది సాధువులను ఎన్నోసార్లు ఆ ప్రశ్నను అడిగాడు అతను. అతను అడిగిన వాళ్ళంతా పునర్జన్మలు వున్నాయనే చెప్పారు. ఒక్క మనిషికూడా లేవని చెప్పలేదు. ఐనా తను కలుసుకున్న ప్రతి సాధువునీ పునర్జన్మల గురించి అతను అడుగుతూనే వున్నాడు.

జమదగ్ని రైల్వే స్టేషన్లో సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. అతడికి కొంచెం దూరంలో చివరగా సాధువు కూర్చున్నాడు.

ఇద్దరికీ మధ్యలో జోలెలాంటిది వుంది. దానిపక్కనే లావుపాటి కర్రకూడా వుంది. ఆ రెండూ సాధువువే.

రాత్రి ఎనిమిది గంటలు దాటింది.

ఆ స్టేషన్లోకి రాత్రి పదిగంటలు కానిదే అప్పట్లో రైలు రాదు. ఏడూ ఇరవైకి వచ్చిన పాసింజరు రైలు

అరగంట క్రితమే వెళ్ళిపోయింది.

రైలు వెళ్ళిపోయిన తర్వాత పార్కు నించి ఇంటికి వెళ్ళిపోదామనుకున్నాడు అతను. కాని ఎవరైనా సాధువులు వెళ్ళిపోయిన రైలులో నించి దిగివుంటారనుకుని స్టేషన్ కి వచ్చాడు.

అతడి ఆలోచన నిజమే అయ్యింది.

సాధువు కనిపించాడు.

కొంచెం దూరంనించి ఎత్తుగా స్తంభానికి వెలుగుతున్న లైటు కాంతి వాళ్ళిద్దరిమీదకూ అస్పష్టంగా పడుతోంది.

గడ్డాన్ని చేత్తో దువ్వుకున్నాడు సాధువు.

ఒక్క నిమిషం ఆయన్ని మసక చీకట్లో అదోలా చూసి "పునర్జన్మలు గుర్తుండే అవకాశం రెండో జన్మ ఎత్తిన మనుషులకు వుంటుందంటారా?" అనడిగాడు.

ఆయన విసుక్కోలేదు. ఎందుకు నీకీ ప్రశ్నలు? అని అడగలేదు.

జమదగ్నివైపు చూస్తూ "అందరికీ వుంటుందని చెప్పలేను. కొంతమందికి వుంటుంది. అలాంటి సంఘటనలు చాలా జరిగాయి. నువ్వు పేపర్లలో ఎప్పుడైనా చదివే వుంటావు. అందులో నిజం వుంది" అన్నాడు.

ఆయన వయసు అరవై ఏళ్ళవరకూ వుండే అవకాశం వుంది. పొడుగాటి నెరిసిన గడ్డం వుంది ఆయనకి. జుట్టు ఎత్తుగా పైకి లేచి వుంది పాము చుట్టలుగా. నోరు కనపడ్డంలేదు. మాట్లాడేటప్పుడు మాత్రం గుహలాగా తెరుచుకుంటున్నది.

"చదివాను. కాని ఆ వార్తల్లో ఎంతటి నిజం వుందో అంచనా వేసుకోలేకపోయాను. నాకూ పునర్జన్మలు,

అతీంద్రియ అద్భుతశక్తులు వున్నాయనే నమ్మకం వుంది. వాటిని సాధించాలనే కోరిక వుంది. అందుకే ఇవన్నీ అడుగుతున్నాను. మీరు విసుక్కోవటం లేదుకదా" అని అడిగాడు.

"కాలక్షేపానికి కొంతమంది మాలాంటి మనుషులతో సంభాషణ జరుపుతారు. ఈ విషయాల్లో నమ్మకం లేని మనుషులు వాదనలోకి దించి మమ్మల్ని హేళన చెయ్యటానికి ప్రయత్నం చేస్తారు. కాని—నువ్వు ఈ విషయాల గురించి నిజంగా ఆసక్తి వుండే అడిగావని నాకు తెలుసు."

"థాంక్స్" అన్నాడు జమదగ్ని వెంటనే.

ఆయన నవ్వాడు. కాని ఈసారి ఆ మీసాల మధ్య నించి ఆ నవ్వు బయటకు రాలేదు.

"అతీంద్రియ శక్తుల గురించి మీ ఉద్దేశం ఏమిటి?" మళ్ళీ అడిగాడు జమదగ్ని.

ఆయనలా మాట్లాడటంతో అతనికి హుషారు కలిగింది.

"అతీంద్రియ శక్తులు వున్నాయి. వాటిని పొందటం అందరికీ సాధ్యంకాదు. కొంతమంది మనుషులకే అది సాధ్యం...."

"మీరు అలాంటి శక్తులను వేటినైనా సాధించారా?" వెంటనే అడిగాడు.

తలను అడ్డంగా వూపాడాయన.

"సహజంగానే మనుషుల్లో కొన్ని శక్తులు వుంటాయి. అటువంటి శక్తి యేదైనా నాలో వుంటే వుండొచ్చు. దాన్ని నేనో గొప్పశక్తిగా అనుకోవటంలేదు. ప్రత్యేకించి నేను యెటువంటి అతీంద్రియ శక్తులను సాధించలేదు."

కొంత నిరుత్సాహం కలిగింది జమదగ్నికి.

ఆ రైల్వేస్టేషన్ ఆవరణలోనే—ఆ సిమెంట్ బెంచీ మీదనే యెంతోమంది సాధువులను కలుసుకున్నాడు అతను. ఇటువంటి విషయాల గురించే సంభాషణలు జరిపాడు. కాని వాళ్ళంతా తమకేమీ అతీంద్రియ శక్తులు లేవనే చెప్పారు. వున్నాయని ఒక్కరూ చెప్పలేదు.

ఈ సాధువుకూడా అలాగే చెబుతున్నాడు.

వీళ్ళంతా చెప్పేది నిజమేనా?

సాధువులయివుండీ ఒక్క శక్తినీ సాధించలేక పోయారా?

"నమ్మలేకుండా వున్నాను. అన్ని సుఖాలనీ, కోరికలనీ త్యజించి ఎన్నో ప్రదేశాలూ తిరుగుతూ—ఎంతోమంది మహనీయులను కలుసుకునే మీకు అతీంద్రియ శక్తులు లేవంటే ఆశ్చర్యంగా వున్నది" అన్నాడు జమదగ్ని.

ఈసారి ఆయన తెలిసేటుగానే నవ్వాడు.

"అన్ని కోరికలనీ—సుఖాలనీ త్యజించిన మాలాంటి మనుషులకు అతీంద్రియ శక్తులతో పనేమిటి?" అన్నాడు.

నిజమే అనుకున్నాడు జమదగ్ని. కాని అతడికి ఏదో అసంతృప్తిగా వుంది. ఆ శక్తుల గురించి తెలుసుకోవాలని ఆ శక్తుల ప్రభావం ఎలా వుంటుందో చూడాలని కోరికగా వున్నది. కాని అతడి కోరిక తీరటంలేదు.

ఉన్నట్టుండి అడిగాడు జమదగ్ని—

"మీకు బంగారు తయారుచెయ్యటం వచ్చునా?"

మామూలుగానే చూశాడాయన.

"రాదు. తెలుసుకోవాలనికూడా అనుకోలేదు. ఒకసారి కాశ్మీరదేశంలో ఒక బైరాగి నాకు బంగారాన్ని

తయారుచెయ్యటం గురించి చెబుతానన్నాడు. నేనే వద్దన్నాను."

"మై గాడ్! అలాంటి బంగారంలాంటి అవకాశాన్ని వదులుకున్నారా?" నమ్మలేనట్టు అడిగాడు జమదగ్ని.

"అవును. నాకిష్టంలేదు. బంగారంతో నాకేమిటి అవసరం? సమస్యను కొని తెచ్చుకోవటమే అవుతుంది."

"నిజంగా మీరు గొప్పవాళ్ళు" అన్నాడతను.

ఆ పొగడ్త ఆయన పొంగిపోలేదు.

స్టేషన్‌లో గంటలు కొట్టేవాడు దూరంగా చెట్టు కింద వెల్లకింతలా పడుకుని యేవో సినిమాలో పాట పాడుతున్నాడు.

స్టేషన్‌లో జనం లేరు.

జమదగ్ని చేతికి వాచీ వుంది—ఐనా అతను టైము ఎంతయ్యిందోనని చూసుకోవాలని అనుకోలేదు టైము తెలీకుండానే అతను సాధువులతో కబుర్లు చెబుతూ వుంటాడు.

చిన్నతనం నించీ యెందుకనో అతడికి బైరాగులు, సాధువులు అంటే ఇష్టంగా వుండేది. వాళ్ళంటే అతనికి గౌరవం. అన్నింటిని వదులుకుని వాళ్ళు దేశాటన చేస్తూ వుంటారని — ఎన్నెన్ని ప్రదేశాలు తిరిగి ఎన్నెన్ని లోక జ్ఞానాన్ని సంపాదించిన మేధావులనీ అతని నమ్మకం.

ఆ రైల్వేస్టేషన్‌లో అప్పుడప్పుడు వచ్చేపోయే రైలు బండ్లలో సాధువులు - బైరాగులు దిగుతూ వుంటారు. అందుకే జమదగ్ని యేమీ తోచనప్పుడు స్టేషన్‌కి వస్తూ వుంటాడు.

ఆ సాధువుల దగ్గర వుంటే యేదైనా శక్తుల్లో ఒక్క శక్తినైనా తను పొందాలని అతడి కోరిక.

8

"నా మనసులో ఒక కోరిక వుంది ఎన్నాళ్ళుగానో.. కాని తీరటంలేదు" అన్నాడు జమదగ్ని ఆయన్ని చూస్తూ.

"ఏమిటి? యేదైనా అద్భుత శక్తిని సాధించాలనా?" అడిగాడాయన.

"అవును.... మీ కెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు జమదగ్ని.

"నీ మాటలతో అర్థం చేసుకున్నాను."

"ఇప్పుడు చెప్పండి. యేదైనాసరే. ఒక అద్భుత శక్తిని సాధించగలిగే మార్గం యేమిటి?"

ఒక్క నిమిషం తర్వాత ఆయన ఇలా అన్నాడు:

"ఏ మార్గాన్ని నేను చెప్పవలసిన అవసరంలేదు. ఆ మార్గమే నిన్ను వెతుక్కుంటూ వస్తుంది. దగ్గర్లోనే నీ జీవితంలో ఒక గొప్ప సంఘటన జరగబోతోంది. ఆ సంఘటన నీ జీవితాన్నే మార్చెయ్యగలదు."

"నిజమా! ఏమిటా సంఘటన? ఎప్పుడు జరగబోతోంది? చెప్పండి" అడిగాడు జమదగ్ని కుతూహలంగా.

చెప్పటం ఇష్టంలేనట్టు చటుక్కున బెంచీమీదనించి లేచి వెళ్ళిపోయాడు సాధువు.

2

"ఇంకా యేమిటి ఆలస్యం" అన్నాడు రామానుజరావు గదిలోకి వచ్చి....

కుర్చీలో వెనక్కువాలి కూర్చున్నాడు జమదగ్ని.

"నా ఆలస్యం లేదు. అమ్మ మేకప్ పూర్తి కాలేదనుకుంటాను" అన్నాడు.

నవ్వుకుని వెళ్ళిపోయాడు ఆయన.

ఆ రోజు జమదగ్ని పెళ్ళి చూపులకు వెళుతున్నారు

వాళ్ళంతా. ఊళ్ళోనే యేదో కమర్షియల్ బ్యాంకులో ఉద్యోగం చేసి రిటైరు అయిన గురుపాదం కూతుర్ని ఆ రోజు వాళ్ళు చూడబోతున్నారు,

నిజానికి ఉద్యోగం రాకముందు పెళ్ళి చేసుకోవటం జమదగ్నికి ఇష్టంలేదు, కాని ఉద్యోగం గురించి ఆలోచించవలసిన అవసరంలేదని గురుపాదం గట్టిగా చెప్పాడు. తను ఉద్యోగం చేసి రిటైరు అయిన బ్యాంకులో తనకు బాగా పలుకుబడి వుందనీ - ఆ బ్యాంకులోనే తప్పక ఉద్యోగం ఇప్పించుకుంటాననీ రామానుజరావుతో చెప్పాడు.

అందుకే వాళ్ళు ఆ పెళ్ళి చూపులకు ఒప్పుకున్నారు.

పెళ్ళికూతురు శమంత బావుంది. బాగా అందంగా వుంది. తొలిచూపులోనే జమదగ్ని హృదయాన్ని తన అందంతో కదిలించివేసింది.

ఆమె ఎర్రని పెదవులు జమదగ్నికి బాగా నచ్చాయి. శమంత అమాయకమైన లేడి కళ్ళు అతడికి మరపురానివిగా అనిపించాయి. ఒక్కసారి పెదవులు విచ్చుకోకుండానే కళ్ళతో నవ్వింది శమంత. ముగ్ధుడయ్యాడు జమదగ్ని.

అక్కడే తనకు ఆమె నచ్చిందని ప్రకటించాడు. అలా ప్రకటించినందుకు తల్లిదండ్రులు ఆశ్చర్యపడలేదు. కాబోయే కోడలి అందం అపురూపమైనది అని వాళ్ళు కూడా అంగీకరించారు.

ఆ రోజు సాయంత్రమే ముహూర్తాలుకూడా పెట్టుకున్నారు. సరిగ్గా ఆ రోజుకు నెలా పన్నెండురోజులు ఉంది పెళ్ళి. అంతమారంలో ముహూర్తాన్ని నిర్ణయించినందుకు జమదగ్నికి గొప్ప ఆశాభంగం కలిగింది.

ఎర్రటి ఆమె పెదవులు అతడిని పదేపదే కవ్వించాయి

ఆ రాత్రి. ఆమె చూపులు అతడిని కలవరపరిచాయి.

తన జీవితంలో జరగబోయే గొప్ప సంఘటన శమంతతో తన పెళ్ళనే అనుకున్నాడు. కావొచ్చు. మొదటిసారి పెళ్ళిచూపులకే ఆ అమ్మాయిని తను ఇష్టపడతాడని ఎప్పుడూ అనుకోలేదు. కాని జరిగింది.

సాధువు చెప్పిన ఆ సంఘటన ఇదే కావొచ్చు. ఐతే శమంత తన జీవితంలో ప్రవేశించటంతో తన బతుకు ఎటువంటి మలుపు తిరగబోతోంది. తనకు ఏం జరగబోతోంది? ఎటువంటి మార్పు సంభవించబోతున్నది?

జమదగ్ని ఊహకు అందలేదు.

తెల్లారి ఉదయం జమదగ్ని ఒక స్నేహితుడి ఇంటికి వెళ్ళి పన్నెండు గంటలు కావస్తున్నప్పుడు తిరిగి ఇంటికి వచ్చాడు. అప్పటికి ఒక ఉత్తరం అతనికోసం ఎదురు చూస్తోంది.

ఆ కవర్ని ఓపెన్ చేశాడు.

అందులో పెళ్ళి శుభలేఖ - దానికి జతపరచి ఓ ఉత్తరం ఉన్నాయి.

వాటిని చదివి నవ్వుకున్నాడు జమదగ్ని.

భువనేశ్వర్ లో ఉన్న అతని ఆప్తమిత్రుడు కోసలరామ్ పెళ్ళి. నాలుగు రోజులే వుంది. హఠాత్తుగా కుదిరిందనీ ఉత్తరం అందిన వెంటనే బయల్దేరి రమ్మనీ రాశాడు.

"ఎక్కడినించీ ఉత్తరం?" అన్నది తల్లి.

చెప్పాడు.

"తప్పకుండా వెళ్ళు .... కోసలరామ్ మంచివాడు. ఇప్పుడు నువ్వు అతని పెళ్ళికి వెళ్ళకపోతే తర్వాత అతను నీ పెళ్ళికి రాడు" అన్నదామె.

"అవును" అన్నాడు జమదగ్ని.

ఏడాది క్రితం వరకు కోసలరామ్ వాళ్ళు ఆ ఊళ్ళోనే వుండేవాళ్ళు. అప్పుడు జమదగ్ని అతడితో బాగా స్నేహంగా వుండేవాడు.

ఆ రోజు సాయంత్రం ట్రిమ్‌గా డ్రెస్ చేసుకుని జమదగ్ని శమంత ఇంటికేసి వెళ్ళాడు. అతనికి యేదో భయంగా తోచింది. ఆమె ఏమనుకుంటుంది? గర్వంగా ఫీలవుతుందా? ఏమైనా కలుసుకోక తప్పదు.

తను భువనేశ్వర్ వెళుతున్నట్టు ఆమెతో చెప్పాలి.

ఆ ఇంటికి కొంచెం దూరంగా కిళ్లీ బంకు వుంది. అక్కడ నిల్చుంటే శమంత బయటకు వచ్చినప్పుడు తప్ప కుండా కనపడుతుంది.

నిల్చున్నాడు జమదగ్ని.

ఒక సిగరెట్టు కొని ముట్టించాడు.

రోడ్డుమీద జనం నడుస్తున్నారు.

షాపువాడు తన పనిలో వున్నాడు.

ఆ ఇంటి వైపుకే చూస్తున్నాడు జమదగ్ని.

అతనికి చాలా అసహనంగా వుంది. శమంత బయటకు వస్తుందా? రాదా? ఒకవేళ రాకపోతే తను ఏం చెయ్యాలి? ధైర్యంచేసి ఆ ఇంట్లోకి వెళ్లాలా?

ఏమిటి చెయ్యటం?

ఇలా ఆలోచిస్తున్నప్పుడే ఆ రోడ్డుమీదకు మల్లెపూలు అమ్మేవాడు అరుచుకుంటూ వచ్చాడు. వాడు ఆ ఇంటి ముందుకు వెళ్ళిపోయాడు.

హఠాత్తుగా బయటకు వచ్చింది శమంత పూలు కొనటానికి. జమదగ్నిని చూసి ఆశ్చర్యపడింది. ఆ సమయాన్ని వృధాచెయ్యలేదు అతను. ఆమెను రమ్మని చేత్తో సైగ

చేశాడు యెవ్వరూ చూడకుండా.

పువ్వులు కొని ఆగమన్నట్టు తిరిగి సైగచేసి వెళ్ళిపోయింది శమంత.

ఇంకో సిగరెట్టు కొని ముట్టించాడు.

దాదాపు ఇరవై నిమిషాల తర్వాత ఆ యింట్లో నించి బయటకు వచ్చి రోడ్డెక్కింది శమంత.

తనని దాటి కొంచెం ముందుకు వెళ్ళగానే ఆమెను అనుసరించాడు.

ఆ రోడ్డు దాటిన తర్వాత ఆమెను కలుసుకున్నాడు.

"అరగంటనించీ ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"ఇంట్లోకి రాకూడదా?" అన్నది శమంత.

"ఏమయినా అనుకోరూ?"

"ఎందుకు? మనిద్దరికీ పెళ్ళి సెటిలయ్యింది. ఇంకేమను అనుకుంటారు?" అన్నది.

"ఎక్కడికీ ప్రయాణం?" అడిగాడు జమదగ్ని.

ఆమె నవ్వింది. ఎర్రటి పెదవులు విచ్చుకున్నాయి. తర్వాత ఇలా అన్నది!

"ఈ ప్రయాణం నాది కాదు. మీరు రమ్మంటే వచ్చాను. ఈ ప్రయాణం యెక్కడికో మీరు చెప్పాలి."

"ఎందుకు వచ్చానో చెప్పటం మరచిపోయాను. నేను రేపు భువనేశ్వర్ వెళుతున్నాను" అన్నాడు.

"ఎందుకు?"

చెప్పాడు జమదగ్ని.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు?"

"వారం రోజుల తర్వాత వస్తాను."

"మీకోసం ఎదురుచూస్తుంటాను" అన్నది నవ్వుతూ.

"థాంక్యూ.... నాదో కోరిక."

"అడగండి" అన్నది అతడి కళ్ళలోకి చూస్తూ—

"సినిమాకు వెళదామా?" చటుక్కున అడిగాడు.

"సినిమాకా? ఇంట్లో చెప్పలేదుకదా."

"ఎందుకు? నువ్వు నాతో వస్తున్నావు.... కావాలంటే నువ్వు నాతో సినిమాకు వచ్చినట్టు ఓ కాయితంమీద రాసి ఇస్తాను. సరేనా?" అన్నాడు.

"అవసరం లేదు. మీరు నా వెనుకే రావటం బయటకు వచ్చిన మా చెల్లెలు చూసింది. అది ఇంట్లో చెలుతుంది. కంగారుపడకులెండి" అన్నది శమంత చిరునవ్వుతో—

"తెలివైనదానివే నువ్వు" అన్నాడు జమదగ్ని.

పదినిమిషాల తర్వాత ఇద్దరూ ధియేటర్లో వున్నారు. సినిమా మొదలయిన తర్వాత శమంత భుజం చుట్టూ చేతిని పోనిచ్చి చిన్నగా నొక్కుతూ "త్వరలో నా జీవితంలో గొప్ప సంఘటన జరగబోతోంది" అన్నాడు జమదగ్ని.

ఆశ్చర్యంగా అతడి కళ్ళలోకి చూసింది శమంత.

## 3

కోసలరామ్ సంతోషాన్ని వ్యక్తపరిచాడు - జమదగ్ని పెళ్ళికి వచ్చినందుకు....

"త్వరలో నా పెళ్ళికూడా జరగబోతున్నది" అన్నాడు జమదగ్ని....

"గుడ్ న్యూస్. ఎప్పుడు?"

చెప్పాడు అతను. శమంత అందం గురించి కూడా చెప్పాడు.

"గుడ్ సెలక్షన్" అన్నాడు కోసలరామ్.

స్నేహితుడి పెళ్ళి వైభవంగా జరిగింది.

మరు రోజునే వెళ్ళిపోతానని అన్నాడు జమదగ్ని. కాని అతను వెళ్ళనివ్వలేదు. ఇంకో రెండు రోజులు అక్కడే ఉన్నాడు.

జమదగ్నికి చాలా ఆత్రంగా వుంది. త్వరగా వెళ్ళి శమంతను కలుసుకోవాలి. ఇంకోసారి ఆమెతో సినిమాకు వెళ్ళాలి. ఎవ్వరూ చూడకుండా ఆమె ఎర్రని పెద వులపై ముద్దు పెట్టుకోవాలి.

బయలేరాడు.

స్టేషన్‌కు వచ్చి వీడ్కోలు చెప్పాడు కోసలరాజు.

రైలు బయలేరింది.

కొంచెంసేపటికే చీకటిపడింది.

సూట్కేసులోనించి ఇంగ్లీషు నవల బయటకు తీశాడు జమదగ్ని. చదువుతున్నాడు.

ఉన్నట్టుండి అతని ఆలోచనలు సాధువు మీదకు మళ్ళాయి. ఇంతకీ ఆ సాధువు నిజమే చెప్పాడా?

నిజంగా తన జీవితంలో అనూహ్యమైన గొప్ప సంఘటన జరుగుతుందా?

ఏమో!

జమదగ్నికికూడా అటువంటి సంఘటన తప్పకుండా జరుగుతుందనే నమ్మకంగా అనిపించింది. అయితే ఆ సంఘటన యేమిటో ఎప్పుడు జరుగుతుందో వూహించుకో లేకపోయాడు.

తర్వాత అతడి ఆలోచనలు శమంతమీదికి వెళ్ళాయి. అతనికి చదవాలనిపించలేదు. నవలను మూసి కళ్ళు మూసు కున్నాడు.

రైలు వేగంగా వెళుతోంది.

పచ్చసరాలు రివ్వున వెనక్కు వెళుతున్నాయి. అతడు

శమంతతో తనని వూహించుకుంటూ కలలు కంటున్నాడు.

కలలు కంటూనే నిద్రలోకి జారుకున్నాడు.

జమదగ్నికి మెలకువ వచ్చేసరికి రైలు ఆగిపోయి వుంది. ఎదురు సీట్లలో కూర్చున్న మనుషులు లేరు. కిందికి దిగిపోయారు.

ఆశ్చర్యంగా బయటకు చూశాడు.

అక్కడ స్టేషన్ లేదు.

పక్కనే ఖాళీగా వున్న పొలాలు దూరంగా యేవో చెట్లు వెన్నెల్లో కనపడ్డాయి.

అతను ఎంట్రెన్స్ డోర్ దగ్గరకు వచ్చి అక్కడే కింద నిల్చున్న మనిషిని అడిగాడు.

“రైలు ఎందుకు ఆగిపోయింది?”

“ఏదో రిపేర్. బాగుచేస్తున్నారు. ఇంకో గంట వరకూ కదలదు.”

ఖాళీగా వున్న పొలాల్లో అక్కడక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు మనుషులు.

వాచీకేసి చూసుకున్నాడు.

పదకొండు గంటలు కావస్తోంది.

సూట్కేసుతో కిందికి దిగాడు జమదగ్ని. దాన్ని అక్కడే వుంచి దిగొచ్చు. కాని యెవరైనా తీసికెళితే తను ఇబ్బందిపడాలి.

కొంచెం దూరంలో ఎక్కువగా మనుషులు లేని ప్రదేశంలో కర్చీఫ్ పరచుకుని కూర్చున్నాడు.

వాతావరణం ఆహ్లాదంగా వుంది.

అంతా వెన్నెల.

వెలుగు ఆకాశంలో నించి భూమ్మీదకు జారుతున్నట్టుగా వుంది.

కొంచెం దూరంవరకూ పొలాలు వున్నాయి. అక్కడి నించీ యేవో దట్టంగా పెరిగిన చెట్లు నల్లగా గుట్టలు పడి నట్టుగా అగుపడుతున్నాయి.

ఆ ప్రశాంతత జమదగ్నిని బాగా ఆకర్షించింది. అతను యేదో ఆకర్షణకు లోబడిపోయినట్టుగా అక్కడే కూర్చుండిపోయాడు.

రైలు ఇంజన్ దగ్గర యెవ్వరమంది మనుషులు గుమి కూడి వున్నారు.

వాళ్ళని చూడటంలేదు జమదగ్ని.

అతని అంతరంగంలో యేదోలా వుంది.

తన ఆలోచనల్లో, భావాల్లో యేదో చిత్రమైన మార్పు జరుగుతున్నట్టూ, ఏదో కలవరం కలుగుతున్నట్టూ అనిపించింది.

ఏదో చెప్పలేని అనుభూతి.

ఇంకొంచెం సేపట్లో తనకు యేదో జరగబోతుందని తెలిసినట్టుగా మనసుపడుతున్న చిత్రమైన ఆందోళన.

తనకేమవుతోంది?

ఎందుకిలా వుంది?

దూరంగా యేదో చెట్టుమీద పక్షి వుండుండి కీచు మంటూ అరుస్తోంది.

లేచి నిల్చుందామనుకున్నాడు. కాని లేవలేకపోయాడు. యెవరో తనని ఆదేశించినట్టుగా అక్కడ నించి కదల్లేక పోయాడు.

చెట్లకేసి చూస్తున్న జమదగ్ని ఒక్కసారి ఉలిక్కి పడ్డాడు.

దూరంగా చెట్లవైపు నించి యెవరో ఒక మనిషి గబగబా నడిచివస్తున్నాడు.

ఎవరా మనిషి?

ఇంత రాత్రి వేళ యెక్కడినించి వస్తున్నాడు? యెక్కడికి వెళుతున్నాడు?

ఆ మనిషి నే చూస్తున్నాడు. దూరంనించి ఆ మనిషి రూపం అస్పష్టంగా వుంది కాని దగ్గరైనకొద్దీ అతడి ఆకృతి కొంచెంగా బోధపడింది.

కొంచెం సేపట్లో నే ఆయన దగ్గరకు చేరుకున్నాడు. వెన్నెల్లో ఆ ఆకారాన్ని సాధువుగా గుర్తించాడు జమదగ్ని.

ఆ సాధువు తన వైపుకే రావటం గమనించి కలవర పడ్డాడు జమదగ్ని.

ఆశ్చర్యమూ—భయమూ కలిగాయి.

ఆయనకు పాదవాటి గడ్డాలు నడుమువరకూ పెరిగాయి. భుజానికి జోలెలాంటిది తగిలించుకున్నాడు. చేతులకు యేవో కడియాలు ఉన్నాయి. పొడుగ్గా ఉన్నాడు. అరవై యేళ్లు దాటి వుంటాయి. మొహంలో యేదో దివ్యమైన తేజస్సు ప్రకాశిస్తోంది.

వస్తూనే "గురుదేవా" అంటూ జమదగ్నికి నమస్కారం చేశాడు.

జమదగ్ని ఆశ్చర్యచకితుడయ్యాడు.

వెంటనే మాట్లాడలేకపోయాడు.

ఇదేమిటి?

అంతా కలగా వుంది.

తనని సాధువు గురుదేవా అంటున్నాడు.

"ఎవరు మీరు?" అన్నాడు జమదగ్ని నోరు పెగుల్చుకుని.

ఆయన వెంటనే మాట్లాడలేదు.

తర్వాత ఇలా అన్నాడు—

"ఎట్లా చెప్పేది? నేను మీ శిష్యుడిని. ఇట్లా చెబితే మీకు ఇప్పుడు అర్థంకాదు. కాని ఇది నిజం."

"నాకు నిజంగానే అర్థం కావటంలేదు. వివరంగా చెప్పండి" అన్నాడు జమదగ్ని.

"ఇరవై నాలుగేళ్ళ క్రితం సరిగ్గా ఇదే రోజున మీరు దైవంతో కలిసిపోయారు. ఆ జన్మలో మీరు యోగీంద్ర స్వామి. మీ శిష్యుడిని నేను. నాకు మీరు ఎన్నో దివ్యమైన మంత్రాలను ఉపదేశించారు. తిరిగి జన్మనెత్తుతాననీ, సరిగ్గా ఇరవై నాలుగేళ్ళ తర్వాత నాకు దర్శనమిస్తారనీ చెప్పారు. మీకోసమే యెదురుచూస్తున్నాను. రాత్రి కలలో కనిపించి ఇక్కడ కలుసుకోమన్నారు. తమ ఆజ్ఞ ప్రకారం కలుసుకోటానికి వచ్చాను. ఇప్పటి నా ఆనందం వర్ణనాతీతం గురుదేవా" అన్నాడాయన తిరిగి చేతులు జోడించి.

"ఇదంతా నిజమా?!"

"అవును గురుదేవా? నమ్మటం కష్టమే అయినా ఇదంతా నిజం. లేకపోతే ఈ రాత్రివేళ మీరు ఇక్కడ ఉంటారని నేనెలా తెలుసుకోగలను. అంతే కాదు. మీ నమ్మకానికై మీ గురించిన వివరాలు చెబుతాను. మీరు ఈ జన్మలో జమదగ్నిగా అవతరించారు" అంటూ అతని గురించిన వివరాలన్నీ పూర్తిగా చెప్పాడు.

నమ్మకుండా వుండలేకపోయాడు జమదగ్ని. అతనికి కూడా గత జన్మలో తను యోగీంద్రస్వామి అనే నమ్మకం పూర్తిగా కలిగింది. ఆ నమ్మకం కలిగిన తర్వాత నూతన శక్తి యేదో తనలో వున్నట్టుగా అతడికి అనిపిం

చింది.

"నాకేమీ గుర్తురావటంలేదు__ఎంతగా ప్రయత్నం చేసినా .... గత స్మృతులను పొందే అవకాశం నాకు లేదా?" అడిగాడు జమదగ్ని.

ఆయన నవ్వి "లేదు" అన్నాడు.

"గత జన్మలోని అద్భుత శక్తులను నేను తిరిగి పొందే అవకాశం వుందా?"

"లేదు. అప్పటి మీ జన్మ వేరు. అప్పుడు మీరు చిన్నతనంలోనే అన్నింటినీ వదులుకుని విరాగులుగా మారిపోయినట్లు నాతో ఎన్నో సార్లు చెప్పారు. అద్భుత శక్తుల సాధనకు ఎన్నో కఠోర నియమాలను పాటించారు. ఎంతో తపస్సు చేశారు. అతీంద్రియ శక్తులను సాధించారు. ఈ జన్మలో అటువంటివి పొందటం సాధ్యం కాదు."

నిరుత్సాహపడ్డాడు జమదగ్ని.

అలా జరగటానికి వీల్లేదు. ఇది తనకు ఒక అపూర్వమైన అవకాశం. ఈ అవకాశాన్ని తను వదులుకోకూడదు. గత జన్మలో ఎన్నో అద్భుత శక్తులను పొందిన తను ఈ జన్మలో ఒక్క శక్తైనా కలిగి వుండాలి.

"నన్నర్థం చేసుకోండి .... నాలో యేదో తపనగా వుంది. ఆరాటంగా వుంది. ఏదో ఒక అద్భుత శక్తిని పొందాలని నా అంతరాత్మ ఘోష పెడుతోంది. గత జన్మలో గురుదేవుడిగానే ఈ జన్మలో నేను ఈ కోరిక కోరుతున్నాను. తీర్చండి. కనీసం యేదో ఒక అతీంద్రియ శక్తి నాకు కావాలి."

మౌనంగా ఉండిపోయాడు ఆయన__యేదో ఆలోచిస్తూ.

"గురుదేవులు ఇంతగా కోరినమీదట కాదనలేక పోతున్నాను. మీ మనసును నేను అర్థం చేసుకోగలను. నా శక్తిని కొంత ధారపోసి మీలో ఒక అద్భుత శక్తిని ప్రవేశపెడతాను."

"ఏమిటా అద్భుత శక్తి?" కుతూహలంగా సంతోషంగా అడిగాడు జమదగ్ని.

"గొప్ప శక్తి....ఒక మనిషిని చూడగానే అతడి గురించి అంతా కళ్ళకు కట్టినట్టుగా తెలిసిపోవటమనే శక్తి....ఆ శక్తిని మీలో ప్రవేశపెడతాను... గురుదేవుని కోరిక కాదనలేను. పదండి."

జమదగ్నికి అంతా మాయగానే అనిపించింది. యాంత్రికంగా లేచి నిలుచున్నాడు.

అప్పుడు అతడు ఈ లోకంలోకి వచ్చి రైలుపట్టాలను చూశాడు.

అక్కడ ఆగివున్న రైలు లేదు.

ఎప్పుడు వెళ్ళిపోయిందో అతను గమనించనేలేదు. నిర్మానుష్యంగా వుంది.

# 4

సాధువు ముందుకు కదిలాడు.

మంత్రముగ్ధుడిలా ఆయన్ని అనుసరించాడు జమదగ్ని.

రైలు పట్టాలు దాటారు.

పొలాల మధ్యనించి సన్నని దారి వుంది. ఆ దార్లో నడుస్తున్నారు ఒకరి వెనుక ఒకరు.

సాధువు మాట్లాడటంలేదు.

బొమ్మలా ముందుకు కదులుతున్నాడు.

జమదగ్ని ఆ వెన్నెల్లో ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

రైల్వే స్టేషన్‌లో ఆ సాధువు చెప్పినమాట నిజ

మయ్యింది. తన జీవితంలో గొప్ప సంఘటన జరిగింది. ఈ సంఘటనతో తన జీవితంలో గొప్ప మార్పు సంభవించ బోతోంది.

ఆయన ఇంతకుముందు తను వచ్చిన దారినే నడుచుకు వెళ్లాడు.

దట్టంగా అడవిలా పెరిగిన చెట్లు వచ్చాయి. ఆ చెట్ల లోకి యిద్దరూ ప్రవేశించారు.

ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్టు ఆ సాధువును అనుస రిస్తున్నాడు జమదగ్ని. అతడి అడుగులు వేగంగా పడు తున్నాయి.

చెట్ల మధ్య నించి నడుస్తున్నారు. వెన్నెల చెట్లలో నించి జల్లెడు పడుతున్నట్టుగా లోపలకు పడుతోంది.

బాగా లోపలకు వెళ్లారు.

అక్కడ ఒక నీటిమడుగు ఉంది. ఆగిపోయాడు సాధువు.

జమదగ్నిని దుస్తులు విడిచి ఆ నీళ్ళలో స్నానంచేసి రమ్మన్నాడు.

భయమేసింది అతడికి.

చలిగా ఉంది. ఆ చలిలో చల్లని నీటిలో స్నానం చెయ్యాటమా?

జోలెలోనించి యేదో వస్త్రాన్ని తీసి ఇచ్చాడు. దాన్ని కట్టుకుని మడుగులో దిగాడు జమదగ్ని.

జివ్వుమన్నాయి నరాలు.

వణుకు పుట్టింది.

స్నానంచేసి పైకి వచ్చాడు.

చెట్టు పక్కనే కూర్చోమన్నాడు. జమదగ్నిని తన కళ్ళలోకి సూటిగా చూడమని అన్నాడు.

ఆ సాధువు కళ్ళలోకి సూటిగా చూశాడు జమదగ్ని.

ఆయన అలా చూస్తూ యేదో మంత్రాన్ని చదివాడు. మళ్ళీ మళ్ళీ చదివాడు.

"నువ్వు కూడా దీన్ని చదువు."

జమదగ్ని యాంత్రికంగానే ఆ మంత్రాన్ని పఠించాడు. అతనికి ఏదో నాగస్వరం వింటున్నట్టుగా వుంది.

శరీరం తేలికయిపోతున్నట్టుగానూ — యేదో శక్తి తనలో ప్రవేశిస్తున్నట్టుగానూ భావన కలిగింది.

తనకేమవుతోంది?

ఆలోచించాలనుకున్నాడు.

కాని అప్పటికే అతనికి స్పృహ పోయింది. స్పృహ పోవటానికి ముందుగానే ఆ సాధువు చెప్పాడు—ఎట్టి పరిస్థితులలోనూ ఈ అద్భుత శక్తి గురించిన రహస్యాన్ని ఎవ్వరికీ చెప్పకూడదని—అట్లా చెప్పిన మరు నిమిషంలో జమదగ్ని ప్రాణాలతో వుండడు.

జమదగ్నికి తిరిగి మెలకువ వచ్చినప్పుడు టైమెంత య్యిందో తెలీలేదు. వెంటనే అతను ఇటూ ఇటూ చూశాడు. చెట్టుపక్కనే నీడలో అతడి సూట్కేసు కనపడింది. అందులోనించి వాచీతీసి చూశాడు.

మూడు గంటలు కావస్తోంది.

సాధువు అక్కడ కనపడలేదు.

ఎందుకల్లనో జమదగ్నికి భయం కలగలేదు. అతడిలో యేదో ధైర్యం కలిగింది.

దుస్తులు ధరించి సూట్కేసుతో అక్కడి నించి వెనక్కి తిరిగాడు.

కొన్ని నిమిషాల్లో ఆ అడవిని దాటి పొలాల్లోకి ప్రవేశించాడు. తర్వాత రైలుపట్టాల దగ్గరికి చేరుకున్నాడు.

పట్టాల వెంటనే నడిచాడు.

కొంత దూరం నడిచాక దూరంగా యేదో ఊరు ఉన్నట్టుగా దీపాలు కనిపించాయి.

గంటసేపు నడిచాడు జమదగ్ని, అక్కడ రైల్వే స్టేషన్ వుంది. ఆ స్టేషన్ అంతా నిద్రలో మునిగి వుంది.

# 5

"నీకోసమే యెదురుచూస్తున్నాం" అన్నది తల్లి. తండ్రికూడా అలాగే అన్నాడు.

వాళ్ళిద్దరి మొహాలూ విచారంగా వున్నాయి.

"గంటక్రితమే ఈ ఉత్తరం వచ్చింది" అని తండ్రి ఒక ఉత్తరాన్ని ఇచ్చాడు జమదగ్నికి.

ఆత్రంగా దాన్ని ఇలా చదివాడు.

నాన్నా—

మీరు వెంటనే బయల్దేరి రండి. నామీద వీళ్ళు దొంగతనం నేరాన్ని మోపారు. మా ఆడపడుచు గొలుసు పోయింది. దాన్ని నేనే తీశానని అంటున్నారు. ఈ నిందను భరించటం నాకు సాధ్యం కాదు. మాటలతో వీళ్ళంతా నన్ను హింస పెడుతున్నారు. వెంటనే రండి. మీకోసం యెదురు చూస్తుంటాను. —రమ.

కన్నీళ్ళొచ్చాయి జమదగ్నికి.

రమ అతడి ఒకే ఒక అక్కయ్య. రెండేళ్ళ క్రితమే ఆమె పెళ్ళయ్యింది.

"ఏం చేద్దాం?" అన్నాడు తండ్రి.

"అక్కయ్య నిప్పులాంటిదని మనకు తెలుసు. ఈ దొంగతనాన్ని ఆ ఇంట్లో ఇంకెవరో చేసివుంటారు. నేను వెళతాను. వీలుంటే ఆ దొంగను పట్టుకునే ప్రయత్నం

చేస్తాను" అన్నాడు జమదగ్ని.

"నీకు సాధ్యం అవుతుందా?" అన్నాడు తండ్రి.

"చూద్దాం. ఏమైనా నేనే వెళతాను. మీరు దిగులు పడకండి. ఈ సమస్యకు పరిష్కారం చూపగలననే నమ్మకం నాకు ఉంది."

"ఏమో! అంతా నువ్వే చూసుకో..." అన్నది తల్లి.

"రమకు ధైర్యం చెప్పు....వస్తానంటే తీసుకురా.... అక్కడ అమ్మాయి బాధపడకూడదు" తండ్రి అన్నాడు.

"అటువంటి అవసరం ఉండదనే అనుకుంటున్నాను."

కొడుకు ధైర్యానికి తండ్రి ఆశ్చర్యపోయాడు.

జమదగ్ని అప్పటికప్పుడే ప్రయాణమయ్యాడు.

బస్సెక్కాడు.

అతడి ఆలోచనలు వేగంగా పరుగులు దీస్తున్నాయి.

సాధువు తనలో ప్రవేశపెట్టిన అద్భుత శక్తితో తను ఆ దొంగను పట్టుకోవాలి.

సాధ్యమవుతుందా?

నిజంగా తనలో ఆశక్తి ప్రవేశపెట్టబడిందా?

ఏమో! ఇదే పరీక్ష.... వెళ్ళటంతోనే తను ముందు ఆ దొంగను ఆచూకీ తియ్యాలి.

వాళ్ళింటి ముందు రిక్షా నుంచి దిగాడు.

వరండాలోనే వుంది రమ

జమదగ్ని లోపలకు వస్తుంటే ఒక్కసారి పెద్దగా యేడ్చేసింది.

చలించిపోయాడు అతను.

"భయపడకు నేనొచ్చాను" అన్నాడు.

జమదగ్నిని చూడటంతో అంతా బయటకు వచ్చారు. అతడి బావ ఇంట్లో లేడు. ఆఫీసునించి ఇంకా తిరిగి

రాలేదు.

అంతా జమదగ్నిని సీరియస్‌గా చూశారు.

ఒక్కరూ వెంటనే మాట్లాడలేదు.

రమ అత్తగారు అన్నది.

"ఎప్పుడూ ఈ ఇంట్లో బంగారు వస్తువు పోలేదు. ఇదే మొదటిసారి."

జమదగ్ని మాట్లాడ లేదు.

"రెండు మూడు ప్రశ్నలు అడిగాం....ఆకారాన్ని వర్ణించికూడా చెప్పారు" మళ్ళీ ఆమే అన్నది.

జమదగ్ని ఏదో మాట్లాడబోయేంతలో అప్పుడే గేటు నెట్టుకుని ఒక యువకుడు లోపలకు వచ్చాడు. సన్నగా- పొడుగ్గా వున్నాడు. సిగరెట్లు ఎక్కువగా కాల్చటంతో అతడి పెదవులు నల్లగా పొగచూరి వున్నాయి.

"ఎవరితను?" వస్తూనే అడిగాడు.

"వాళ్ళ తమ్ముడు" రమను చూపిస్తూ చెప్పింది రమ అత్తగారు.

"ఎందుకొచ్చాడు పిన్నీ" మళ్ళీ అడిగాడు.

అతని పేరు ఈశ్వర్. రమ పెద్దత్తగారి కొడుకు. వారం రోజుల క్రితం యేవో పరీక్షలు రాయటానికి ఆ వూరు వచ్చాడు.

"దొంగను పట్టుకోటానికి" అన్నాడు జమదగ్ని కటువుగా.

అతను నవ్వి "మీరు పోలీసు డిపార్టుమెంటులో పని చేస్తున్నారా?" అనడిగాడు.

జమదగ్ని కళ్ళు ఎర్రగా మారిపోయాయి.

కోపంతో అతడి ముహం జేవురించింది.

ఈశ్వర్‌ని చూస్తుంటే కళ్ళముందు జరిగినదంతా

సినిమా చూస్తున్నట్టుగా కనపడుతోంది.

అంత కోపంలోనూ జమదగ్నికి సంతోషం కలిగింది. సాధువు నిజంగానే తనలో ఒక అద్భుత శక్తిని ప్రవేశ పెట్టాడు.

"దొంగను పట్టుకోటానికి పోలీసు డిపార్టుమెంటుతో పని చేయవలసిన అవసరం లేదనుకుంటాను" అన్నాడు.

"ఏనా మీరు ప్రత్యేకంగా దొంగను వెతికి పట్టుకో వలసిన అవసరం లేదు. గొలుసు దొంగతనం చేసిన దొంగ యెవరో మాకు తెలిసిపోయింది" అన్నాడు ఈశ్వర్.

"ఎవరు? మా అక్కయ్యేనా?"

"అవును. చాలా క్లియర్ గా చెప్పాడు."

"ఎవరతను? ఎక్కడ వుంటాడు? ఈ ఊళ్ళోనేనా?"

"ఇక్కడే ఉంటాడు. ఆయన పేరు శివయ్యబాబా. ఆయన చెప్పేదంతా నూటికి నూరుపాళ్ళు నిజం."

"ఆ నిజాన్ని నేనుకూడా వింటాను.... నన్ను ఆయన దగ్గరకు తీసుకువెళతారా?" అనడిగాడు జమదగ్ని.

సరిగ్గా అప్పుడే జమదగ్ని బావ సుందరరావు వచ్చాడు.

"ఎప్పుడొచ్చావు?" అడిగాడు.

చెప్పాడు జమదగ్ని.

"నాకూ నమ్మకం కలగటంలేదు రమ దొంగతనం చేసిందంటే. కాని శివయ్యబాబా చాలా స్పష్టంగా వర్ణించి చెప్పాడు. ఆయన వర్ణన రమకు సరిగ్గా సరి పోయింది" అన్నాడు సుందరరావు.

"ఆల్ రైట్ .... పదండి. ఒకసారి శివయ్య బాబా దగ్గరకు వెళదాం" అన్నాడు జమదగ్ని.

రమకూడా వస్తానన్నది.

"వద్దు....నువ్వు ఇక్కడే వుండు. నువ్వు వచ్చిన తరువాత నిజం తేలుస్తాను" అన్నాడు అతను.

శివయ్యబాబా యెవరితోనో మాట్లాడుతున్నాడు. ఎవరిదో ఉంగరం పోయిందిట. దాన్ని యెవరు తీశారో వాళ్ళతో చెబుతున్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయారు.

ఈశ్వర్ ఆయనతో మాట్లాడాడు.

"మా బావమరిది. మీతో మాట్లాడాలని వచ్చాడు" అన్నాడు సుందరరావు.

"చెప్పండి" అన్నాడు శివయ్యబాబా ముందుకు పొడుచుకువచ్చిన బొజ్జని నిమురుకుంటూ.

"గొలుసు దొంగతనం గురించి ఒక స్త్రీని వర్ణించి చెప్పారుట. ఆ వర్ణన మా అక్కయ్యకు సరిపోయిందని వీళ్ళంతా అంటున్నారు. నిజమేనా?" అడిగాడు జమదగ్ని సౌమ్యంగా.

"అవును. నూరుపాళ్ళు నిజం. ఈ శివయ్యబాబా అబద్ధం చెప్పటానికి వీల్లేదు. ఆమే దొంగతనం చేసింది" అన్నాడు చాలా తేలిగ్గా.

అంతే. ఆయన తూలి బోర్లాపడ్డాడు. గోడకు తగిలి రెండు పళ్ళు వూడి కిందపడ్డాయి.

ఆ సంఘటనకు అంతా షాక్ తిన్నారు.

"ఇడియట్ .... చంపేస్తాను. నువ్వు నిజం చెప్పేవాడివా? అసలు నీకేం తెలుసు? నిన్ను పోలీసులకు పట్టిస్తాను" అన్నాడు జమదగ్ని కోపంగా.

"జమదగ్నీ ....ఏమిటిదంతా?" అన్నాడు సుందరరావు కంగారుగా.

శివయ్యబాబా మాట్లాడే స్థితిలో లేడు.

"బావగారూ....వీడొక మోసగాడు. నిజం యేమిటో నేను రుజువుచేస్తాను. నాతో ముగ్గురు రండి" అన్నాడు.

"ఎవరు? ఎక్కడికి?" అన్నాడు సుందరరావు.

"మీరు—ఈశ్వర్—గొలుసు పోగొట్టుకున్న మీ చెల్లెలు నేను తీసుకువెళ్ళే చోటుకు రండి. ఆ గొలుసును చూపిస్తాను."

"ఆ గొలుసు యెక్కడ ఉందో నీకు తెలుసా?"

"తెలుసు."

"ఎట్లా తెలుసు?"

"చెప్పను....మీకు నిజం తెలియాలి. అంతే. నాతో రండి."

"సరే పద" అన్నాడు సుందరరావు.

"నాకు పనుంది. నేను వెళతాను" అన్నాడు ఈశ్వర్.

"కాదు. నువ్వుకూడా రావాలి....నిజం నీకూ్కడా తెలియాలి. ఎందుకంటే మా అక్కయ్య దొంగ అని నువ్వుకూడా అన్నావు."

"అవును. నువ్వుకూడా వచ్చెయ్యి. నష్టం యేమిటి? చూద్దాం. ఏం జరుగుతుందో" అన్నాడు సుందరరావు.

జమదగ్ని వాళ్ళని మెయిన్ రోడ్డు పక్కనే ఉన్న చిన్న సందులోకి తీసుకెళ్ళాడు. అక్కడ ఒక దుకాణం వుంది. దాని బయట—పాథూలాల్ మల్ వగాచంద్—వెండి, బంగారు నగలు తాకట్టు పెట్టుకొనబడును—అని రాసివుంది.

సేట్ పరుపుమీద కూర్చున్నాడు ఒక్కడే.

ఈశ్వర్ని చూపించి "నాలుగు రోజుల క్రితం ఒక గొలుసు తీసుకువచ్చి రెండొందల రూపాయలకు తాకట్టు పెట్టాడు. దాన్ని తీసుకురా" అన్నాడు.

"నేనా?" అన్నాడు కంగారుగా ఈశ్వర్....

"నువ్వు నోర్మూసుకో కొంచెంసేపు" అన్నాడు జమదగ్ని.

"ఎందుకు?" అడిగాడు దగాచంద్.

"ఆ గొలుసు దొంగిలించబడింది. పోలీసు కంప్లయింట్ కూడా ఇచ్చారు. ఇంకొంచెం సేపట్లో పోలీసులు ఇక్కడికి వస్తారు."

"అయ్యో.... అయ్యో" అంటూ సేట్ లోపలకు వెళ్ళి ఐదు నిమిషాల్లో ఆ గొలుసును తీసుకువచ్చాడు.

"అవును. ఇదే గొలుసు" అన్నది సుందరరావు చెల్లెలు హేమ.

ఈశ్వర్ మొహం మాడిపోయింది.

"ఎక్కడిదీ గొలుసు?" దగాచంద్‌ను అడిగాడు.

దగాచంద్ ఈశ్వర్‌ని చూపిస్తూ "ఈ కుర్రాడు తాకట్టు పెట్టాడు" అన్నాడు.

ఈడ్చి ఈశ్వర్ మొహంమీద అరచేత్తో కొట్టాడు సుందరరావు.

"వెధవా....నువ్వు దొంగతనంచేసి రమమీదకు నెడతావా? శివయ్యబాబా దగ్గరకుకూడా మమ్మల్ని నువ్వే తీసుకెళ్ళావు" అన్నాడు కోపంగా—

ఈశ్వర్ మాట్లాడలేదు.

తల వంచుకున్నాడు.

"నన్ను క్షమించు జమదగ్ని" అన్నాడు సుందరావు బాధగా....

"జరిగింది మరచిపొండి. ఇంకెప్పుడూ నిజం తెలియకుండా ఏ మనిషిమీదా నిందలు వెయ్యకండి" అన్నాడు జమదగ్ని.

"ఇదంతా నీకెలా తెలుసు?"

"ఏమో! నాకలా అనిపించింది. అంతకంటే నాకేమీ తెలీదు."

ఇంటికొచ్చారు.

రమ అంతా విని "నీ కెలా కృతజ్ఞతలు తెలియచేసుకోవాలో తెలీటంలేదు. నన్నొక గొప్ప నింద నించి రక్షించావు. ఎలా తెలుసుకున్నావ్ ఇదంతా?" అనడిగింది.

అక్కయ్యకూడా అట్లాగే చెప్పాడు జమదగ్ని.

తిరిగి తెల్లారిన తర్వాత రైల్లో ప్రయాణమయ్యాడు అతను.

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్.

రివ్వున దూసుకు వెళుతోంది.

జమదగ్నికి సరయిన సీటు దొరకలేదు. అందుకే అతను ఒక్కో బోగీ చూసుకుంటూ నడుస్తున్నాడు.

రైలు పరుగెత్తుతూనే వుంది.

# 6

తక్కున ఒకచోట ఆగిపోయేడు జమదగ్ని. విండో పక్కనే కూర్చున్నాడు ఒక మనిషి. చాలా మామూలుగా వున్నాడు. సాధారణమైన దుస్తులు ధరించాడు. చేతికి సీకో వాచీ పెట్టున్నాడు.

తెల్లని ప్యాంటు, లేత నీలం రంగు చుక్కలున్న షర్టు వేసుకున్నాడు.

కిటికీలోంచి పొగను బయటకు వదులుతున్నాడు సిగరెట్ కాలుస్తూ.

అతడి సీటుకింద విడల్పాటి తోలు పెట్టె వుంది. అది మాసిపోయి అసహ్యంగా వుంది.

జమదగ్ని మెదడుకు యేవో సంకేతాలు అందాయి అతడి గురించి.

ఆలోచనలో పడిపోయేడు.

కళ్ళముందు సినిమా చూస్తున్నట్టుగా ఆ మనిషి చరిత్ర అంతా ఒక్కసారిగా కదిలింది.

మై గాడ్! ఐదు లక్షలు అనుకున్నాడు.

ఆ మనిషి జమదగ్నిని చూడలేదు. చూసినా జమదగ్నిలో అద్భుత శక్తి వుందనీ—ఆ శక్తితో అతను తన చరిత్ర చదువుతున్నాడనీ తెలుసుకోలేడు.

ఒక్క నిమిషం తర్వాత అతను అక్కడి నించి ముందుకు కదిలాడు ఒక్కో మనిషినీ చూసుకుంటూ....

ఒక బోగీలో నించి మరో బోగీలోకి దారి వుంది.

వేగంగా వెళుతోంది ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్.

చిన్న చిన్న స్టేషను పెట్టెట్టుగా వెనక్కి వెళుతున్నాయి.

రెండో బోగీలో న్యూస్ టైమ్ దినపత్రిక చదువుతున్న మనిషిమీద జమదగ్ని దృష్టి ఆగిపోయింది.

ఆయన్ని చూస్తూనే గ్రహించాడు—పోలీసు ఇన్‌స్పెక్టర్. అక్కడికి దగ్గరలో వున్న పట్టణంలో ఆయన పనిచేస్తున్నాడు. మాఫ్టీలో వెళుతున్నాడు ఒక్కడే.

"ఎక్స్‌క్యూజ్ మీ" అన్నాడు జమదగ్ని ఆయన దగ్గరకు వెళ్ళి....

తలెత్తి "ఏం కావాలి?" అన్నాడాయన సీరియస్‌గా.

"ఒక్కసారి ఆ ఎంట్రెన్స్ డోర్ దగ్గరకు వస్తారా? మీతో ఒక రహస్యం చెప్పాలి"

"రహస్యమా? ఎవరు నువ్వు!" ఆశ్చర్యంగా అడిగాడాయన.

"నే నెవరో కూడా చెబుతాను. మీరు పోలీసు ఇన్స్పెక్టర్ అనీ, మీ పేరు చక్రపాణి అని నాకు తెలుసు" అన్నాడు తగ్గించి.

ఇంకేమీ మాట్లాడకుండా ఆయన జమదగ్ని వెనకే ఎంట్రెన్స్ డోర్ దగ్గరకు నడిచాడు.

జమదగ్ని ఆయనతో తను చూసిన మనిషి గురించీ, అతని సీటుకింద వున్న తోలు పెట్టె గురించీ చిన్నగా చెప్పాడు.

"ఏమిటీ నువ్వు చెప్పేదంతా నిజమేనా?" అనడిగాడు నమ్మలేనట్టు.

"నిజం, పన్నెండు రోజుల క్రితం హైదరాబాద్ లో వున్న ఒక కమర్షియల్ బ్యాంకును కొంతమంది మనుషులు దోచుకున్నారు. ఐదు లక్షల రూపాయలు మాయమైనాయి. ఇప్పుడు ఆ డబ్బును తోలుపెట్టెలో పెట్టుకుని ఆ ముఠాలో ఒక మనిషి ఈ రైల్లోనే వెళుతున్నాడు. అతన్ని పట్టుకునే ప్రయత్నం చెయ్యండి."

"అతను ఆ ముఠాలో ఒకడనీ, ఆ తోలుపెట్టెలో ఐదు లక్షల రూపాయలు వున్నాయనీ నీకెలా తెలుసు?" అడిగాడు చక్రపాణి.

"ఎలా తెలుసు అంటే నేనేమీ చెప్పలేను. నాలో అటువంటి శక్తి వుంది. నా మాటమీద మీకు నమ్మకం కలగటానికి చిన్న పరీక్ష పెడతాను. మీ జేబులో వున్న పర్సులో ఎన్ని డబ్బులున్నాయో మీరు చెప్పగలరా?" అనడిగాడు జమదగ్ని.

"ఖచ్చితంగా చెప్పలేను. రఫ్ గా చెప్పగలను, రెండు వందల ఇరవై ఆరు రూపాయల ఎనభై పైసలు వుండొచ్చు" అన్నాడు.

"కాదు. నేను చెబుతాను. రెండువందల ఇరవై రెండు రూపాయల ఇరవై పైసలుంటాయి. నేను సరిగ్గా చెప్ప కలిగితే నా మాట నమ్మండి. లేకపోతే అవసరం లేదు."

చక్రపాణి జేబులోనించి పర్సు బయటకు తీశాడు. నోట్లన్నీ లెక్కించాడు. రెండువందల ఇరవై రెండు రూపాయలు వున్నాయి. ఇరవై పైసలు చిల్లర వుంది.

"యూ ఆర్ రియల్లీ గ్రేట్ ....నీ మాట నేను నమ్ము తున్నాను. ఆ మనిషి ఎక్కడ కూర్చున్నాడో క్లియర్ గా చెప్పు. నువ్వు అతన్ని కనిపెడుతూ వుండు. అతన్ని పట్టు కునే యేర్పాటు నేను చేస్తాను" అని అక్కడి నించి గార్డు కేబిన్ కేసి వెళ్ళాడు చక్రపాణి.

జమదగ్నికి సంతోషం కలిగింది.

వెనక్కు వచ్చి ఆ మనిషి వెనగ్గా కొంచెందూరంలో నిల్చున్నాడు. ఆ మనిషి కళ్ళు మూసుకుని కునికిపాట్లు పడుతున్నట్టుగా నటిస్తున్నాడు.

యేదో చిన్న స్టేషన్లో ఆగింది ట్రెయిన్.

ఎక్స్ప్రెస్ రైళ్ళు అక్కడ ఆగవు.

సిగ్నల్ ఇచ్చే వుంది. ఐనా ఆగింది రైలు.

గార్డు ప్లాటుఫారంమీద పచ్చ జెండా పట్టుకు నిల్చున్న స్టేషన్ మాస్టర్ని పిల్చి మడతపెట్టిన కాయితం ఇచ్చి యేదో చెప్పాడు.

గార్డు విజిల్ వూది జెండా వూపాడు.

రైలు కదిలి వేగాన్నందుకుంది.

అతనికి ఇదేమీ తెలీదు. సిగ్నల్ ఇవ్వకపోతే ఆ స్టేషన్లోనే రైలాగిందనుకున్నాడు.

కళ్ళు తెరిచి ఇంకో సిగరెట్టు ముట్టించాడు.

ఆ తర్వాత వచ్చే స్టేషన్‌లో రైలాగుతుంది. ఆ స్టేషన్‌లోనే అతను దిగిపోతాడు.

ఇరవై నిమిషాల్లో స్టేషన్ వచ్చింది. చిన్న కుదుపుతో ఆగింది రైలు.

అతను లేచి సీటు కిందనించి తోలు పెట్టెను బయటకు లాగటానికి ముందుకు వొంగాడు. తిరిగి అతను ఆ పెట్టెతో నిలుచునేసరికి పక్కనే ముగ్గురు పోలీసులు ఒక సబ్ ఇన్‌స్పెక్టర్ మఫ్టీలో చక్రపాణి వున్నారు.

అతని మొహం పాలిపోయి అందులో భయం కనపడింది.

చక్రపాణి తోలు పెట్టెను విసురుగా లాక్కుని దాన్ని అక్కడే తెరిచాడు.

దాన్నిండా కొత్త వందరూపాయల నోట్ల కట్టలు పేర్చి వున్నాయి.

"మై గాడ్!" అన్నాడు చక్రపాణి.

మరుక్షణంలో పోలీసులు అతన్ని కిందికి లాక్కెళ్లారు.

నిమిషాలమీద ఆ వార్తను హైదరాబాద్‌లోని పోలీసు హెడ్‌క్వార్టర్స్‌కు తెలియజేశాడు చక్రపాణి.

"ఇక నేను వెళతాను" అన్నాడు జమదగ్ని.

"నీలో వున్న అద్భుత శక్తికి నా జోహార్లు. పోలీసు డిపార్టుమెంటు నీకు యెంతగానో రుణపడి వుంది. గొప్ప విలువైన దొంగను మాకు పట్టించావు. నీ ఎడ్రసు ఇచ్చి వెళ్ళు. నేరస్థులను పట్టుకోవటంలో అవసరమయినప్పుడు నీ సహాయం తీసుకుంటాం" అన్నాడు చక్రపాణి.

తన ఎడ్రసు చక్రపాణికిచ్చి మళ్ళీ రైల్లో ఎక్కాడు జమదగ్ని.

ఇంటికి వచ్చిన తర్వాత ఆ గొలుసు దొంగతనం చేసిన మనిషి గురించి చెప్పి తనెలా వాడిని పట్టించాడో వివరంగా తల్లిదండ్రులతో చెప్పాడు జమదగ్ని.

వాళ్ళు ఆశ్చర్యపడకుండా వుండలేకపోయారు.

"నమ్మలేకుండా వున్నాం. కాని నువ్వు చెబుతున్నావు కాబట్టి నమ్మక తప్పదు. అతనే తీశాడనీ అలా చేశాడనీ నీకెలా తెలిసింది?" అనడిగాడు తండ్రి.

"ఏమో అదే నాకూ తెలీదు. అతన్ని చూడటంతో నే నా కళ్ళముందు జరిగిపోయినట్టుగా అంతా కనపడింది. కనపడినట్టుగానే జరిగింది. సేట్ దగాచంద్ అతనే ఆ గొలుసును తెచ్చి తనదగ్గర తాకట్టు పెట్టినట్టుగా చెప్పాడు" అన్నాడు.

"నీలో యేదో అద్భుత శక్తి వుంది....నమ్మకుండా వుండలేను" అన్నాడాయన.

జమదగ్ని రైల్లో దొంగను పోలీసులకు పట్టివ్వటం గురించికూడా వాళ్ళకి చెప్పాడు.

ఆయన మళ్ళీ ఆశ్చర్యపడ్డాడు.

తల్లి కంగారు పడింది.

"నీకెందుకు? ఆ ముఠాలో మిగిలిన దొంగలకు నీ గురించి తెలిసిందంటే వాళ్ళు నీమీద కక్ష కడతారు" అన్నది భయంగా—

జమదగ్ని తేలిగ్గా నవ్వి—"నీకు అటువంటి భయం అవసరంలేదు. వాళ్ళు నాకు తెలీకపోయినా వాళ్ళెవరో నన్నేం చెయ్యాలనుకుంటున్నారో తెలుసుకోగలను" అన్నాడు.

"ఏమైనా నువ్వు పొరపాటు చేశావు. నీ గురించి

పోలీసు ఇన్‌స్పెక్టర్‌కి చెప్పకుండా వుండే బావుండేది"
అన్నాడు తండ్రి.

"ఫర్వాలేదులే" అన్నాడు జమదగ్ని.

తెల్లారి ఉదయం అన్ని దినపత్రికల్లో రైల్లో దొరికిన బ్యాంకు దోపిడీ దొంగ గురించిన వార్త వచ్చింది. ఆ దొంగను తన అద్భుత శక్తితో మాపులతో నే గుర్తించి పట్టించి ఇచ్చిన జమదగ్ని గురించికూడా వాళ్లు రాశారు. అందులో జమదగ్ని ఎడ్రసు వివరాలుకూడా వున్నాయి.

ఆ రోజు సాయంత్రం యెన్నో రకాల పత్రికల విలేఖర్లు జమదగ్ని ఇంటికి వచ్చారు. అతన్లో వున్న అద్భుత శక్తి గురించి రకరకాల ప్రశ్నలు అడిగారు.

వాళ్ళ ప్రశ్నలన్నింటికీ అతను ఒక్కటే జవాబు చెప్పాడు.

"ఈ మధ్యనే ఈ అద్భుత శక్తి నాలో కలిగింది. కొంతమంది మనుషులను చూసినప్పుడు వాళ్ళ చరిత్ర గురించి నాకు తెరపై చూసినట్టుగా కనపడుతుంది. ఈ శక్తి నాలో ఎలా కలిగిందో నాకు తెలీదు. ఎంతకాలం వుంటుందో నాకు తెలీదు."

జమదగ్ని ఫోటోని తీసుకుని వెళ్ళిపోయారు పత్రికా విలేఖర్లు అంతా.

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత "నాకేమిటో భయంగా వుంది" అన్నది అతడి తల్లి.

"భయమెందుకు? ఇది మీరెంతగానో సంతోషపడ వలసిన విషయం. ఈ దెబ్బతో మన గురించి యెంతో మందికి తెలుస్తుంది. చెప్పలేనంత పబ్లిసిటీ వస్తుంది" అన్నాడు జమదగ్ని.

"నువ్వు యెన్నయినా చెప్పు.... నా భయం పోవటం

లేదు. ఇంకెప్పుడూ యెవరి గురించి తెలిసినా యెవరికీ చెప్పకు" అన్నదామె.

జమదగ్ని "సర్లే.... చెప్పనులే" అన్నాడు నవ్వుతూ-

## 8

సన్నగా—పొడుగ్గా ఎండిపోయిన వాడిలా వున్నాడతను. అలా వున్నా అతడి శక్తి అమోఘం. అతడే అక్కడ వున్న నేరస్తులందరికీ నాయకుడు.

గొప్ప గొప్ప బేంక్ దోపిడీలకు అతడే తిరుగులేని పథకాలను తయారుచేస్తూ వుంటాడు.

ఒకసారి గొంతు సవరించుకుని "మిమ్మల్నందరినీ ఇంత హాఠాత్తుగా ఇక్కడ కలుసుకోమని యెందుకు చెప్పానో తెలుసుకుని వుంటారు. ఈ పేపర్లలో వచ్చిన వార్త గురించీ — వీటిల్లో ప్రచురించిన ఈ మనిషి ఫోటోని మీరంతా చూశారనుకుంటాను.

"ఇటువంటి మనిషి ప్రపంచం మొత్తంలో కేవలం ఇలాంటివాడు ఒక్కడు వున్నా యేడాదిలో ప్రపంచం లోని నేరస్తులందరినీ పోలీసులు పట్టుకుని జైళ్ళలో పెడతారు. నిజంగానే వీడు అద్భుతమైన మనిషి. మన వేషం చూసి తెలుసుకుంటాడనుకుంటే రకరకాల వేషాలు వేసుకు తిరగొచ్చు. కాని మనిషిని చూడగానే వాడి హిస్టరీ అంతా చెప్పేస్తాడుట. అందువల్ల మనం చెయ్యగలిగింది యేమీ లేదు."

"నిజమే.... ఈ వార్త చదివిన తర్వాత బయటకు వెళ్ళాలంటే భయంగా వుంది" అన్నారు ఎదురుగా కూర్చున్న ఇరవై మందిలో కొందరు.

"భయపడితే మనం దోపిడీలు చెయ్యలేము. ఐదు లక్షల రూపాయలలో మన సభ్యుడు గరుడాచలం ఆ

యువకుడి కారణంగా పట్టుబడిపోయాడనే వార్త నన్ను బాగా కుంగదీసింది. ఇలాంటి శక్తి వున్న మనిషి బతికి వుండగా మనంకాని, మనలాంటి నేరస్థులు కాని ఈ దేశంలో బతకలేరు. అందుకే వాడు చావాలి.... ఈ జమదగ్ని ఈ లోకంలోనే వుండకూడదు" అన్నాడు అతను.

"అవును. ఈ లోకంలో వుండకూడదు. వెంటనే వాడి పరలోక ప్రయాణానికి యేర్పాట్లు చెయ్యాలి" అన్నారు వాళ్ళంతా.

"గుడ్ .... నా ఉద్దేశంకూడా అదే .... వీలైనంత వేగంగా వాడ్ని అంతచెయ్యాలి. ఆ జమదగ్నిని హత్య చేసిన మనిషికి పాతిక వేలు బహుమతినికూడా ప్రకటిస్తున్నాను. వెళ్ళండి....మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి" అన్నాడు.

సభ్యులు సంతోషంగా లేచి నిలబడ్డారు.

జమదగ్నికోసం వేట మొదలయ్యింది.

## 9

శమంతను వెంటనే కలుసుకోవాలనుకున్నాడు కాని వీలుకాలేదు జమదగ్నికి. తర్వాత పత్రికా విలేఖర్లతోనే సాయంత్రం వరకు కాలం గడచిపోయింది.

ఆరు గంటలు కావస్తున్నప్పుడు ఇంటినించి బయటకు వచ్చాడు. ఎక్కడకు వెళుతున్నదీ ఇంట్లో చెప్పలేదు.

ఒకసారి తనకాబోయే భార్య శమంతతో సినిమాకు వెళ్ళివచ్చినట్టుకూడా అతను ఇంట్లో ఎవరికీ చెప్పలేదు.

అతను వెళ్ళేసరికి ఆరున్నరయ్యింది.

కిళ్లీ బంకు దగ్గర నిలుచున్నాడు.

ఐదు నిమిషాలకు శమంత చెల్లెలు రేణుక ఇంట్లో నించి

బయటకు రోడ్డుమీదకు వచ్చింది.

"శమంత వుందా?"

"లేదు. సరళతో కలసి సినిమాకు వెళ్ళింది అరగంట క్రితం."

"ఏ సినిమాకు?" అడిగాడు.

చెప్పింది రేణుక.

ఆ థియేటర్ అక్కడకు ఎక్కువ దూరంలేదు. నడిచే వెళ్ళాడు.

బుక్కింగ్ తెరిచే వుంది. ఆ సినిమా వచ్చి చాలా రోజులయ్యింది. జనం యెక్కువగా లేరు. టిక్కెట్టు తీసుకుని లోపలకు వెళ్ళాడు.

లైట్లు వెలుగుతున్నాయి.

లోపలకు ఎంటరయిన జమదగ్నిని చూసి చప్పట్లు కొట్టింది శమంత ఒక చివర్నించి.

చూసాడు.

శమంత మనోహరంగా నవ్వింది.

షాక్ తిన్నాడు జమదగ్ని.

అతడి మనసులో యే కార్నర్‌లోనో ఆమె గురించి తెలుసుకోవాలన్న కోరిక వుంది.

జమదగ్నిలోని అద్భుత శక్తి పనిచేస్తోంది.

శమంత చరిత్ర అతడి కళ్ళముందు గిర్రున తిరిగింది. క్షణంలో అతని మొహంలో భావాలు మారిపోయాయి. అతని మొహం చూసి ఆశ్చర్యపడింది శమంత.

"దారుణంగా మోసపోయాను" అనుకుంటూ రివ్వున బయటకు వచ్చేశాడు.

శమంత చరిత్ర ఇంత ఘోరమైనదా?_అనుకున్నాడు.

పది నిమిషాల తర్వాత జమదగ్ని గేటు తెరుచుకుని

మెట్లెక్కి ఓ మేడమీది గదిలోకి వెళ్ళాడు.

ఆ గదిలో పాతికేళ్ళ యువకుడు డిటెక్టివ్ నవల చదువుకుంటున్నాడు.

"ఎవరు కావాలి?" అనడిగాడు.

"మీరే."

"ఎందుకు?"

"మీతో పనుంది. నా పేరు జమదగ్ని. నా స్నేహితుడి పేరు నిరంజనరావు. అతను శమంత అనే అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. కాని ఆ అమ్మాయి కారెక్టర్ మంచిదికాదని, ఇంతకుముందు మీతో ఆమెకు బాగా పరిచయం వుందనీ నాకు తెలిసింది. నిజమో—కాదో తెలుసుకోవాలని వచ్చాను" అన్నాడు జమదగ్ని.

అతను ఇబ్బందిగా ఫీలయ్యాడు.

"ఫర్వాలేదు. నిజం చెప్పండి. నా స్నేహితుడు శమంతను ప్రేమించలేదు. పెళ్ళిచూపులు అయినాయి. ఇందులో అతను బాధపడతాడనే ఆలోచనలేదు. కాని నిజంగా ఆమె కారెక్టర్ మంచిది అవకపోతే అతను జీవితమంతా కుమిలిపోతాడు. ప్లీజ్—మీకు తెలిసిన నిజం చెప్పండి."

"నిజానికి శమంత పెళ్ళి చెడగొట్టటం నాకు ఇష్టం లేదు. కాని మీ మనసులో ఒక అనుమానం వుంది. అందువల్ల నిజం చెప్పక తప్పదు. శమంతను నేను ప్రేమించాను. పెళ్ళిచేసుకోవాలనుకున్నాను. అందువల్లనే శారీరకంగా ఆమెకు దగ్గరయ్యాను. కాని శమంతకు ఇంతకుముందే ఆమె బావతో శారీరక సంబంధం వుందని నమ్మకంగా తెలిసింది. గట్టిగా అడిగిన తర్వాత శమంత ఒప్పుకుంది. బావ తనని బలవంతం చేశాడని అందులో తన

తప్పులేదని చెప్పింది. చెడిపోయిన ఆడదాన్ని పెళ్ళిచేసు కునే విశాల హృదయం నాకు లేదు. అందుకే శమంతను వదులుకున్నాను" అన్నాడతను.

"థాంక్ యూ...శమంతను పెళ్ళిచేసుకోవాలనుకున్న ఇడియట్‌ని నేనే. అమాయకమైన ఆమె కళ్ళని చూసి మోసపోయాను" అన్నాడు జమదగ్ని.

"మీరేనా!" ఆశ్చర్యంగా అడిగాడతను.

"అవును. నిజం తెలుసుకోటానికి అబద్ధం చెప్పాను. యేమైనా నన్నో గొప్ప ప్రమాదంలోనించి రక్షించారు. థాంక్స్ థాంక్ యూ మై ఫ్రెండ్" అని మెట్లు దిగి రోడ్డుమీదకు వచ్చేశాడు జమదగ్ని.

# 10

వీధి దీపాలు వెలుగుతున్నా జమదగ్ని కళ్ళముందు అంతా చీకటిగానే కనపడింది.

తనలో ప్రవేశపెట్టబడిన అద్భుత శక్తి కారణంగా తనో గొప్ప ఫూలినించి బయటపడ్డాడు.

అందమైన కళ్ళతో — ఎర్రని పెదవులతో తనని ఫూల్‌ని చేసింది శమంత. ఈ అద్భుత శక్తి తనలో లేకుండా వున్నట్టయితే తనకు శమంత గురించి యేమీ తెలిసేది కాదు. పెళ్ళయిన తర్వాత తెలిసినా తనేం చెయ్యగలిగేవాడు? ఏం చేసినా తన జీవితం నాశనం అయ్యేది.

జమదగ్ని మనసంతా ఈ సంఘటనతో వికలమయి పోయింది.

రోడ్డుమీద మనుషులు ఎదురొస్తున్నారు.

పార్కు దగ్గరకు వచ్చాడు జమదగ్ని. ఒకవైపు గోడ పడిపోయివుంది పార్కుకి. దట్టంగా చెట్లు-అక్కడక్కడ

సిమెంటు బెంచీలు వున్నాయి. పార్కు వెనకవైపు రైల్వేలైను వుంది.

లోపలకు వెళ్ళి సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. అతనికి కొంచెం దూరంలో నలుగురు మనుషులు ఆఫీసు వ్యవహారాల గురించి మాట్లాడుకుంటున్నారు.

జమదగ్ని ఆలోచనలన్నీ శమంత గురించే వున్నాయి.

ఆడవాళ్ళని నమ్మకూడదు. శమంత గురించి ఇంటికి వెళ్ళగానే చెప్పాలి—ఇలా అనుకున్నాడు అతను.

ఆలోచనలతో అతడికి యెంత టైము గడిచిందీ తెలీలేదు.

పార్కులో యెక్కడో ఒక మూల దీపం గుడ్డిగా వెలుగుతోంది. జమదగ్ని కూర్చున్న చోటుకు వెలుతురు రాకుండా పొడుగాటి చెట్లు అడ్డుకుంటున్నాయి. అక్కడ కొంచెం చీకటిగా వుంది.

రైలుపట్టాల వైపునించి ముగ్గురు మనుషులు పడిపోయిన పార్కు గోడమీదగా లోపలకు రావటాన్ని జమదగ్ని తెలుసుకోలేకపోయాడు.

పార్కులో అతను ఒక్కడే వున్నాడు.

అంతా ఎప్పుడో వెళ్ళిపోయారు.

హఠాత్తుగా ఒకడు జమదగ్ని నోరు మూశాడు. ఉలిక్కిపడ్డాడు అతను.

జమదగ్ని ఏం జరుగుతున్నదో తెలుసుకునేలోపలే అతని యెదురుగా వచ్చిన ఇద్దరు మనుషులూ పొడుగాటి కత్తులను అతని గుండెలో బలంగా దించారు. చిన్నగా మూల్గి రెండు పోట్లకే తలవాల్చేశాడు జమదగ్ని.

"చచ్చిపోయాడు" అన్నాడు ఒకడు.

"వీడ్ని చంపి — ఈ దేశంలో మనలాంటి నేరస్థు

లందరికీ యెంతో మేలు చేశాం—" అన్నాడు రెండో వాడు.

"పాతిక వేల రూపాయల బహుమతిని మన ముగ్గురం సమానంగా పంచుకోవాలి" అన్నాడు మూడో వాడు.

ముగ్గురూ నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

జమదగ్ని శవం పార్కులో సిమెంటు బెంచీముందు నె త్తురుమడుగులో బోర్లా పడివుంది.

ఇప్పుడు ఆతనిలో అద్భుత శక్తిలేదు. దానికోసం అతడు పడిన తపన—చివరకు అతడి ప్రాణమే తీసింది.

అతడి శవాన్ని వెంటనే యెవరైనా చూడగలిగితే— రేపటి పేపర్లో అదే సంచలన వార్త అవుతుంది.

—: అయిపోయింది:—

# మంచి కుటుంబం

## వసుంధర

క్రిల్లర్ మొబైల్ వ్యాన్ రామాలయం వీధిలో ఆగింది. అందులోంచీ డిటెక్టివ్ కిల్లర్ బయటకు వచ్చి పక్కనే వున్న కిళ్ళీకొట్టు వద్దకు వెళ్ళాడు.

"ఏ బ్రాండు కావాలిసార్!" అనడిగాడు కిళ్ళీ కొట్టతడు.

"నాలుగురోజుల క్రితం న్యూసు పేపర్సు కావాలి. సిగరెట్లక్కర్లేదు...." అన్నాడు కిల్లర్.

"పాతవి నా దగ్గరుండవు సార్. తెలిసినవారింట్లో అడిగి తీసుకోండి—...."

"ఈ ఊళ్ళో నాకు తెలిసినవాళ్ళెవరూ లేరే?" అన్నాడు కిల్లర్—"పోనీ నీకు తెలిసిన వారెవరైనా వుంటే చెప్పు...."

"ఈ వీధిలో అంతా నాకు తెలిసిన వాళ్ళే సర్...."

"అయితే నేనిక్కడ నిలబడతాను. నువ్వెళ్ళి నాకు

పేపరు తెచ్చి పెట్టు. డబ్బు లిస్తానే...." అన్నాడు కిల్లర్.

"కొత్తవాళ్ళకు షాపు వదిలి వెళ్ళొద్దని మా నాన్న చెప్పాడు. ఏమీ అనుకోకండి సార్!" అన్నాడు కిళ్ళీ కొట్టతడు.

కిల్లర్ ముందుగా కిళ్ళీకొట్టతడికి యెంతడిగితే అంత డబ్బు సెక్యూరిటీగా యిద్దామనుకున్నాడు. కానీ అంత లోనే అతడి బుర్రలో ఏదో మెరిసింది.

"ఈ వీధిలో యిటీవల ఎవరింట్లోనైనా నేరాలు జరిగాయేమో చెప్పు...." అన్నాడతడు.

"ఎందుకు సార్?" అన్నాడు కిళ్ళీకొట్టతడు కుతూహలంగా.

"నేను డిటెక్టివ్‌ను...."

"మీ పేరు?"

"కిల్లర్ ...."

కిళ్ళీ కొట్టతడు తెల్లముఖం వేసి—"యుగంధర్ పేరు విన్నాను కానీ మీ పేరెప్పుడూ వినలేదు...." అన్నాడు.

"ఇప్పుడు విన్నావుగా!" అన్నాడు కిల్లర్.

"కిల్లర్ ... కిల్లర్ ...." అని అతడు తనలోనే రెండు సార్లు గొణుక్కుని—"ఇది డిటెక్టివ్ కుండాల్సిన పేరు కాదు సార్!" అన్నాడు.

"ఎందుకని?"

"అదిగో—ఆ ఎదురింటి మేడలో ఒక హత్య జరిగింది. జరిగి రెండ్రోజు లయింది...." అన్నాడు కిళ్ళీ కొట్టతడు.

"అయితే?"

"హత్యలు చేసేవాణ్ని కిల్లర్ అంటారు...."

కిల్లర్ తనలో తను నవ్వుకుని—"డిటెక్టివు అంటే హత్య చేసేవాళ్ళైతే .... ఎటొచ్చీ నేరస్థుల్ని హత్య చేస్తారు...." అంటూ—"థాంక్స్ ఫర్ ది ఇన్ఫర్మేషన్....ఆ ఎదురింటి మేడలోకి వెడతాను...."అన్నాడు కిల్లర్.

## 2

కిల్లర్ వెళ్ళేసరికా మేడలో ఒకే ఒక్క స్త్రీ వుంది. ఆమె పేరు జగదాంబ. ఆమె ఆ యింట్లో వంటమనిషి. కిల్లర్ ఆమెను పలకరించి తను వచ్చిన పని చెప్పాడు.

"ఒక్క వంటిల్లు తప్ప ఈ యింట్లో నాకేమీ తెలియదు—" అందామె నిష్కర్షగా. ఆమె గొంతులో ఒక విచిత్రమైన భావం ధ్వనించింది.

"ఆ పేపరు యెంతో అవసరం. ఒక నిరపరాధిని రక్షించడాని కది ఉపయోగపడుతుంది—" అన్నాడు కిల్లర్.

"నువ్వు నిరపరాధుల్ని రక్షించగలవా?"

"నా శక్తి మేరకు నిరపరాధుల్ని రక్షించడమే నా జీవిత ధ్యేయం. నా పేరు కిల్లర్. నేనొక డిటెక్టివును."

"అయితే నా కొడుకును రక్షించు...." అందామె.

"ఏమయింది నీ కొడుక్కి?"

"ఈ యింటి యజమాని నవరాజా రెండ్రోజుల క్రితం హత్య చేయబడ్డాడు. నా కొడుకే హత్య చేశాడని పోలీసులు పట్టుకుపోయారు. ఆశలన్నీ వాడిమీదే పెట్టుకుని జీవిస్తున్నాను నేను. ఇప్పుడు నాకీ ప్రపంచం శూన్యమై పోయింది. నీకు చేతనైతే నా కొడుకును నిర్దోషిగా నిరూపించి—పోలీసుల బారినుండి విడిపించి—తిరిగి నా జీవి

తంలో వెలుగును నింపు. శూన్యాన్ని అంతం చేయి...."
అందామె.

"పోలీసులు నీ కొడుకు హంతకుడని అన్నారంటే అందుకేమైనా ఆధారాలుండాలి గదా!" అన్నాడు కిల్లర్.

"రోజూ రాత్రిపూట పడుకు నేముందు గవర్రాజుగారు మంచినీళ్ళలో ఏదో మందు కలుపుకుని త్రాగుతాడు. అది మా అబ్బాయే యిస్తాడు. ఆ పూట అందులో విషం కలిసింది. గ్లాసుమీద మావాడి వేలిముద్రలున్నాయి. విషంలేనప్పుడూ వాడి వేలిముద్రలుండేవని ఎంత చెప్పినా పోలీసులు వినిపించుకోలేదు...." అంది జగదాంబ. అప్పుడప్పుడే ఆమె కళ్ళు చెమ్మగిల్లడం ప్రారంభించాయి.

"హత్య చేయడానికి కారణముంటూ ఉంటుందిగదా! నీ కొడుకుకంత పెద్ద కారణమేముంటుంది?"

"వాడికి అయిదేళ్ళప్పుడు నే నీయింటికి వచ్చాను. అప్పట్నించీ వాడీ యింట్లో ఒక పిల్లాడిలాగే పెరిగాడు. గవర్రాజుగారు వాడిని కన్నకొడుకులా అభిమానించారు. పెంచారు. చదివించారు. వాడికి ఆయనంటే గౌరవముంది. కృతజ్ఞత వుంది...."

"మరైతే అతడాయన్నెందుకు చంపుతాడు?"

"అదే నేను పోలీసులకు చెప్పుకున్నాను...."

"అందుకు పోలీసులేమంటారు?"

"గవర్రాజుగారు రాసిన విల్లుగురించి వాళ్ళు చెబుతున్నారు...."

"విల్లులో ఏముంది?"

"ఆస్తినంతా ఆయన తన భార్య కాంతకూ, ముగ్గురు కొడుకులకూ పంచాడు. ఒక్క పైస కూడా మా అబ్బాయికి రాయలేదు. అయితే అందులో ఆశ్చర్యమేముంది?

నేనీ యింట్లో వంటమనిషిని. రఘురాం వంటమనిషి కొడుకు. ఎంత అభిమానమున్నా వంటమనుషులకీ, పనివాళ్ళకీ అసల్లో వాటాలిచ్చేవాళ్ళు అరుదు. రఘురాంకు గవ్రాజుగారి మీద కోపం వచ్చిందంటే అర్థంలేదు. కానీ పోలీసులలాగంటున్నారు...."

"అందుకు పోలీసులకేమైనా ఆధారాలున్నాయా?"

"గవ్రాజుగారబ్బాయిలు చెప్పిందాన్ని బట్టి పోలీసులలాగనుకున్నారు. రఘురాం వాళ్ళ దగ్గర గవ్రాజుగారిని నానామాటలూ అన్నాట్ట. ఇంత ఆస్తినీ తను తనవాళ్ళకే అంటగట్టాలనుకోవడం పచ్చి స్వార్థం అన్నాట్ట. మాటల సందర్భంలో రెచ్చిపోయి ఆయన్ని చంపేస్తానని కూడా అన్నాట్ట...." జగదాంబ ఆగి ఏడ్వడం మొదలు పెట్టింది.

కిల్లర్ ఆమె మాటలు శ్రద్ధగా విన్నాడు.

కథలో ఏదో తిరకాసుంది. రఘురాం గవ్రాజు ఆస్తిలో వాటా వస్తుందని ఎలా ఊహించాడు? జగదాంబకూ గవ్రాజుకీ ఏమైనా వ్యవహారముందా?

ఆ విషయమలాగుంచితే హత్య చేయాలన్న ఉద్దేశ్యమున్నవాడెప్పుడూ తగిన జాగ్రత్తలో ఉంటాడు. ముందుగా తన మనసులోని మాటను బైటకు రానివ్వడు. ఆవేశంలో ఇష్టం వచ్చినట్లు వాగేవాడు నేరాలు చెయ్యడు.

జగదాంబ ఏడుపు ఆపేక — "గవ్రాజుగారబ్బాయిలకీ—రఘురాంకీ మనస్పర్థలున్నాయా?" అనడిగాడు కిల్లర్.

"లేవు...."

"ఎలా చెప్పగలవు?"

"చెప్పాలంటే గవ్రాజుగారబ్బాయిలకున్న

వినయం, శాంతం మా వాడికి లేవు. ఏదెంత చాకిరీ అయినా చేస్తాడు కానీ మాట పడడు. పైగా నోటి దురుసుతనముంది. రఘురాంని వాళ్ళెప్పుడూ మంచిగా అర్థం చేసుకున్నారు తిప్ప యెప్పుడూ పల్లెత్తు మాటన లేదు.

గవర్రాజుగారి భార్య శాంత అంటే వాడికి నాకంటే యెక్కువ గౌరవభావం. ఆవిడ వాణ్ని గారాల కొడుకను చూసినట్లు చూసుకునేది. వాడేమన్నా పడేది. వాడికిష్టమైనవన్నీ చేసిపెట్టేది. ఈ యింట్లో యెవరైనా నాలుగుకోజా లుంటే గవర్రాజుగారికి నలుగురు పిల్లలనుకునేవారు. వారిలో రఘురాంకి గారవెక్కువ అనుకునేవారు. నన్ను మాత్రం అంతా వంటమనిషిగానే భావించారు. ఎందుకంటే నేను నా అంతస్తు తెలుసుకుని మసిలేదాన్ని. ఎంత చెప్పినా రఘురాంకి అంతస్థు తెలుసుకుని మసలడం వచ్చేదికాదు...."

"అయితే గవర్రాజు కొడుకు లబద్ధం చెప్పి ఉండరు...."

జగదాంబ ఒక్కక్షణం ఏమీ మాట్లాడలేదు.

"రఘురాం ఆ హత్య చేశాడని వాళ్ళు కూడా నమ్ముతున్నారా?"

"ఆఁ" అంది జగదాంబ.

"అందుకు వాళ్ళకేవో ఆధారాలుండే ఉండాలి. వాళ్ళంతా మంచివాళ్ళని నువ్వే అంటున్నావు...."

"ఎంత మంచివాళ్ళైనా యెవరి స్వార్థం వారికుంటుంది. ఇంట్లో హత్య జరిగింది. రఘురాం ఆ హత్య చేశాడనడానికి ఆధారాలున్నాయి. దీన్నింతటితో వదిలేస్తే

సరిపోతుంది. రఘురాంమీద ఎంత అనుమానం పెరిగితే వారికంత లాభం. ఇప్పుడు రఘురాం నిర్దోషని నిరూపించాలంటే—తీగ లాగితే డొంకంతా కదిలినట్లవుతుంది. అందువల్ల నష్టం గజపతిరాజుగారి కుటుంబానికే!" అంది జగదాంబ.

"నీ కెవరిమీదయినా అనుమాన ముందా...."

"పాపం మాటలు అనలేను. వాళ్ళందరూ పుణ్యాత్ములు. హత్యలు చేసేరకాలు కారు...."

"వాటం చూస్తే యింట్లోవాళ్ళే యెవరో హత్య చేసివుంటా రనిపిస్తోంది. ఒకవేళ మీ అబ్బాయే చేశాడేమో!"

"వాడికీ కుటుంబమంటే ప్రాణం.... ఈ కుటుంబానికింత దుఃఖం కలిగించే పని చేస్తాడని నేననుకోను...." అంది జగదాంబ.

"నీలో నిజయితీ వుంది. కృతజ్ఞత వుంది. నిన్నూ, నీ కొడుకునూ దేవుడు తప్పక రక్షిస్తాడు...." అన్నాడు కిల్లర్.

"నువ్వు రక్షించలేవా?" అంది జగదాంబ.

"ఆ దేవుడు నన్ను నీ దగ్గరకు పంపాడేమో...." అని...."ఒక్కసారి పాత పేపర్లు చూపిస్తావా?" అనడిగాడు కిల్లర్.

"తప్పకుండా...." అంటూ ఓ గదిలోకి వెళ్ళి ఓ కట్ట తెచ్చి అతడిముందు పడేసింది జగదాంబ. కిల్లర్ ఆత్రుతగా వెతికాడు. అతడి క్కావలసిన పేపరూ దొరికింది, సమాచారమూ దొరికింది.

"నీ కారణంగా ఈ రోజొక నిరపరాధి రక్షింపబడుతున్నాడు...." అన్నాడు కిల్లర్.

"మా రఘురాంని కూడా రక్షించు బాబూ...."
అందామె.

"తప్పకుండా ప్రయత్నిస్తాను...." అని—"అన్న ట్రీ యింట్లో ఎవరూ వున్నట్లు లేదే?" అన్నాడు కిల్లర్.

"తను పోతే కర్మకాండ పుట్టినూర్లో జరగాలని ఆయన కోరిక. ఇక్కడకు దగ్గర్లోనే వున్న వేమవరం ఆయన పుట్టిన గ్రామం...."

"అదాయన తండ్రి ఊరా? అత్తవారి ఊరా?" అన్నాడు కిల్లర్.

"రెండూ ఒకటే ఆయనకు. భార్యాభర్తలవి ఇరుగు పొరుగిళ్ళు...."

"సరే—...." అంటూ లేచాడు కిల్లర్.

"నువ్వు వేమవరం వెళ్ళొద్దు. కర్మకాండ అయ్యాక వాళ్ళే యిక్కడకు వస్తారు. పోలీసుల కూ్కడా వాళ్ళు అలాగే చెప్పారు...." అంది జగదాంబ.

"సరే!" అన్నాడు కిల్లర్.

"బాబూ! నువ్వు నిజంగా నా కొడుకు తరఫున పని చేస్తావా?" అంది జగదాంబ. ఆమె కళ్ళలో ఆశ పక్కనే అనుమానం కూడా వుంది.

"ఎందుకు నీ కా అనుమానం?"

"నేను ఫీజు ఇచ్చుకోలేను...."

"ఫీజు నేను దేవుడి నుంచి రాబట్టగలనులే—సెలవు...."

కిల్లర్ వెళ్ళిపోతూంటే జగదాంబ అతడి వంకే చూసింది. ఇప్పుడామె కళ్ళలో ఆశ పక్కన అనుమానానికి బదులు ఉత్సాహముంది.

# 3

"అయాం డిటెక్టివ్ కిల్లర్"!

ఇన్‌స్పెక్టర్ విశ్వనాథ్ చేతులు చాపి షేక్‌హాండిస్తూ "గ్లాడ్ టూ మీట్యూ!" అన్నాడు.

ఇద్దరూ యెదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నారు.

"చెప్పండి—" అన్నాడు విశ్వనాథ్.

"గవర్రాజు హత్య కేసు విషయంలో యిలా వచ్చాను...."

"ఏమిటి మీ ఇంట్రస్టు...."

"ఎవరూ నన్ను నియమించలేదు...." అంటూ కిల్లర్ అతడికి జరిగింది చెప్పి—"రఘురాం గురించి నా కాస్త జాలి పుట్టింది—" అన్నాడు.

"కానీ మీ రతడికి సాయపడలేరు. ఇది చాలా స్ట్రెయిట్ కేసు...."

"మైక్రోస్కోపుతో చూస్తే నున్నటి ఉపరితలం కూడా ఎత్తుపల్లాలతో నిండివుంటుంది. ఒక అమాయ కుణ్ని రక్షించడంకోసం మనం మైక్రోస్కోపు వాడక తప్పదు...."

విశ్వనాథ్ నవ్వి—"మీ అభిప్రాయంతో ఏకీభవించ లేను. కానీ మీకు సహకరించగలను. రఘురాం నిజంగా అమాయకుడయితే—అది మీరు ఋజువుచేస్తే నాకూ సంతోషమే! నాకు సంబంధించినంతవరకూ పరిశోధన పూర్తి అయింది..." అన్నాడు.

"మీ పరిశోధన గురించి తెలుసుకోవచ్చా?"అన్నాడు కిల్లర్.

"ష్యూర్!" అన్నాడు విశ్వనాథ్.

అతడు కిల్లర్‌కు తన యిన్వెస్టిగేషన్ రిపోర్టు వినిపిం

చాడు.

ముందు గవర్రాజు భార్య శాంతాదేవి!....

ఆమె గొంతు దుఃఖంతో పూడుకుపోయి వుంది.

హత్య జరగడానికి రెండ్రోజులకు ముందామె పుట్టింటికి వెళ్ళింది. అదీ రఘురాం బలవంతంమీద! రఘురాంకు తన జాతకంలో ఏదో లోపముందని అనుమానం. వేమవరంలో రామలింగేశ్వరాలయ మొకటుంది. అక్కడ పూజ చేయించుకుంటే యెంతటికష్ట జాతకుడికీ—మంచి రోజులు వస్తాయని ఒకసారి శాంతి అతడికి చెప్పింది. ఇప్పుడు తన పేరున ఆ పూజ చేయించమని వాడామెను కోరాడు. ఆ పూజ శాంతాదేవి స్వయంగా తన గురించి చేయించాలన్నాడు.

"నా భవిష్యత్తు గురించి నా కన్నతల్లి కంటే ఎక్కువగా మీరు బాధ పడుతున్నారు. మీరు చేయిస్తేనే నాకు పూజ ఫలిస్తుంది....అన్నాడు వాడు....అది నిజమే ననుకున్నాను. వాడి కడుపులో ఇంకటి దారుణం ఉన్నదని నాకు తెలియదు...." అందామె ఏడుస్తూ.

హత్య జరిగి నప్పుడామె వేమవరంలోనే ఉంది. కబురు తెలిసి యిక్కడకు వచ్చింది. తర్వాత పోలీసులు భర్త శవా న్నప్పగించగానే తిరిగి వేమవరం వెళ్ళిపోయింది.

ఆమెకు రఘురాం అంటే ఏహ్యభావం లేదు. వాడి నామె ముద్దుగా దుడుకు వెధవ అని చెప్పింది. వాడి కామె వద్ద కన్నతల్లిని మించిన చనువుంది. అందు కామె కారణం చెప్పింది.

ఇంట్లో ముగ్గురు వర్రాళ్ళున్నప్పుడు ఆ ఈడు వర్రాదే యొంకొక డుంటే—వాడు అంతఃపురంలో తక్కువ మని

పైతే—వాణ్ని పూర్తిగా పనివాడిలాగే చూడాలి. లేదా సమాన స్థాయివ్వాలి. మధ్యరకంగా చూస్తే వాళ్ళు మానసికంగా దెబ్బతింటారు. అందుకే చిన్నతనం నుంచీ ఆమె వాణ్ని కన్న కొడుకులాగే పెంచింది.

"వాడు మిమ్మల్ని కన్నతల్లిగానే భావించాడా?" అనడిగాడు ఇన్ స్పెక్టర్ విశ్వనాథ్.

"లేదు. వాడికి నా దగ్గర చనువుంది. గారాం చేసేవాడు. మారాం చేసేవాడు. కానీ మాటి మాటికీ— నేను నీ కొడుకును కాదుగా! నీ వంటమనిషి కొడుకునుగా.... అనేవాడు. అయితే యేం....నీకా తేడా కనిపించలేదుగా అంటే...."అదే లేదా?" అనేవాడు....వాడు మనసులో యేదో మథనపడుతూండేవాడని నాకు తెలుసు...."

"అదేమిటో తెలుసుకుందుకు ప్రయత్నించలేదా?"

"ప్రయత్నించాను. వాడికి తండ్రి లేడు. తల్లి విధవ. తండ్రి లేని లోటు యెన్నో రకాలుగా ఫీలవుతూండేవాడు...."

"ఎన్నో రకాలుగా అంటే?"

"ఉదాహరణకు వాడి తల్లి విధవ. మామూలుగా ఆమెను గౌరవించినప్పటికీ శుభకార్యాలకూ వాటికీ ఆమెను యెదురురానిచ్చేవాళ్ళు కాదు. మన సంప్రదాయంలో విధవపట్ల ఉండే దురాచారాలన్నీ ఆమెపట్ల మేము పాటించాం. ఎందుకంటే మేము సంప్రదాయం పాటించే మనుషులం. అందులో తప్పొప్పుల గురించి ఆలోచించే అలవాటులేదు....ఒకసారి వాడు నాతో యీ విషయమై వాదనకు దిగాడు. ఈ సంప్రదాయం అర్థం లేనిదన్నాడు. అర్థం లేకపోయినా పాటించడం అలవాటై

పోయిందన్నాను. అప్పుడు వాడు....” అని ఆమె మళ్ళీ ఏడ్వడం మొదలెట్టింది.

"ఏమయింది మేడమ్?"

"నువ్వు కూడా విధవ అయితే నీ కా అలవాటులోని బాధ అర్థమవుతుంది....అన్నాడు....” అందామె యేడుస్తూనే.

"అప్పుడు మీరేం చేశారు?"

"వాడిని నానా తిట్లూ తిట్టాను. వాడు కూడా వెంటనే అక్కణ్నించి వెళ్ళిపోయి—రాత్రికి వచ్చి క్షమార్పణ అడిగాడు.”

"వాడిని మీరు క్షమించారా?"

"కుసుక వెధవ. వాడి నోటికి అడ్డు అదుపు వుండవు. అంతేనని అప్పుడనుకున్నాను తప్పితే వాడి కడుపులో ఇంతటి దురూహ వుందని ఊహించలేకపోయాను.”

కిల్లర్ ఆ మాట విని భారంగా నిట్టూర్చి "ఒక వంట మనిషి కొడుక్కి ఏ యింట్లోనూ ఇలాంటి ఉన్నతస్థానం లభించదు....” అన్నాడు.

"దానికీ మన కేసుకూ సంబంధం లేదు. మీరు గజరాజుగారి పెద్దబ్బాయి జగదీష్ తో ఇంటర్వ్యూ వినండి....” అన్నాడు విశ్వనాథ్.

జగదీష్ వయసులో రఘురాం కంటె రెండేళ్ళు పెద్ద. మెకానికల్ ఇంజనీరింగ్ ఫస్టు క్లాసులో ప్యాసై ఆ ఊళ్ళోనే ఆటోమొబైల్ గ్యారేజి తెరిచాడు. అది చక్కగా రన్ అవుతోంది. స్వయంగా ఏదైనా ఫ్యాక్టరీ పెట్టాలని ఆలోచిస్తున్నాడు. అతడికి రఘురాం అంటే అభిమానముంది.

"షార్ట్ టెంపర్డ్ ఫెలో!" అంటాడతడు.

వయసులో పెద్దవాడని అతణ్ణి రఘురాం ఏ మాత్రం గౌరవించేవాడు కాదు. ఎప్పుడైనా హడావుడి అయితే అతడి పనులు మిగతా యిద్దరు తమ్ముళ్ళూ చేసిపెట్టేవారు తప్పితే రఘురాం చేసేవాడు కాదు. ముఖ్యంగా బట్టల ఇస్త్రీ, బూట్ పాలిష్ వంటివి చేయడం అతడు చిన్నతనంగా భావించేవాడు.

"వాడిలో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుంది. అది పోగొట్టడానికి చాలా ప్రయత్నాలు చేశాం. నేనే ఒకసారి వాడి బూట్లు పాలిష్ చేసి—బట్టలు ఇస్త్రీ చేశాను. అప్పుడు వాడు నన్ను మెచ్చుకోలేదు పైగా అది ట్రాప్ అన్నాడు. ఒకసారి నేనలా చేస్తే సిగ్గుపడి వాడు ఆ పనులు చేయడం మొదలెడతాట్ట. అలా అవి వాడికి అలవాటై పోతాయట. వాడిని పనివాడి స్థాయికి దింపడమే నా ఆశయమట. కానీ ఆ ట్రాప్ కు వాడు లొంగనన్నాడు...."

"చాలా చిత్రమైన సైకాలజీ ...అలాంటి వాడిని మీరెలా భరించగలిగారు?" అనడిగాడు విశ్వనాథ్.

"వాళ్ళు మాకు బాగా దూరపు బంధువులు. భర్త పోయి ఎవరూ ఆదరించేవారు లేకపోతే అమ్మ ఆ తల్లీ కొడుకులను మా యింటికి తీసుకువచ్చింది. తల్లీ కొడుకులిద్దరివీ విపరీత మనస్తత్వాలు. ఎంత సమంగా చూసినా ఆమె ఇంట్లో ఒక వంటమనిషిగానే వుండిపోయింది. తను మాకు బంధువునని కూడా ఆమె చెప్పుకోదు. అది మాకు చిన్నతనమంటుంది. ఆమె కొడుకేమో—ఎంత గౌరవంగా చూసినా మమ్మల్నవమానిస్తూనే వుంటాడు. వాడి నే సైకాలజిస్టుకో చూపించకపోవడమే మేము చేసిన పెద్ద పొరపాటు...."

"పొరపాటంటే ఏ విధంగా పొరపాటు?"

"వాడిని మేమెంత ఎక్కువ చేసినా వాడికి అనుమానం. ప్రతిదానికీ కారణాలు వెతికి బాధపడేవాడు. అలాగని తక్కువచేస్తే సహించేవాడు కాదు...."

"ఎప్పుడైనా అతణ్ణి మీరు తక్కువ చేశారా?"

"అదేంకాదు. పుట్టిన రోజుకు బట్టలు వాడినే కొనుక్కోమంటే — నేనైతే చౌకలో కొనుక్కుంటానని ప్లాన్ చేశారు అంటాడు. ఏదైనా కొనిస్తే — నన్నడిగితే యింతకంటే మంచిది కొనుక్కుంటానని భయపడ్డారంటాడు...."

"తల్లి అతడిని మందలించేది కాదా?"

"అసలు వాళ్ళు పుట్టినరోజుకని నీకు బట్టలెందుకు కొనాలిరా? అని ఆవిడ వాడిని మందలించేది. అందుకు బదులుగా వాడు — అసలు వాళ్ళని కొనమని యెవరడిగారు — అనేవాడు. వాడి నెగెటివ్ ఎప్రోచ్‌ని మాటల్లో నెగ్గడం కష్టం...."

"అదిసరే...ఎప్పుడయినా రఘురాంని మీరు తక్కువ చేసిన సందర్భం వుందా? అతడి అనుమానం ప్రకారం కాకుండా — ఎవరికైనా అలా అనిపించే సందర్భం...."

జగదీప్ ఆలోచనగా "ఊ..." అని — "నాన్నగారి విల్లు తప్ప యింకేమీ నాకు గుర్తు లేదు...." అన్నాడు. అతడు విల్లు గురించి వివరించినవన్నీ జగదాంబ కిల్లర్ కి చెప్పినవే!

"అంటే... అతడు మీ ఆస్తిలో వాటా ఆశించాడన్న మాట."

"అలాగనుకుందుకు లేదు. ప్రతి విశేషాన్నీ తనకు వ్యతిరేకంగా అన్వయించుకుని బాధపడడం వాడి అల

వాటు. అలాగే నేనూ అనుకున్నాను. వాడి నోటికి అదుపులేదని తెలిసినవాణ్ణి కాబట్టి—మీ నాన్నను చంపినా పాపంలేదని వాడంటే నేను చలించలేదు...." అన్నాడు జగదీష్.

"రఘురాంకి అన్యాయం జరిగిందని మీకూ అనిపించిందా?"

"లేదు. మా ఆస్తిలో వాడు వాటా ఆశించడం చాలా అన్యాయం. మా యింట్లో వాడికి నిలువ నీడ నిచ్చాం. మాతో సమంగా మర్యాద చేశాం. అటుపైన వాడి బ్రతుకు వాడు బ్రతకాలి....గౌరవమిస్తే హక్కులు పొందాలనుకోవడం వాడికి న్యాయం కాదు.."

"ఈ హత్య అతడే చేసివుంటాడని మీరు నమ్ముతున్నారా?"

"నమ్మడానికి కష్టమైన విశేషమిది. కానీ ప్రస్తుత పరిస్థితుల్లో నమ్మక తప్పదు...."

కిల్లర్ ఈ తీర్పు విని నిట్టూర్చి—"ఈ యింట్లో మనుషుల ప్రవర్తన అపురూపంగా ఉంది. ధర్మాత్ములు కాని పక్షంలో వీళ్ళు నయవంచకులై వుండాలి—" అన్నాడు.

తర్వాత విశ్వనాథ్ గవర్రాజు రెండో కొడుకు మాధవ్ ఇంటర్వ్యూ వినిపించాడు.

మాధవ్, రఘురాం లిద్దరూ సమవయస్కులు. రఘురాం కంటె మాధవ్ రెండు క్లాసు లెక్కువ. అదీ అతడు సైన్స్ గ్రూప్. రఘురాంది మామూలు బియ్యే.

రఘురాం అస్తమానూ సైన్సుని తిడుతూండేవాడు.

సైన్సు సృష్టినే నాశనం చేయడానికే పుట్టిందని అతడి వాదన. బాగా చదివితే ఎక్కడ సైన్సు చదవాల్సివస్తుందోనని భయపడి తను శ్రద్ధగా చదవడంలేదని చెప్పేవాడు

రఘురాం. మాధవ్ రఘురాం అభిప్రాయంతో ఏకీభ వించేవాడు. అయితే రఘురాం మాధవ్ మంచితనాన్ని అంగీకరించేవాడు కాదు—ముఖ్యంగా అరుణ విష యంలో.

"అరుణ ఎవరు?" విశ్వనాథ్ అడిగాడు.

"అరుణ నన్ను ప్రేమించింది. చాలా మంచిపిల్ల. నా కోసం మా యింటికి వచ్చేది. ఆరంభంలోనే ఆమెకూ రఘురాంకూ భేటీ పడింది. ఆమె అతడి నసహ్యించుకో బోతే నేను వివరంగా రఘురాం గురించి చెప్పాను. అప్పు డామెకు అతడంటే జాలి వేసింది. అతడెలా ప్రవర్తిం చినా అర్థం చేసుకుందుకు ప్రయత్నించసాగింది. అదే అపార్థానికి దారితీసింది...."

"అంటే?"

"రఘురాం అరుణ తనను ప్రేమిస్తోందనుకుని భ్రమ పడ్డాడు. ఆ విషయం నాకు చెప్పాడు. నేను వెంటనే అతడిలో అపోహను తొలగించడానికి ప్రయత్నించాను. దాంతో అతడు సరాసరి అరుణనే వెళ్ళి అడిగాడు. ఆమెకు యేం చెప్పాలో తెలియలేదు. మొహమాటానికి ఊఁ అంది. అరుణకూ నాకూ పెళ్ళి చేయాలని పెద్దలూ అనుకుంటున్నారు. అయితే రఘురాం వెళ్ళి తను అరు ణను పెళ్ళి చేసుకుంటానని నాన్నగారికే చెప్పేశాడు. ఆయన శాంతంగా అతడి మాటలు విని—"సరే లే! నేను అరుణతో మాట్లాడుతాను—" అని అతణ్ణి పంపేశారు.

తర్వాత అరుణతో మాట్లాడారు. అరుణ నన్ను తప్ప యెవరినీ పెళ్ళి చేసుకోనని ఖచ్చితంగా చెప్పేసింది. దాంతో నాన్నగారు రఘురాంని పిలిచి నానా మాటలూ అన్నారు. అరుణ మళ్ళీ అతడి కళ్ళబడలేదు. రఘురాం

అనుమానం—మా నాన్నగారు నయానా భయానా అరుణను బెదిరించి అతడికి వ్యతిరేకంగా తయారుచేశారని. అరుణను నా కాకుండా చేశారు. ఆయన ప్రాణాలు తీస్తానని నాతో ఒకసారి అన్నాడు. వాడికలా మాట్లాడ్డం కొత్తకాదు కాబట్టి నేనప్పుడు పట్టించుకోలేదు. కానీ అన్నంత పనీ చేశాడు వాడు........" అన్నాడు మాధవ్.

"మంచివాడు మాధవుడు....యిక ఉపేంద్రుడి ఇంటర్వ్యూ కూడా వినిపించు ..." అన్నాడు కిల్లర్.

గజరాజు మూడో కొడుకు ఉపేంద్ర. అతడు వయసులో రఘురాం కంటె రెండేళ్ళు చిన్న. కానీ ఇద్దరూ క్లాస్ మేట్సు. ఉపేంద్రకు అతడితో సరదాగానే ఉండేది.

అన్నయ్యా అని పిలిస్తే—పిలిస్తే నీకు నేను అన్ననై పోతానా అనేవాడు రఘురాం.

"పిలిస్తేఅయినాకాకపోయినా పిలవకపోతే కాకుండా పోతావుగదా" అని ఉపేంద్ర అంటే-"మనమిద్దరం ఒకే క్లాసు చదువుతున్నాం—నువ్వు నన్ను అన్నయ్యా అని పిలిస్తే అన్నదమ్ములిద్దరూ ఒకే క్లాసు చదువుతున్నారనీ—అన్నకు చదువు బాగా రాలేదనీ అంతా అనుకుంటారు. అలా అనుకోవాలని నువ్వు నన్ను అన్నయ్యా అని పిలుస్తున్నావు...." అని రఘురాం పెడర్థాలు తీసేవాడు.

"పోనీ తమ్ముడూ అని పిలవనా?" అని ఉపేంద్ర అంటే—"వయసులో అన్ననయినా—బుద్ధినిబట్టి తమ్ముడని నన్ను చిన్నబుచ్చాలనే నీ ఉద్దేశ్యం!" అంటూ మళ్ళీ పెడర్థాలు తీసేవాడు రఘురాం.

"అంటే మా యిద్దరికీ పడేదికాదా?" అనడిగాడు

విశ్వనాథ్.

"ఎందుకు పడేదికాదు? నేనంటే అతడికి ప్రాణం. నేను కలగజేసుకోకుండా వుంటే అందరి దగ్గరా నన్నూ మా కుటుంబాన్నీ విపరీతంగా పొగిడేవాడు. ఒకసారి క్లాసులో ఓ గూండా కుర్రాడు నా జోలికి వచ్చాడని ప్రాణాలకు తెగించి వాడిమీదకు వెళ్ళి చావుదెబ్బలు తిన్నాడు. మహా మొండిమనిషి....'

"అతడంటే నీకిష్టమేనా?"

"ఇష్టమే కానీ కంపెనీకి చాలా బోర్. ఆ సమానూ ఏదో అసంతృప్తితో బాధపడేవాడు. నా దగ్గరయితే— తను వయసులో పెద్దయినా చిన్న క్లాసు చదువుతున్నానని బాధపడేవాడు. అప్పుడు నేను మా క్లాసులో ఉన్న రఘురాం కంటె పెద్ద వయసువాళ్ళని గురించి చెప్పేవాణ్ణి. అతడది విని—వాళ్ళంతా మొద్దు వెధవలు. నాకూ వాళ్ళకూ పోలికేమిటి అనేవాడు.

ఇంతకీ అతడి బాధంతా యేమిటంటే—తను చాలా తెలివయిన వాడిననీ—తండ్రి లేకపోవడంవల్ల తన తెలివితేటలు రాణించడంలేదనీ! తండ్రిలేని వాళ్ళెవరూ పైకి రావడంలేదా అని నేనంటే—"నీకూ తండ్రి లేకపోతే తప్ప నా పరిస్థితి అర్థంకాదు. నీ కర్థమయ్యేలా నేను చేస్తానే!" అన్నాడు. నిజంగానే అంత పనీ చేశాడు...."

ఈ టేపు విన్నాక కిల్లర్ నిట్టూర్చాడు.

హత్య రాత్రి జరిగింది. సుమారు ఎనిమిది గంటల సమయంలో. ఆ రోజు గజరాజు భార్య శాంతాదేవి ఊళ్ళోనే లేదు. పెద్దకొడుకు జగదీప్ గ్యారేజి మూసేశాక యింటికి రాకుండా తిన్నగా క్లబ్బుకు వెళ్ళాడు.

రెండోవాడు మాధవ్ ఆఫీసునుంచి తిన్నగా యింటికి రాకుండా అరుణలో మొదటి ఆట సినిమాకు వెళ్ళాడు. మాధవ్ కి ఒక నేషనలైజ్డ్ బ్యాంకులో గ్రాడ్యుయేటవగానే ఉద్యోగం దొరికింది. ఆఖరివాడు ఉపేంద్ర ఆ రోజు సాయంత్రం యిల్లువదిలి—మర్నాడుదయమే తిరిగి వచ్చాడు. అతడు తన స్నేహితుడైన గురుమూర్తి ఇంట్లో ఆ రాత్రంతా పేకాడాడు.

అంటే— మొత్తం నలుగురికీ పటిష్టమైన యెలిబీలున్నాయి. ఇంక మిగిలినవారిద్దరు. ఇద్దరిలో జగదాంబ రాత్రి ఏడింటికే గుడికి వెళ్ళి అక్కడ హరికథ విని— పన్నెండుగంటల ప్రాంతాల తిరిగివచ్చింది. ఎలిబీ లేనివాడు రఘురాం ఒక్కడే!

"కేసు క్లీనుగా లేదూ!" అన్నాడు విశ్వనాథ్.

"చాలా క్లీన్ గా ఉంది. ఎంత క్లీన్ గా ఉందంటే - యెవరో మన కోసం క్లీన్ చేసి పెట్టారా అని కూడా అనిపిస్తోంది!"

"మైక్రోస్కోపు తీయకండి....!" అన్నాడు విశ్వనాథ్.

"తియ్యనుగానీ ఒక్కక్షణం నాతో కలిసి ఆలోచించండి...." అన్నాడు కిల్లర్.

"చెప్పండి—" అన్నాడు విశ్వనాథ్.

"గవర్రాజింట్లో వాళ్ళంతా పరమ మంచివాళ్ళనిపిస్తోంది. ఆ యింట్లో పెరగడానికి రఘురాం యెంతో అదృష్టవంతుడై ఉండాలి. అంతటి అదృష్టాన్నీవిధంగా కాలరాచుకుంటాడా ఎవరైనా?" అన్నాడు కిల్లర్.

"ఇంకో కోణంలోంచి ఆలోచించి చూడండి...." అన్నాడు విశ్వనాథ్.

"మీరే చెప్పండి...."

"ఆ యింట్లో అందరూ ఎంతో మంచివాళ్ళు. ఆ కారణంగా తనూ వారిలో ఒకడేనన్న భ్రమతో పెరిగాడు రఘురాం. గవర్రాజునే తండ్రిగానూ, శాంతాదేవిని తల్లిగానూ భావించసాగాడతడు. అలాంటి పరిస్థితుల్లో గవర్రాజు విల్లు రాశాడు. ఆ కుటుంబంలో ఒకడిగా పెరిగిన తాను ఆ కుటుంబాని కేమీ కాదని రఘురాం గ్రహించాడు. విల్లు అతడిలో దావానలాన్ని రేపింది. ఇంట్లోని వారెవ్వరూ అదొక విశేషంగా కూడా భావించలేదు. రఘురాం ఆ యింట్లోని సుఖశాంతుల్ని తొలగించి తన గుండెల్లోని దావానలాన్ని వారితో కలిపి పంచుకోవాలనుకున్నాడు... "

"మీ ఊహ బాగుంది..." అన్నాడు కిల్లర్.

"ఊహకాదిది. వాస్తవంలో జరిగినదిదే! అలాగే నేను ఛార్జిషీట్ ఫైల్ చేయబోతున్నాను...."అన్నాడు విశ్వనాథ్.

"కంగారుపడకండి. ఒక బిందువు చుట్టూ ఉండే కోణముల మొత్తం మూడువందలఅరవై డిగ్రీలుంటుంది. మీరింకా చాలా కోణాల్లోంచి విషయాన్ని పరిశీలించలేదు...."

"చెప్పండి. వింటాను...."

"గవర్రాజు హత్యజరిగిన రోజున శాంతాదేవి పుట్టింటికి వెళ్ళింది. జగదీష్ క్లబ్బులో గడిపాడు. మాధవ్ ప్రియురాలితో సినిమాకు వెళ్ళాడు. ఉపేంద్ర స్నేహితులతో పేకాడుతున్నాడు. ఒక్కరూ ఇంట్లో లేరు. ఇది కాకతాళీయమే నంటారా?"

"మీ ప్రశ్నకు జవాబిచ్చేముందు మరో కాకతాళీయం

కూడా చెబుతాను. రఘురాం తల్లి జగదాంబ కూడా హరికథకు వెళ్ళింది ..." అన్నాడు విశ్వనాథ్.

"అయితే?"

"ఈ నాలుగూ కాకతాళీయంగా జరగడానికో సెంట్రల్ పాయింటుంది. అది శాంతాదేవి పుట్టింటికి వెళ్ళడం...."

"శాంతాదేవి ఆ యింట్లో బైండింగ్ ఫోర్స్. ఆమె లేకపోతే ఒక్కరూ తిన్నగా యింట్లో వుండరు. శాంతాదేవి ఊళ్ళో లేనప్పుడల్లా ఇలా జరగడం పరిపాటి. అందుకు సాక్ష్యాలున్నాయి...." అన్నాడు విశ్వనాథ్.

"ఎవరు చెప్పారు?"

"జగదాంబ...."

కిల్లర్ నిట్టూర్చి—"జగదాంబ రఘురాం తల్లి. ఆమె సాక్ష్యాన్ని నమ్మవచ్చు. ఏ తల్లీ కావాలని కొడుక్కు పనికివచ్చే సమాచారాన్ని చెడగొట్టే తప్పుడు సాక్ష్యమివ్వదు...." అన్నాడు.

"ఒప్పుకున్నారు కదా—ఇప్పుడు గుర్తు తెచ్చుకోండి. శాంతాదేవిని రఘురాం బలవంతంగా వేమవరం పంపించాడు. శాంతాదేవి చెప్పిన ఈ మాటలు జగదాంబ సాక్ష్యంలో ధృవపడ్డాయి...." అన్నాడు విశ్వనాథ్.

"అంటే రఘురాం ముందుగా పథకం వేసుకుని ఈ హత్య చేశాడంటారు? చేస్తే ఏం సాధించాడంటారు?" అన్నాడు కిల్లర్.

"హత్య చేసినవాళ్ళందరూ ఏదైనా సాధించగలరని మీ అభిప్రాయమా?"

"పోనీ నా ప్రశ్న మారుస్తాను. ఏం సాధించాలనుకున్నాడు?"

"ఇందాక నే చెప్పాను. తన మనసులో రేగిన అశాంతి —ఆ కుటుంబంలో కూడా వ్యాపించాలన్నది అతడి అభిప్రాయం. ఆ స్త్రీలో తనకు వాటా రాకపోవడంతో అతడు తిన్న దెబ్బ సామాన్యమైనది కాదు...."

"మై డియర్ విశ్వనాథ్! కేసు మీ రనుకున్నంత సులభంకాదు. ఎక్కడో ఏదో తిరకాసుంది. ఆ కుటుంబం రఘురాం నంత ప్రత్యేకంగా ఎందుకు ట్రీట్ చేసింది? కేవలం మంచితనమేనా అందుకు కారణం? ఆ కుటుంబం నుంచి మంచిని మాత్రమే కాక ఆ స్త్రీని కూడా రఘురాం ఎందుకు ఆశించాడు?....ఏదో బలమైన కారణముండాలని పించడం లేదూ?"

విశ్వనాథ్ నవ్వి—"లేదు!" అన్నాడు.

"మీరు ఫైలు క్లోజ్ చేసే మూడ్‌లో వున్నారు. ఒకసారి వెళ్ళి గవర్రాజు వ్యక్తిగత జీవితం గురించి తెలుసుకోరాదూ?" అన్నాడు కిల్లర్.

"ఎందుకు?"

"ఆయన కో డైరీ అయినా రాసే అలవాటుంటే— అందులోంచి ఏ రహస్యాలైనా బయటపడవచ్చు. నేను రఘురాం హంతకుడు కాదని అనడంలేదు. హత్య చేయడానికి మీరు చూపుతున్న కారణం సరిపోదంటున్నాను". గవర్రాజు డైరీల్లో ఆ రహస్యం దొరకవచ్చు—న అన్నాడు కిల్లర్.

"అలాగని నాకు అనిపించడంలేదు...."

"ఈ కేసులో నా కింట్రస్టుంది. నాకు మీరు సహకరిస్తే ఆ పేరంతా మీదే! సహకరించకపోతే ఇబ్బంది పడేదీ మీరే!" అన్నాడు కిల్లర్.

"ఆల్ రైట్ — నేనే వెళ్ళి గవర్రాజుల్ని పరిశోధించి వస్తాను..." అంటూ లేచాడు విశ్వనాథ్,
"ఈలోగా నేను రఘురాంతో కాసేపు మాట్లాడతాను—" అన్నాడు కిల్లర్.

# 4

"నా పేరు కిల్లర్. నేను నిన్ను రక్షించాలని వచ్చాను...."
రఘురాం విషాదంగా నవ్వి—"నన్నెవ్వరూ రక్షించలేరు...." అన్నాడు.
"ఎందుకని?"
"గవర్రాజుగారు నాకు తండ్రి వంటివాడు. ఆయనకు నా చేతుల్తో నేనే విషం యిచ్చాను........" అన్నాడు రఘురాం.
"ఎందుకని?"
"నేనిస్తున్నది విషమని నాకు తెలియదు...."
"అదెలా జరిగింది?"
"నేను నీళ్ళు తెచ్చాను. ఆయనందులో టాబ్లెట్సు వేసుకున్నారు. అవి కరిగేదాకా నేను స్పూనుతో కలిపాను. ఆయన తాగారు. పడుకున్నారు. మరి లేవలేదు. మర్నాడు డాక్టరొచ్చి గతరాత్రి ఎనిమిది గంటలకే ఆయన పోయాడన్నారు. అంటే ఆ మందుకే ఆయన పోయారన్న మాట...."
"కానీ ఆయనవద్ద ఆ గదిలో ప్రాణంతీసే విషమేదీ లేదని ఋజువయింది...." అన్నాడు కిల్లర్.
"అవును. అందుకే నన్నెవరూ రక్షించలేరన్నాను...."
"నువ్వు నాకు పూర్తిగా నిజం చెబితే నేను నిన్ను

రక్షిస్తాను...." అన్నాడు కిల్లర్.

"నేను నిజమే చెబుతున్నాను...." అన్నాడు రఘురాం.

"ఆ నిజం చాలదు...."

"ఇంకా ఏం కావాలి?"

"గవర్రాజు భార్య, ముగ్గురు కొడుకులు ఎంతో మంచి వాళ్ళుగా నటిస్తూ నీ గురించి పోలీసు ఇన్స్పెక్టరుకు విషం నూరిపోశారు. వాళ్ళు నువ్వే హంతకుడివని ఋజువు చేయాలని చూస్తున్నారు. అంతా కలిసి కూడబలుక్కుని నీమీద అబద్దాలు చెప్పారు. నువ్వు కలుచుకుంటే ఆ అబద్ధాలను పటాపంచలు చేయువచ్చు...."

"వాళ్ళు నా గురించి అబద్ధా లెందుకు చెబుతారు....?"

"ఎందుకంటే హత్య వాళ్ళందరూ కూడబలుక్కుని చేశారు. నిన్నందులో యిరికించారు. వాళ్ళంటే గౌరవ భావంతో నువ్వు నీ జీవితాన్ని త్యాగం చేస్తున్నావు. నిజానికి హంతకుడు వాళ్ళు నలుగురిలో నే వున్నాడు....

"ప్లీజ్ పటవ్!" అన్నాడు రఘురాం ఆవేశంగా— "వాళ్ళెవరూ హత్య చేయలేదు. ఆ విషయం నాకు తెలుసు. హత్యజరిగిన సమయంలో ఇంట్లో నేనొక్కడినే ఉన్నాను...."

"అది నిజమే.... కానీ రాత్రికి గవర్రాజు వేసుకునే టాబ్లెట్స్ రెండింటిని ఎవరైనా మార్చి వుండవచ్చు.... అలాంటి అవసరం ఎవరికుంది?"

"ఎవ్వరికీ ఆ అవసరం లేదు. ఇంటి మొత్తంమీద గవర్రాజు గారిని చంపాల్సిన అవసరం నాకు తప్ప ఇంకెవ్వరికీ

లేదు...."

"అయితే నీ నేరాన్నొప్పుకుంటున్నావా?"

"ఇన్‌స్పెక్టర్ విశ్వనాథ్ యేం కోరితే అది చెబుతానని యెప్పుడో మాటిచ్చాను...." అన్నాడు రఘురాం.

"పోలీసు దెబ్బలకు భయపడ్డావా?"

"ఊఁ" అన్నాడు రఘురాం నిర్లక్ష్యంగా.

"నిన్ను నేను రక్షించాలనుకొన్నాను. కానీ నువ్వు సహకరించడం లేదు—" అన్నాడు కిల్లర్ నిట్టూర్చి.

"ఓ. మంచి కుటుంబాన్ని అనుమానించడంవల్ల మీరు నన్ను రక్షించలేరు...." అన్నాడు రఘురాం.

"గవర్రాజు కుటుంబ సభ్యులను నువ్విప్పటికీ అభిమానిస్తున్నావా?"

"ఉరికంబంమీద చివరిక్షణాల్లో కూడా నేనా కుటుంబ క్షేమము గురించే ప్రార్థించుకుంటాను. నాకింకేమీ అవసరంలేదు. మీరు వెళ్ళొచ్చు—" అన్నాడు రఘురాం.

## 5

"రఘురాంతో మాట్లాడేరా?" అన్నాడు విశ్వనాథ్. అతడి కన్నుల్లో ఇప్పుడు కొత్త ఉత్సాహం కనబడుతోంది.

"మాట్లాడేను "

"ఏమనిపించింది?"

"మంచి మనిషి.... మొండి మనిషి...."

"హంతకుడు కూడా!" అన్నాడు విశ్వనాథ్.

"అది మీ ఊహ!"

"ఊహ కాదు. మీ సూచనకు చాలా చాలా థాంక్స్! గవర్రాజుకు డైరీ రాసే అలవాటు లేదు, కానీ

అక్కడ వెతగ్గా ఆయన బీరువాలో ఓ కాగితం దొరి
కింది. అది రఘురాం ఆయనకు రాసిన ఉత్తరం...."
అంటూ విశ్వనాథ్ కిల్లర్ కి కాగితం అందించాడు.
"గవర్రాజుగారూ!

మీ వ్యవహారం శృతిమించి రాగాన పడు
తోంది. ఇకమీదట నేనుపేక్షించేది లేదు. నేను
మీ కాలుకింది చెప్పులా పడివుంటా ననుకోకండి.
మా అమ్మ జోలికి మరోసారి వచ్చారో మీ
రక్తం కళ్ళ జూస్తాను....

మీ
రఘురాం—"

ఇదీ ఆ ఉత్తరంలో రాసివున్న విశేషం.

"రఘురాం తల్లి వయసులో వుండగానే గవర్రా
జింట్లో అడుగు పెట్టింది. శాంతాదేవినామె అక్కా అని
పిలిచేది. అంటే గవర్రాజుకి సంబంధించినంతవరకూ—
ఆమెకు వయసు, వరస కుదిరాయి. అంటే చాలా ఏళ్ళుగా
వారిరువురి మధ్య అక్రమసంబంధం కొనసాగుతోంది. ఇది
ఇంట్లో అందరికీ తెలిసే వుండాలి. రఘురాం నా యింట్లో
అందరూ ప్రత్యేకంగా గౌరవించారంటే అందు
క్కారణం అది వారి అసహాయత అయుండాలి. రఘు
రాం గవర్రాజు వాటాలో ఆస్తి నాశించాడంటే అందు
క్కారణం కూడా ఈ అక్రమసంబంధమే అయుండాలి.
జగదాంబ కా యింట్లో గవర్రాజు రెండవభార్య స్థాన
మిచ్చి ఉండాలి. గవర్రాజంటే ఇంట్లో అందరికీ బెదు
రుంది. భయముంది. రఘురాంకా యింట్లో లభించిన
ప్రత్యేక స్థానాని కిదీ కారణం...." అన్నాడు విశ్వ
నాథ్.

"ఈ ఉత్తరం రఘురాం రాశాడని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు కిల్లర్.

"మీరొక్క నిముషం యిక్కడ కూర్చోండి ..." అంటూ విశ్వనాథ్ లోపలకు వెళ్ళాడు. కిల్లర్ ఆలోచనల్లో పడ్డాడు.

ఈ హత్య ఎవరు చేసివుంటారు?

సాక్ష్యాలన్నీ రఘురాంకి వ్యతిరేకంగా వున్నాయి. కానీ కిల్లర్ కి రఘురాం యీ హత్య చేసి వుండడనిపిస్తోంది.

గవర్రాజు భార్యబిడ్డల్లో అతి మంచితనం కనబడుతోంది. ఆ మంచితనం వెనుక కృత్రిమత్వం వుందేమో తెలియదు. రఘురాం వారి మంచితనాన్ని నమ్ముతున్నాడు. తను సాయపడతానన్నా నిరాకరించాడు. గవర్రాజు కుటుంబం అతడి గురించి చెప్పిన నిజాలన్నీ నిజాలనే అతడూ అన్నాడు. ఎందుకు?

రఘురాం ఎవరినో ఈ నేరాన్నుంచి తప్పించడం కోసం తన జీవితాన్ని త్యాగం చేస్తున్నాడా! అలా అనుకుందామంటే రఘురాం దుడుకుస్వభావం అందు కడ్డువస్తోంది. అతడు ప్రతి విషయానికీ ఆ కుటుంబ సభ్యుల ననుమానిస్తూనే వచ్చాడు. అలాంటివాడు వారి కోసం త్యాగమెందుకు చేస్తాడు?

కిల్లర్ ఆలోచిస్తూండగానే విశ్వనాథ్ తిరిగివచ్చి—
"రఘురాం ఒప్పుకున్నాడు. ఈ ఉత్తరం తనే రాశాట్ట" అన్నాడు.

"తన తల్లికీ గవర్రాజుకీ అక్రమ సంబంధముందని అతడొప్పుకున్నాడా?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

"లేదు. వాళ్ళిద్దరి చనువునూ తానపార్థం చేసుకుని

అలా ఉత్తరం రాశాట్ట. ఈ ఉత్తరం కోర్టులో బయట పెట్టబడ్డన్నాడు. అది తన తల్లికీ, గవర్రాజు గారికీ చెడ్డ పేరు తెస్తుందని అతడి భయం...." అన్నాడు విశ్వనాథ్.

"గవర్రాజు గారిని చంపినవాడు ఆయనను గురించి బాధపడడ మెందుకు? ఆయనకు చెడ్డపేరు వస్తే నేం?" అన్నాడు కిల్లర్.

"మీరు రఘురాంని ప్రశ్నిస్తారా?" అన్నాడు విశ్వనాథ్.

"అవసరం లేదు. మీరు అరుణని ప్రశ్నించారా?"

"అరుణ అంటే మాధవ్ ప్రియురాలే కదా! ఆమె నుంచి యే సమాచారమూ లభించలేదు...." అన్నాడు విశ్వనాథ్.

అతడు సమాధానమిచ్చిన తీరునుబట్టి ఆ విషయ మతడు సీరియస్‌గా తీసుకోలేదని కిల్లర్‌కి అర్థమయింది. అతడు లేచి నిలబడి—"ఆమెనుంచి నేను యేమైనా సమాచారం రాబట్టగలనని అనుకుంటున్నాను...." అన్నాడు.

# 6

కిల్లర్ అరుణను కాలేజీలో కలుసుకున్నాడు. ఆమెకు తా నెవరో చెప్పి దగ్గర్లో వున్న పార్కుకు తీసుకొని వెళ్ళాడు.

"మిస్ అరుణా! నువ్వు చాలా సమాచారం దాచి పెట్టావు. అందువల్ల రఘురాం అనే నిరపరాధి ఉరికంబ మెక్కుతున్నాడు. నువ్వు నిజం చెప్పకపోతే ఆ ఉసురు నిన్ను జీవితాంతం వేన్నాడుతుంది...."

"నే నేమీ దాచిపెట్టలేదు...."

"నువ్వేం దాచావో నాకు తెలుసు. నిజంగా నే నువ్వు

రఘురాంని ప్రేమించావు. లేకుంటే అతడు పారబడి వుండేవాడు కాదు...."

"అబద్ధం...."

"మీ యింట్లోవాళ్ళకు భయపడి నువ్విలాగంటున్నావు. రఘురాం నే నువ్వు ప్రేమించావు. మాధవ్ నిన్ను ప్రేమించాడు. మీ యింట్లోవాళ్ళు నిన్నతడికే యిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నారు. రఘురాంకు తనింట్లో వున్న స్థానం స్పష్టంగా తెలియడం కోసమే—గజరాజు విల్లు వ్రాశాడు. అవునా?"

"అదంతా నాకు తెలియదు."

"నిజం చెప్పు అరుణా! నువ్వు నేరాన్ని గజరాజు మీదకు నెట్టేసి—ఆ విషయం రఘురాంకి చెప్పావు కదూ!"

"నాకేమీ తెలియదు...."

"నువ్వు నాకు నిజంచెబితే ఏ ప్రమాదమూ వుండదు. లేకుంటే ఈ కేసులో నీ పేరుకూడా పత్రికల కెక్కేలా చేయగలను...." అన్నాడు కిల్లర్.

"నేను చెప్పే నిజంవల్ల మీకేం ప్రయోజనం?"

"ఒక అమాయకుడి ప్రాణాలు రక్షించడం...."

"రఘురాం మీ రనుకున్నంత అమాయకుడు కాదు."

"ఇతర విషయాల్లో యెలాంటి మాయలు తెలిసినా—హత్య విషయంలో అతడు అమాయకుడని నా భావం...."

"నిజం చెబుతాను. మీ రెవ్వరికీ చెప్పకూడదు" అంది అరుణ.

"ఊఁ."

"నేను రఘురాంని ప్రేమించాను. మాధవ్ నన్ను ప్రేమించాడు. ఆ విషయం తెలియగానే రఘురాం నాకు దూరం కావడం మొదలుపెట్టాడు. నేనతణ్ని ప్రేమించాను. తనకంటే మాధవ్ అన్నివిధాలా మెరుగని అతడన్నాడు. ఆ విషయం నేను చూసుకోగలనన్నాను. చివరిసారిగా అతడు__నీ తలిదండ్రులు యిష్టపడి పెళ్ళిచేస్తే నీతో పెళ్ళికి నేను యిష్టపడతానని అన్నాడు. అమ్మా నాన్నా అందుకొప్పుకోరని అతడికి తెలుసు...."

"నువ్వు నీ తలిదండ్రుల నొప్పించడానికి ప్రయత్నించలేదా?"

"ప్రయత్నించాను. అతడికీ ఆస్తిలో వాటా వుంటే యివ్వడానికి మా వాళ్ళ కభ్యంతరంలేదు. అదే నేను రఘురాంకి చెప్పాను. ఆ తర్వాతే గవర్రాజు గారు విల్లు వ్రాశారు. ఆ విల్లు విషయంలో నా అనుమానం రఘురాం పాత్ర వున్నదని!"

"అంటే?"

"రఘురాంకి ఆ యింట్లో ఎవరన్నా విపరీతమైన అభిమానం. మాధవ్ నతడు మరీ ఎక్కువ అభిమానిస్తాడు. మాధవ్ కోరిక తీర్చడం కోసం అతడలా విల్లు వ్రాయమని గవర్రాజుగారికి చెప్పి ఉండవచ్చునని నే ననుకున్నాను."

కిల్లర్ ఆశ్చర్యంగా__"విల్లు గురించి అలిగి రఘురాం గవర్రాజును హత్య చేశాడని అంతా అనుకొంటున్నారు. నువ్వీ విషయం పోలీసులకు మొదట్లోనే చెప్పవలసింది" అన్నాడు.

"మా వాళ్ళు పోలీసుల దగ్గర నోరెత్తవద్దన్నారు" అంది అరుణ.

"అయితే రఘురాం నక్రాజు సెందుకు హత్య చేసాడు?"

"ఏమో—అతడీ హత్య చేయలేదేమో...."

"నీ అభిప్రాయం చెప్పు .... స కా ర ణ ం గా చెప్పాలి...."

అరుణ సాలోచనగా—"అతడికి దగ్గరగా వెళ్ళాలని ప్రయత్నించాను కానీ నన్నతడు దూరంగానే వుంచాడు. అతడి గురించి నా కంటే లేఖకు బాగా తెలుస్తుంది...." అంది.

"లేఖ ఎవరు?"

"రఘురాంకి తాజా ప్రియురాలు...." అంది అరుణ అదోలా.

"ఈ విషయం నా కెవరూ చెప్పలేదే?" అన్నాడు కిల్లర్.

"మనిషి దుడుకుగా కనిపించినా చాలా విషయాల్లో రఘురాం గుట్టుగా వుంటాడు. అతడు చెప్పకపోతే లేఖ విషయం నాకు తెలిసుండేది కాదు."

"నాకు లేఖ అడ్రసు కావాలి."

## 7

లేఖ ఓ ప్రైవేట్ కంపెనీలో స్టెనో టైపిస్టు. ఒంటరిగా వుంటోందామె. ఉదయం ఆరింటి నుంచి మధ్యాహ్నం రెండింటివరకూ ఆఫీసులో వుంటుందామె.

మూడుగంటల సమయంలో ఇంట్లో కలుసుకున్నాడు కిల్లర్ ఆమెను.

రూపురేఖల్లో సామాన్యంగా వుంటుంది లేఖ. సన్నగా నాజూగ్గా—వయసిచ్చిన అందంతో ఆకర్షణీయంగానే వుంటుందామె.

కిల్లర్ ఆమెకు తన్ను తాను పరిచయం చేసుకొన్నాడు.

"మీకు నా గురించి యెవరు చెప్పారు?" అందామె కంగారుగా.

"కంగారుపడకు. నేను రఘురాంగురించి కొంత సమాచారం సేకరించాలని వచ్చాను. నీ పేరు పోలీసులదాకా రానివ్వనులే...." అన్నాడు కిల్లర్.

"నేనేమి సమాచార మివ్వగలను?"

"రఘురాం ఎలాంటివాడు?"

"చాలా మంచివాడు."

"గవర్రాజు కుటుంబం గురించి అతదేమయినా చెప్పాడా?"

"ఆ కుటుంబమంటే అతడికి ప్రాణం."

"అసలు నీకూ అతడికీ పరిచయ మెలాగయింది?"

"సినిమా హాలువద్ద....నాతో స్నేహితురాలుంది. ఇద్దరికీ కలిసి ముందుగా నేను టికెట్సు తీసుకొన్నాను. చివరిక్షణం ఆది రాలేకపోయింది. ఆ టికెట్ నేను రఘురాంకు అమ్మాను" అంది లేఖ.

"తర్వాత?"

"అతడే నాతో పరిచయం పెంచుకొన్నాడు. నా అందాన్ని పొగుడుతూండేవాడు. అతడిలో ఏదో ఆకర్షణ వుంది...."

"నువ్వతడిని ప్రేమించావా?"

"ప్రేమించేదాన్నేమో....కానీ...."

"ఊఁ."

"ముందతడే ప్రేమ ప్రసక్తి తీసుకొనివచ్చాడు...." లేఖ ఆలోచిస్తూ అంది__"ఆ ప్రస్తావన చాలా నిరుత్సా

హంగా వుంది. అరుణ అనే అమ్మాయి అతణ్ని ప్రేమి స్తోందిట. అరుణను గజ్రాజుగా రబ్బాయి మాధవ్ ప్రేమిస్తున్నాట్ట. తను రంగంలోంచి తప్పుకుందుకు—కొన్నాళ్ళు నేను అతడికి ప్రియురాలిగా ఉండా లన్నాడు...."

"అందుకు నువ్వొప్పుకున్నావా?"

"నటించడానికి నా అహం దెబ్బతింది. కోపంగానే అతడి నడిగాను—"నటనకు తప్ప నిజానికి ప్రియురాలిగా నేను పనికిరానా? అని. దానికతడు బదులుగా తనకా అదృష్టం లేదన్నాడు."

"ఎందుకట?"

"అతడొక ప్రమాదకరమైన కార్యక్రమం తలపెట్టా డుట. అందువల్ల తను ప్రాణాలు పోగొట్టుకోవచ్చు' ఉరికంబ మెక్కవచ్చు....అన్నాడు. అంటే హత్యచేయ బోతున్నాడని నేనూహించలేదు."

"హత్య చేయకుండా ఉరికంబ మెక్కుతాడను కున్నావా?" అన్నాడు కిల్లర్ వెంటనే.

లేఖ తడబడి—"రఘురాం మాట్లాడే పద్ధతి వేరే విధంగా వుంటుంది. అతడు ప్రధానమంత్రిని చంపుతా నన్నా సీరియస్‌గా తీసుకోలేము...." అంది.

కిల్లర్ లేఖను మరికొన్ని ప్రశ్నలు వేశాడు. దాన్ని బట్టి అతడి కర్థ మైనదిది.

అరుణకు తనపై విరక్తి కలగాలని అతడు లేఖ నాశ్రయించాడు. లేఖ అతడిపై ఆశలు పెంచుకోకుండా తనకేదో ప్రమాదముందని చెప్పాడు. ప్రమాదముందో లేదో లేఖకు తెలియదు.

"అతడు అబద్ధం చెప్పాడని నీ అనుమానమా?"

"ఊఁ."

"ఎందుకలా అనుకున్నావు?"

"నాగమణి వలలో పడినవాళ్ళలా అబద్ధాలే చెబుతారు...."

"నాగమణి ఎవరు?"

"ఆమె ఎవరో నాకు తెలియదు. కానీ ఎక్కడుంటుందో తెలుసు...."

"ఆమెకూ రఘురాంకీ సంబంధ మేమిటి?"

"ఇద్దరూ తరచుగా కలుసుకునేవారు...."

"నీకెలా తెలుసు?"

"నేనతణ్ని వెన్నాడి కనిపెట్టాను...."

"నువ్వతణ్ని ఎందుకు వెన్నాడావు?"

రేఖ చటుక్కున కన్నీళ్ళు తుడుచుకొని—"నేనతణ్ని ప్రేమించాను. అతడు నాకు దూరం కావడం నా దురదృష్టం...." అంది.

కిల్లర్ ఇంక ఆమెను ప్రశ్నించదల్చుకోలేదు. నాగమణి అడ్రసడిగి తెలుసుకున్నాడు.

# 8

అందమైన చిన్న బంగళా అది. కిల్లర్ కాలింగ్ బెల్ మ్రోగించగానే ఓ అందమైన యువతి తలుపు తీసింది.

"నాగమణి నువ్వేనా?" అన్నాడు కిల్లర్.

"అవును—...." అందామె వయ్యారంగా కదుల్తూ.

"నా పేరు కిల్లర్. నేను డిటెక్టివ్ ను."

"లోపలకు రండి—" అంది నాగమణి.

కిల్లర్ ఆమె ననుసరించి లోపలకు వెళ్ళి కూర్చున్నాడు. ఆమె అతడికోసం ఫ్రిజ్ లోంచి లింకా తెచ్చిచ్చింది. కిల్లర్ డ్రింక్ తాగుతూ—"రఘురాం గురించి

నీతో మాట్లాడాలని వచ్చాను..." అన్నాడు.

"రఘురాం ఎవరు?"

"నీకు తెలిసిన వ్యక్తి!"

నాగమణి ఒక్క క్షణం ఆలోచించి—"చనువుగా నువ్వని పలకరిస్తే—మంచి సరదా మనిషయుంటారనుకున్నాను. ఎవరో రఘురాం గొడవ యిప్పుడెందుకూ?" అంది.

"అయితే నేనిక్కడికెందుకొచ్చానని నీ ఉద్దేశ్యం?"

"నాదగ్గరకందరూ ఎందుకొస్తారో మీరూ అందుకే వచ్చారనుకుంటున్నాను...." అంది నాగమణి నర్మగర్భంగా నవ్వుతూ.

"అందరూ ఎందుకొస్తారో నాకు తెలియదు...."

"డిటెక్టివ్ నంటున్నారు ఊహించండి."

"నువ్వు వేశ్యవా?" అన్నాడు కిల్లర్ తడుముకోకుండా.

"ఆ పేరంటే నా కిష్టముండదు...."

"అయితే ఎవరు నువ్వు?"

"డబ్బుకు దొరకనివి కొన్ని ఉన్నాయీ ప్రపంచంలో. వాటిలో సుఖసంతోషాలు ముఖ్యమైనవి. నేనిక్కడ సుఖసంతోషాల నమ్ముతాను...."

"అది వేశ్యలు చేసేపని?"

"వేశ్యలవద్ద సుఖసంతోషాలు దొరుకుతాయన్నది భ్రమ. నావద్ద అలా కాదు. అయి చూజ్ మై కస్టమర్స్ ఆల్సో!" అంది నాగమణి.

"అంటే?"

"నావద్ద సుఖసంతోషాలు కొనుక్కోవాలన్న మనిషి ముందుగా నాకు నచ్చాలి. నాకు నచ్చిన మనిషిని నా

పెర్సనల్ డాక్టరు పరీక్షిస్తాడు. డాక్టరంగీకరించాక నే నేను నా కస్టమర్ కి సుఖసంతోషాల నమ్ముతాను. అందుకు మూల్యం యెక్కువే! అది నా సుఖసంతోషాల కోసం!" అంది నాగమణి.

"నీకు కస్టమర్సున్నారా?"

"ఉన్నారు కాబట్టే నేనిలా ఘనంగా బ్రతుకుతున్నాను...."

"నీ కస్టమర్సు నిజంగా నీ నుంచి సుఖశాంతులు పొందుతున్నారా?"

"నా ఆకర్షణ ఎటువంటిదంటే నాతో అనుభవాన్ని పంచుకొన్న ప్రతి మగాడూ నన్ను శాశ్వతంగా తనదాన్ని చేసుకోవాలని అర్రులు చాస్తాడు. అందుకెంత మూల్యాన్నయినా చెల్లించడానికి సిద్ధంగా వుంటాడు" గర్వంగా అంది నాగమణి.

"నీ జీవితం సిగ్గుపడవలసిన పద్ధతిలో నడుస్తోంది...." అన్నాడు కిల్లర్.

"నా సిగ్గుకు వెల వుంది. నా సిగ్గులు మీరు చూడాలనుకొంటే ముందు నా డాక్టర్ని కలవండి. అటు పైన వెయ్యి రూపాయలు ఫీజు కట్టండి...."

"వెయ్యి రూపాయలా?" ఆశ్చర్యంగా అన్నాడు కిల్లర్.

"మీ బోటి యువకులకు నే నిచ్చే కన్సెషన్ అది. పురుషుడి వయసు పెరిగిన కొద్దీ నా ఫీజు కూడా పెరుగుతుంది."

"థాంక్స్ ఫర్ యువర్ కన్సెషన్ ....మరోసారి డబ్బు తీసుకొని యిక్కడకు వస్తాకానీ—ప్రస్తుతం నాకు రఘురాం గురించి చెప్పు!" అన్నాడు కిల్లర్.

"రఘురాం ఎవరో నాకు తెలియదు!"

"గవర్రాజు గారిని హత్య చేసిన రఘురాం!"

నాగమణి తెల్లబోయి—"వాడా—అవును.... వాడి పేరు రఘురామే!" అంది.

"రఘురాం గురించి నీకు తెలిసింది చెప్పు."

"వాడంటే నాకు అసహ్యం...." అంది నాగమణి.

"ఎందుకని?"

"తింటూర్చుని నా జోలికి వచ్చాడు వాడు."

కిల్లర్ సాలోచనగా—"జోలికి రావడం అంటే?" అన్నాడు.

"వాడు చాలా దుడుకు మనిషి...." అంది నాగమణి.

"నిన్నేమైనా చేశాడా?"

"బెదిరించాడు."

"ఏమని?"

"చంపేస్తానని!"

"ఎందుకు?"

"నేను వ్యాపారం మానుకోవాలట...."

"నీ వ్యాపారంవల్ల అతడికేం నష్టం?"

"అదే నేనూ అడిగాను. దానికి జరుగులు చెప్పాడు. గవర్రాజు గారి కుటుంబమంటే అతడికి ప్రాణమట."

"అయితే?"

"గవర్రాజు గారు నా వలలో పడి ఆస్తిని నాశనం చేస్తున్నాట్ట. అందుకని నేను వ్యాపారం మానేయాలిట...."

కిల్లర్ తెల్లబోయి—"ఏమన్నావూ?" అన్నాడు.

నాగమణి మళ్ళీ చెప్పింది.

"గవర్రాజు గారు నీ కష్టమురా?"

"అవును."

"ఆయన ఆస్తిని నీ కోసం నాశనం చేస్తున్నాడా?"

"వచ్చినప్పుడల్లా ఆయనవద్ద నుంచి మూడువేలు ఫీజు వసూలు చేస్తాను. నెలకు నాలుగుసార్లు నా వస్తాడాయన. ఆస్తిని నాశనం చేస్తున్నానని ఆయననుకోవడం లేదు. సుఖసంతోషాలు కొనుక్కొంటున్నానని ఆయన భావిస్తున్నాడు."

"రఘురాం కెలా తెలిసిందీ విషయం?"

"మాధవ్ చెప్పాడుట. మాధవ్ గవర్రాజు గారి రెండో కొడుకు."

కిల్లర్ ఉలిక్కిపడి—"మాధవ్ నిన్ను కలుసుకొన్నాడా?" అన్నాడు.

"లేదు. అతడికి నన్ను కలుసుకోవాలంటే అసహ్యమట. తన తండ్రిని వదిలిపెట్టకపోతే ప్రాణం తీస్తానని బెదిరించమన్నాట్ట. అందుకని రఘురాం నా దగ్గరకు వచ్చేట్ట...."

"నువ్వేం చేశావ్?"

"సాధారణంగా ఏ గొడవల్లోనూ తల దూర్చడం నా కిష్టముండదు. అందుకని రఘురాంను ఆకర్షించడానికి ప్రయత్నించాను. యూస్‌లెస్ ఫెలో! ఎందరో నాకోసం వేలకువేలు పోస్తూంటే—నాకై నేను ప్రయత్నించినా అణుమాత్రం కూడా లొంగలేదు.

'అప్పుడు నేను పద్ధతి మార్చాను. కళ్ళ నీళ్ళతో—"గవర్రాజు ముసలాడు. ఆయనంటే నాకు ఎలర్జీ. గతి

లేక ఒళ్ళమ్ముకొని బ్రతుకుతున్నాను. ఆయన నన్ను పోలీసుల కప్పగిస్తానని బెదిరించి బలవంతంగా నా దగ్గరకు వచ్చి వెడుతున్నాడు. ఆయన బారినుంచి రక్షించావంటే నీ మేలు మరిచిపోను' అన్నాను.

వాడు నా మాటలు నమ్మి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత వాడిక్కడికి రాకుండా కట్టుదిట్టం చేశాను. వాడొచ్చిన ఛాయలూ లేవు. ఆ తర్వాత గవర్రాజుగారి హత్యగురించి తెలిసింది."

"రఘురాం నిజంగా గవర్రాజుగారిని చంపి ఉంటాడా?"

"నాకేం తెలుస్తుంది?" అంది నాగమణి.

"నీకు తెలిసిందంతా చెప్పావు గదా—చాలా థాంక్స్!" అంటూ లేచాడు కిల్లర్.

"మరి కాసేపు కూర్చోండి—" అంది నాగమణి.

"నీ సమయం వృధా చేయడం నా కిష్టంలేదు!" అన్నాడు కిల్లర్.

"అయ్యో! మీవంటివారితో కబుర్లు చెప్పడం నా కెంతో సరదా. చాలా కాలానికీ సరదా తీరింది...." అంది నాగమణి.

"అయితే మళ్ళీ ఇంకోసారి వస్తాను. వెయ్యి రూపాయలు కూడా తెస్తాను...." అన్నాడు కిల్లర్.

# 9

"హలో మిస్టర్ కిల్లర్! మీరు కలిశాక ఈ కేసుకు మరింత బలమేర్పడింది. గవర్రాజుగారి స్నేహితుడొకాయన చూస్తూండగా—గవర్రాజుగారు రఘురాంను దవడ మీద కొట్టాడుట. అప్పుడు రఘురాం ఆయనవంక క్రూరంగా చూసి—మీరు చేయగలిగింది మీరు చేశారు.

నేను చేయగలిగింది నేనూ చేస్తాను—అని వెళ్ళిపోయాట్ట. హత్యకు నాలుగురోజుల ముందు జరిగిందిట యిది....” అన్నాడు విశ్వనాథ్.

“ఈ సాక్ష్య మెక్కడ దొరికింది మీకు?” అన్నాడు కిల్లర్.

“రఘురాం చెప్పాడు....”

“ఎందుకు?”

“అతడి హృదయంలో పూర్తి పరివర్తన కలిగిందిట. తనకూ గజేంద్రాజుకూ మధ్య జరిగిన గొడవల గురించి అతడు ఒక్కొక్కటే సాక్ష్యాలు చెప్పి—పోలీసులు తనపై కేసు బలపర్చుకొందుకు పనికివస్తా యన్నాడు” అన్నాడు విశ్వనాథ్.

కిల్లర్ నవ్వి—“నాతో రండి! రఘురాం చేత కొత్త నిజాలు బయట పెట్టిస్తాను....” అన్నాడు.

విశ్వనాథ్ ఆశ్చర్యంగా — “కొత్త నిజాలంటే?” అన్నాడు.

“నాతో రండి!” అన్నాడు కిల్లర్.

విశ్వనాథ్ అతడిని రఘురాం వద్దకు తీసుకొని వెళ్ళాడు. రఘురాం కిల్లర్ వంక చూసి అదోలా నవ్వాడు.

“మిస్టర్ రఘురాం! ఈ కేసును నేను పరిశోధించాను. నువ్వు నిర్దోషివని తెలిసింది—” అన్నాడు కిల్లర్.

“అయితే దోషి ఎవరు?” అన్నాడు రఘురాం.

“మాధవ్?”

రఘురాం నవ్వి-“మీపరిశోధన తప్పు....!”అన్నాడు.

“అయితే నీకు తెలిసిన దోషి ఎవరు?”

“నేనే!”

"నువ్వు కాదు. మాధవ్‌ని రక్షించాలని అతడు చేసిన నేరాన్ని నీమీద వేసుకొన్నావు"

"అలాగని ఎవరు చెప్పారు?"

"ఎవరు చెబితేనేం— మొత్తం జరిగిందంతా నాకు తెలిసింది."

"మీకు తెలిసినది తప్పు...."

"నాకు బలమైన సాక్ష్యాలున్నాయి."

"ఏమిటవి?"

"మాధవ్ నిన్ను నాగమణి వద్దకు పంపించేక...."

కిల్లర్ యేదో అనబోగా—"నాగమణి మీ కెలా తెలుసు?" అన్నాడు మధ్యలో ఆపి.

కిల్లర్ గర్వంగా నవ్వి—"నాకు కర్ణపిశాచి అన్నీ చెప్పిందిలే. మాధవ్ నిన్ను నాగమణి వద్దకు పంపి హెచ్చరించాడు. అందువల్ల ఫలితం కనబడలేదు. అప్పుడు తనే ఓసారి నాగమణిని కలుసుకొన్నాడు. నాగమణి తెలివిగా—తన నా ముసలివాడి బారినుండి రక్షించమని మాధవ్ నడిగింది. మాధవ్ ఇంటికి వెళ్ళి తండ్రితో మాట్లాడాడు. తండ్రి కోపం వచ్చి మొత్తం ఆ స్తంతా నాగమణి కిచ్చేస్తా నన్నాడు. అప్పుడు మాధవ్ తండ్రిని హత్య చేశాడు. ఇందులో నువ్విరుక్కున్నావు. నీకు నేను సాయంగా ఉన్నాను. భయపడకు. నీకు తెలిసిన నిజం చెప్పి నాకు సహకరించు. మాధవ్ నీ మెడచుట్టూ ఉరి బిగుసుకోవాలని చూస్తున్నాడు. మనం అతడి మెడచుట్టూ ఉరి బిగిసేలా చేద్దాం!" అన్నాడు.

"మాధవ్ నా మెడచుట్టూ ఉరి బిగించాలనుకోడు!" రఘురాం.

"ఎందుకనుకోడు? ఒకే దెబ్బకు రెండు పిట్టలు. జాని

నికి అరుణ నిన్నే ప్రేమించిందని అతడికి తెలుసు. నువ్వు ప్రతిబంధకంగా తనామెను పెళ్ళి చేసుకొన్నా—ఆమె ప్రియుడు జీవించే వున్నాడన్న విషయం మాధవ్‌ను బాధిస్తూనే వుంటుంది. అటు వయసుకాని వయసులో ఆస్తిని తగలేస్తున్న తండ్రినీ—ఇటు తన ప్రేయసి మనసారా ప్రేమిస్తున్న ప్రియుణ్ణీ ఒకేసారి ప్రపంచంనుంచి తప్పించాలని మాధవ్ ప్లాను వేశాడు. ఫలితం గవర్రాజు హతుడయ్యాడు. నువ్వు హంతకుడివయ్యావు....”

“మీ కథకు ఋజువు లేదు....” అన్నాడు రఘురాం.

“ఇంకా ఋజువులున్నాయి నాకు. తన ప్రవర్తనను సమర్థించుకొనేందుకు గవర్రాజు కాంతాదేవి శీలం మంచిది కాదన్నాడు. అందులో నిజం ఎంతున్నప్పటికీ—మాధవ్ రక్తం మరిగిపోవడానికి అదీ ఒక కారణం....”

“అంతా అబద్ధం!” అరిచాడు రఘురాం.

“ఇది అబద్ధమే అనుకో! కానీ ఈ అబద్ధమే రేపు వార్తాపత్రికలలో మొదటి పేజీలో వుంటుంది. నగరమంతా చర్చనీయాంశమవుతుంది....”

రఘురాం ఉలిక్కిపడ్డాడు. అతడు కిల్లర్ వంక అదోలా చూసి—“సాక్ష్యాలు నాకు వ్యతిరేకంగా ఉన్నాయి. హత్య నేను చేశానని ఒప్పుకొంటున్నాను. మీరు కాదంటూ రెందుకు?” అన్నాడు.

“మై నేమీజ్ కిల్లర్. అయాం ది కిల్లర్ ఆఫ్ ది లైస్ అండ్ ఫాల్స్‌హుడ్....”

“నో—యూ ఆర్ ది కిల్లర్ ఆఫ్ ట్రూత్....” అని—“నేను హంతకుడినని గోల పెడుతూంటే మీ రెందుకు నమ్మరు?” అన్నాడు రఘురాం దీనంగా.

"గవర్రాజు కుటుంబం మంచిదంటున్నారంతా. అంత మంచి కుటుంబంలో ఉండి—ఆ కుటుంబ సభ్యుల్లో ఒకరిని హత్య చేసేవాడు నరరూప రాక్షసుడయుండాలి. నువ్వు నరరూప రాక్షసుడివంటే ఎట్టి పరిస్థితిల్లోనూ నే నంగీకరించలేను...."

"అదా మీ సందేహం?" అన్నాడు రఘురాం—"నే నిప్పుడు పూర్తిగా నిజం చెబుతాను. మీ సందేహాలన్నింటికీ సమాధానం దొరికే నిజం...."

"చెప్పు...."

"గవర్రాజుగారి కుటుంబంలోని వారందరూ దేవతామూర్తులు. ఇంచుమించు అనాథవంటి నన్ను వారు చూసిన తీరు యెవరికైనా అసాధ్యం. వారితో నే నెలా ప్రవర్తించినా—వారిలో యెవరన్నా నాకు ప్రాణం.

కొద్దిమాసాల క్రితం గవర్రాజుగారెలా పడ్డారో నాగమణి వలలో పడ్డారు. నాగమణి కోసం డబ్బును మంచినీళ్ళులా ఖర్చు చేయడం ప్రారంభించారు. ఇంట్లో ఎవ్వరికీ ఈ విషయం తెలియదు. మాధవ్‌కి కూడా తెలియదు.

మాధవ్ పంపాడని చెప్పి నేను నాగమణిని కలుసుకున్నాను. ఆమె నా మాటలు వినలేదు. ఆ తర్వాత గవర్రాజుగారికి నచ్చజెప్పాలని చూశాను. నాగమణి లేనిదే బ్రతకలేననీ ఈ విషయం శాంతాదేవికి చెప్పవద్దనీ ఆయన నన్ను కోరారు.

నే నప్పుడు నాగమణిని చంపేస్తానని బెదిరించాను. నాగమణి వంటిమీద ఈగ వాలినా తను సహించనన్నారాయన. నాగమణి చనిపోతే—తను తన డబ్బును యిష్టంవచ్చినట్లు వ్యసనాలకు ఖర్చు చేస్తానని బెదిరించా

రాయన. నాకేం చేయాలో తోచలేదు.

ఈలోగా శాంతాదేవికి గవర్రాజుగారి రాకపోకల గురించి అనుమానం వచ్చింది. అప్పట్నించీ ఆయన ఆమెకు నిద్ర మాత్రలనిచ్చి నిద్ర పోగొట్టసాగాడు.

శాంతాదేవి పెందరాళే నిద్ర పోవడంలోని రహస్యం నేను కనిపెట్టి—ఆయన కు త్తరం రాసి బెదిరించాను. అప్పుడే నే నాయనకు పిచ్చి ముదురుతోందని గ్రహించాను. శాంతాదేవి, పిల్లలు—ఇంతవరకూ ఎంతో దర్జాగా సుఖశాంతులతో జీవించారు. గవర్రాజుగా రిప్పుడు వ్యవహరించే పద్ధతిలో ఆ కుటుంబం ఆర్థికంగా చితికిపోవడాని కెంతో కాలం పట్టదు. గవర్రాజుగారిని యేం చేయాలా అని ఆలోచిస్తూ నే ఆయన్ను వెయ్యి కళ్ళతో కనిపెట్టసాగాను.

ఆయన ఒక బాటిల్లో విషం తెచ్చారు. అది విషమని నాకు అర్థమయింది. ఆయన ఆ విషాన్ని శాంతాదేవి కివ్వాలని ప్రయత్నిస్తున్నారు. అప్పుడు నేను తుది నిర్ణయానికి వచ్చేశాను. నాగమణి పెర్సనల్ డాక్టరే—తరచుగా గవర్రాజుగారింటికి రావడం మొదలుపెట్టాడు. శాంతాదేవిని విషప్రయోగంతో చంపి అది సహజ మరణంగా నిరూపించడాని కిద్దరూ ప్రయత్నిస్తున్నట్లు నా కర్థమయింది.

అంతే! అమ్మగారిని క్షేమకరం పంపాను. హత్య జరిగే రోజున యింట్లో నేను తప్ప ఎవ్వరూ లేకుండా జాగ్రత్త పడ్డాను. అందరికీ మంచి ఎలిబీ వుండాలన్నది నా ఆశయం. ఆ తర్వాత గవర్రాజుగారు తెచ్చి వుంచుకొన్న విషం ఆయనకు తెలియకుండా నీళ్ళలో కలిపి ఆయన కిచ్చాను. నేను తన్ను హత్యచేస్తానని ఆయన కలలో కూడా

ఊహించలేరు. అలాంటి పరిస్థితిని నేనూ ఊహించలేదు..."

"ఇంతకాలం ఈ కథ ఎందుకు దాచావు?"

"నవరాజాగారి దుర్వ్యసనాల గురించి అమ్మగారికీ, పిల్లలకు ఏమీ తెలియకూడదని నా ఆశయం...."

కిల్లర్ బాధగా నిట్టూర్చి—"శాంతాదేవి, పిల్లలు—నిజంగా దేవతామూర్తులు. వారికోసం నువ్వు జీవితాన్నే త్యాగం చేయగలిగావు కాబట్టి నేనా విషయం నమ్ముతున్నాను. ఇలాంటి నిజమేదో వుంటుందనీ అది నీచేత పలికించాలని ఆశించి నిన్ను అబద్ధాలతో రెచ్చగొట్టాను. నా ఆశయం ఫలించింది...." అన్నాడు.

"ఏమిటి మీ ఆశయం?"

"నువ్వు ఉరికంబ మెక్కవచ్చు. కానీ సమాజమూ, నీ కాశ్రయమిచ్చిన కుటుంబమూ కూడా నిన్ను ద్రోహిగా కాక—త్యాగధనుడిగా గుర్తుంచుకుంటారు! అబద్ధం చీకటిలో కలసిపోవాలి, నిజం వెలుగులో ప్రకాశించాలి. ఇదీ నా ఆశయం!"

విశ్వనాథ్ ఆశ్చర్యంగా—"హత్యకు ముందు మనకు తెలిసిన కారణం సబబైనదికాదని మీ కెందుకనిపించింది?" అన్నాడు.

"మానవత్వం అన్న పదం ఉన్నంత కాలం—మంచి వాళ్ళమధ్య నేరాలు జరిగితే-ఆ మంచివాళ్ళ మంచితనంలో ఏదో లోపముండి వుండాలి. లేదా ఆ నేరాల్లో మానవత్వముండి ఉండాలి!" అన్నాడు కిల్లర్.

"ఈ మాట నాకు గుర్తుంచుకో తగ్గది!" అన్నాడు విశ్వనాథ్.

—:అ యి పో యిం ది:—

# స్వప్న లోకం

పి. అరుణ

రేవతి కళ్ళల్లో గొప్ప ఆకర్షణ వుంది. నాలుగు నెలల క్రితం రాజన్ ఎక్స్‌పోర్టర్స్ కంపెనీలో ఉద్యోగానికి చేరాను. అప్పటికే రేవతి ఆ కంపెనీలో క్లర్కు కమ్ స్టెనోగా పనిచేస్తోంది.

"కొత్తగా చేరారు. పార్టీ ఇవ్వరా" అని అందరికంటే ముందుగా ఆమె నన్ను అడిగింది చిరునవ్వుతో. అప్పుడు ఆమె కళ్ళలోకి చూసిన నేను ఉలిక్కిపడ్డాను. అవే కళ్ళు. నీలిరంగు కళ్ళు. వెయ్యి నక్షత్రాల వెలుగు ఆ నీలికళ్ళలో — శ్యామల గుర్తొచ్చింది వెంటనే.

పార్టీ ఇచ్చే ఉద్దేశం నిజానికి నాలో లేదు. ఎందుకంటే నా దగ్గర డబ్బు చాలా తక్కువగా వుంది. ఆ కంపెనీలో శాలరీ ఇచ్చేవరకూ ఆ డబ్బుతోనే నేను బతకాలి. కాని రేవతి అడిగిన తర్వాత ఇవ్వకుండా వుండలేకపోయాను.

"థాంక్ యూ వెరీ మచ్" అన్నది ఆమె కృత

జతగా.

ఆ రోజునించీ రేవతితో నేనే పరిచయాన్ని పెంచు కున్నాను. అలా మా ఇద్దరిమధ్య పరిచయం పెరిగిపో కుండా వుండటానికి ఆమె ప్రయత్నం చెయ్యలేదు.

రేవతి బాగా కష్టపడి పనిచేస్తుంది. పని మానేసి వూరికే కూర్చోవాలనే ఆలోచన ఆమెలో లేదు. అందుకే ఆఫీసులో అందరికీ ఆమె అంటే బాగా ఇష్టం.

ఆమెలాగే నేనూ పేరు తెచ్చుకోవాలని ప్రయత్నం చేశాను. నా ప్రయత్నం చాలావరకు ఫలించింది. మా మేనేజర్ రెండు నెలల తర్వాత నా శ్రమను—కృషిని గుర్తించాడు. కేవలం మాటలతోనే నన్ను తృప్తి పరిచాడు. శాలరీ ఇంక్రీజ్ చేస్తాడేమోనని యెదురు చూశాను. కాని చెయ్యలేదు.

భాగ్య నగరంలో వున్న వందల ప్రయివేటు కంపె నీల్లో వేలమంది నాలాంటి ఉద్యోగులు విధిలేని పరిస్థి తుల్లో కేవలం పొగడ్తలకే లొంగిపోయి వెట్టిచాకిరీ చేస్తున్నారు.

ఆ వేలమందిలో నేనూ ఒకడ్ని అనుకున్నాను.

"కష్టపడి పనిచేసే వాళ్ళంటే నాకిష్టం" అన్నది రేవతి ఒకరోజు.

అప్పుడు నాకు బాగా సంతోషం కలిగింది.

"నాకూ ఇష్టమే. కాని మన కష్టంవల్ల తగిన ప్రయో జనాన్ని పొందలేక పోతున్నాం" అన్నాను.

"ఇక్కడ లేకపోవచ్చు. కష్టపడే మనిషి ఏరోజైనా సుఖపడితీరుతాడు. నాకు ఆ నమ్మకం వుంది" అన్నది.

"నేనూ ఆ నమ్మకంతోనే కష్టపడుతున్నాను. యేమైనా మనిద్దరి అభిప్రాయాలూ ఒక్కటే...."

అన్నాను.

మాట్లాడలేదు రేవతి.

కొంచెంసేపు ఆగి మళ్ళీ నేనే అన్నాను.

"ఏమైనా ఆడవాళ్ళలో కష్టించి పనిచేసేవాళ్ళు తక్కువమంది వుంటారు. నిన్ను చూస్తుంటే నాకు ఆశ్చర్యంగా వుంది."

మళ్ళీ నవ్వింది ఆమె—

"మొదట్లో నేనూ లేజీగానే వుండేదాన్ని. అలా వున్న కారణంగా ఆ కంపెనీలో నా ఉద్యోగాన్ని పోగొట్టుకున్నాను. ఆ సంఘటన నాలో గొప్ప మార్పును తీసుకొచ్చింది వర్కు విషయంలో" చెప్పింది.

రేవతి గురించి నేనో విషయాన్ని తెలుసుకున్నాను. ఆఫీసు మొత్తంలో ఆమె నాతోనే యెక్కువగా మాట్లాడుతుంది. ఈ కారణంగా మరి కొంతమంది ఉద్యోగులు అసూయ పడుతున్నట్టుగా అర్థంచేసుకున్నాను.

అప్పుడు నాకు నిజంగా గర్వం కలిగింది.

అందమైన రేవతి అందరికంటే నన్ను యెక్కువగా అభిమానిస్తుందా? ఇదే నిజమైతే నేను గొప్ప అదృష్టవంతుడినే అనుకున్నాను. ఎందుకంటే నీలిరంగు కళ్ళతో నా గుండెలో శాశ్వతంగా నిలిచిపోయి ఈ లోకం నించి శాశ్వతంగా వెళ్ళిపోయిన శ్యామల—రేవతి రూపంలో తిరిగి నాకు దొరికినట్టే.

## 2

ఆమె అలంకరణ ఆ రోజు చాలా ప్రత్యేకంగా వుంది. జడ అల్లుకోలేదు. తలంటి పోసుకొని జుట్టును కిందికి వదిలేసి పైగా క్లిప్పు పెట్టుకుంది. కాటుక దిద్దిన

నీలిరంగు కళ్ళు ఎంతో నిర్మలంగా వున్నాయి.

నీలి రంగు చీర కట్టుకొని అదే రంగు బ్లవుజు ధరించింది.

రేవతి అందం నన్ను పరవశుడిని చేసింది.

"ఏమిటీ విశేషం?" కొంచెం చొరవ తీసుకొని అడిగాను నవ్వుతూనే.

"ఇవాళ నా పుట్టిన రోజు...." నవ్వుతూనే చెప్పింది చేతిలో వున్న ప్యాకెట్టు కాయితాన్ని వూడదీస్తూ....

అందులో స్వీట్సు వున్నాయి.

ఆఫీసులో అందరికీ వాటిని పంచింది.

స్వీటు అందుకుంటూ శుభాకాంక్షలు తెలయజేశాను.

"థాంక్ యూ" అన్నది కృతజ్ఞతగా.

"ముందుగా చెప్పలేదేం?" అడిగాను.

"ఏం... ముందుగా చెబితే ఏంచేసేవాడివి.... డైమండ్ రింగ్ ప్రజెంట్ చేసేవాడివా?" చాలా మృదువుగా నవ్వుతూ అడిగింది. అలా నవ్వినప్పుడు ఎర్రటి ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

జవాబు చెప్పాలనిపించలేదు. ఆ పెదవులమీద సున్నితంగా ముద్దుపెట్టుకోవాలనిపించింది.

నాలో భావాలను కళ్ళలో కనపడనీయకుండా నవ్వుతూ "డైమండ్ రింగ్ ప్రజెంట్ చెయ్యకపోయినా యేదో ఒకటి ప్రజంట్ చేసేవాడిని" అన్నాను.

"ఇప్పుడు చెప్పాను కదా..ఆ ప్రజంటేషన్ ఏమిటో సాయంత్రం ప్రజెంట్ చెయ్యి. తీసుకుంటాను" అన్నది.

శ్యామల గుర్తుకొచ్చింది అప్పుడు.

రెండేళ్ళ క్రితం శ్యామలకూడా ఇలాగే తన బర్త్

రేకి యేదైనా ప్రజెంట్ చెయ్యమని అడిగింది. మంచి చీర కొనాలనుకున్నాను. నా దగ్గర డబ్బులు లేవు. చివరకు నా వేలికి వున్న బంగారు ఉంగరాన్ని అమ్మి శ్యాములకు చీర కొన్నాను.

సాయంత్రం ఆఫీసు వదిలిన తర్వాత రేవతి వెనుకే బయటకు వచ్చాను. మా ఆఫీసు మంచి సెంటర్లో వుంది. ఆ ప్రాంతంలో అన్ని రకాల షాపులు వున్నాయి.

రోడ్డుమీద ఆమె పక్కనే నడుస్తూ—"ఈరోజు నీ బర్త్ డే కదూ?" అనడిగాను.

"అవును. స్వీట్లుకూడా పంచాను కదా....అప్పుడే మరచిపోయావా?" నవ్వి అడిగింది రేవతి.

"కాదు. ఇప్పుడు నీ వయసు యెంతో తెలుసుకుందామని గుర్తుచేశాను."

"ఓ.... తెలివైన వాడివే....ఐతే నేనుకూడా తెలివైనదాన్నే....కొన్ని చెప్పకూడనివి వుంటాయి. ఆడదాని వయసు అడక్కూడదు. అడిగినా చెప్పకూడదు.... అవును కదూ?"

"ఆల్ రైట్..నువ్వు చెప్పకపోయినా నేను వూహించుకోగలను."

"ఎన్ని?"

"ముప్పయ్ రెండు."

"మై గాడ్....ముప్పయ్ రెండా? పదేళ్ళు ఎక్కువగా కనిపిస్తున్నానా?" వెంటనే అన్నది.

"థాంక్ యూ రేవతీ" అన్నాను.

"ఎందుకు?"

"నీ వయసు చెప్పినందుకు."

నాలిక్కొరుకుంది రేవతి.

ఫ్యాన్సీ షాపులోకి వెళ్ళాం. అక్కడ రంగు రంగుల ఫ్యాన్సీ గొడుగులు కనపడ్డాయి. ఎంతో బావున్నాయి.

వర్షాకాలం మొదలయ్యింది. రోజూ యేదో ఒక టైములో వాన కురుస్తోంది.

రేవతికి గొడుగు లేదు. ఒక్క రోజుకూడా ఆఫీసుకు తేలేదు.

ఫ్యాన్సీ డిజైను వున్న ఆడవాళ్ళ గొడుగు ఆమెకి బాగా నచ్చింది. దాన్ని ప్యాక్ చేయించాను. ఎనభై రెండు రూపాయలు.

అంత డబ్బును షాపులో ఇస్తుంటే నాకు బాధ కలగలేదు నిజానికి ఆ డబ్బు నాకెంతో విలువైనది. కాని—రేవతిలో శ్యామలను చూసుకుంటున్నాను. రేవతి నీలిరంగు కళ్ళలో ఒకప్పటి తీయని అనుభూతులను గుర్తు చేసుకుంటున్నాను. ఆ అనుభూతిముందు ఈ డబ్బు ఒక లెక్క కాదు.

"థాంక్ యూ రావ్" అన్నది రేవతి బయటకు వచ్చిన తర్వాత కృతజ్ఞతగా.

"వట్టి థాంక్స్ సరిపోదు రేవతీ .... ప్రజెంటేషన్ ఇచ్చిన ఈ రావ్ కు ప్రత్యేకమైన పార్టీ లేదా?"

"ఏం కావాలో అడుగు" అని సూటిగా నా కళ్ళలోకి చూసింది రేవతి. నేనూ ఆమె కళ్ళలోకి చూశాను.

ఎన్నో వేల నక్షత్రాల వెలుగు.

ఆమె కళ్ళు మెరుస్తున్నాయి.

ఒక్కసారి నా చూపును మరల్చి ఆమె చేతినున్న వాచీకేసి చూస్తూ "ఇప్పుడే సినిమా టైము అవుతుందనుకుంటున్నాను" అన్నాను.

వెంటనే నవ్వింది రేవతి.

"సరే పద" అన్నది ఒక్క నిమిషం తర్వాత.

నాకు మళ్ళీ సంతోషం కలిగింది.

అక్కడికి దగ్గర్లో వున్న థియేటర్లో ఓ హిందీ సినిమా రన్నవుతోంది. ఆ సినిమా ఇద్దరు ప్రేమికుల కథ.... ఎప్పటినించో ఆ సినిమా చూడాలని అనుకుంటున్నాను. లక్కీగా రేవతితో ఆ సినిమా చూసే అదృష్టం నాకు కలిగింది.

ఆమె టిక్కెట్లు తీసుకుంది.

బాల్కనీలోకి వెళ్ళి కూర్చున్నాం.

మొదటిసారి కాకపోయినా మళ్ళీ నాకు శ్యామల పక్కనే కూర్చుని సినిమా చూస్తున్న భావన కలిగింది.

శ్యామల!

నా గుండెల్లో నిలిచిపోయిన ప్రేమజ్యోతి.

ఈ లోకంనించి ఆమె వెళ్ళిపోయినా నా హృదయంలో ఆమె వెలిగించిన ప్రేమజ్యోతి ఆరిపోలేదు. అది ఇంకా వెలుగుతూనే వుంది.

సినిమా మొదలయ్యింది.

చూస్తూ చేతిని రేవతి వెనకగా ఆమె భుజంమీదికి వేశాను. ఆమె వెంటనే తాకేసి అదోలా చూసింది.

'సారీ' అంటూ చేతిని తీసుకున్నాను.

నవ్వుతుందనుకున్నాను రేవతి.

కాని నవ్వలేదు. మామూలుగా సినిమా చూడటంలో మునిగిపోయింది.

సినిమా ఎలా వుందో నాకు తెలీదు.

నా ఆలోచనలన్నీ రేవతి గురించే—

ఆమె హృదయంలో నాకు ఎలాంటిచోటు వుంది?

కేవలం ఒక ఫ్రెండ్‌గానే ఆమె నన్ను ట్రీట్

చేస్తోందా?

ఒకటి మాత్రం నిజం.

ఆమెను నేను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాను. ఆమె ఒప్పుకుంటే పెళ్ళి చేసుకుంటాను.

నా ఆలోచనల మధ్యలో సినిమా అయిపోయింది.

"ఎలా వుంది?" బయటకొచ్చిన తర్వాత అడిగింది.

"ఏమో!"

"ఏం నిద్రపోయావా?"

"మెలకువగా వున్నా నిద్రపోయినట్టే .... యేవో ఆలోచనలు నన్ను సినిమా చూడనివ్వలేదు."

రేవతి రోడ్డున రివ్వున వెళుతున్న ఖాళీ ఆటోరిక్షా ఆపి "ఇక నే వెళతాను" అన్నది.

"ఆల్ రైట్ .... థాంక్ యూ .... గుడ్ నైట్" అన్నాను.

ఆటోలో యెక్కింది రేవతి.

"గుడ్ నైట్."

దూసుకువెళ్ళింది ఆటో.

అక్కడే నిలబడిపోయాను ఆటోని చూస్తూ....లోపల్నించి రేవతి చీరకొంగు తెరచాపలా బయటకు ఎగురుతోంది నన్ను కవ్విస్తున్నట్టు.

రేవతి ఏమిటి?

ఆమె మనసులో ఏముంది?

తెలుసుకోవాలి.

# 3

"నీకో రహస్యం చెప్పాలి" అన్నాను రేవతితో లంచ్ టైంలో.

"రహస్యమా?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును. అంటే ఈ విషయం గురించి ఇంతవరకూ ఎవ్వరితోనూ చెప్పలేదు. నిజానికి ఇదేమంత రహస్యం కాదు. అలా అన్నాను అంతే."

"ఇంతకీ ఏమిటా సీక్రెట్?"

"విజయవాడలో వున్న ఓ బిజినెస్ ఫర్మ్‌లో జాబ్‌కు కొన్నాళ్ళ క్రితం ఎప్లయ్ చేశాను. వాళ్ళు నన్ను ఇంటర్వ్యూకు పిలిచారు. రెండు రోజుల్లో ఇంటర్వ్యూ"

"ఈ కంపెనీ నించి వెళ్ళాలనుకొంటున్నావా?"

"అవును రేవతీ. ఎంత కష్టపడినా శాలరీ ఇంక్రీజ్ చెయ్యటం లేదు. విజయవాడలో యింతకంటే ఎక్కువ శాలరీ ఆఫర్ చేస్తే యిందులో రిజైన్ చేసి వెళ్ళిపోతాను."

"విష్ యూ బెస్టాఫ్ లక్."

"థాంక్యూ!"

రెండు రోజులు లీవు పెట్టి విజయవాడ వెళ్ళాను.

ఇంటర్వ్యూ బాగానే జరిగింది.

"నీ కెంత శాలరీ కావాలి?" అడిగాడు ఆఫీసు మేనేజర్.

చెప్పాను.

"మరీ ఎక్కువనుకొంటాను" అన్నాడు.

"నేను తీసుకొనే ప్రతి రూపాయికీ రెండు రూపాయల వర్కు చేస్తాను. నన్ను ఎపాయింట్ చేసుకున్న తర్వాత నేను చెప్పిన మాట అబద్ధం అని మీకు అనిపిస్తే నా శాలరీకి సగం తగ్గించండి. నేను ఒప్పుకొంటాను."

"రియల్లీ!" ఆశ్చర్యంగా అడిగాడు మేనేజర్.

"అవును."

"ఓకె! ఇట్సాల్ రైట్! నిన్ను ఎపాయింట్ చేసుకో నేటట్లయితే నువ్వడిగిన శాలరీకి ఒప్పుకున్నట్టే. నౌ యు కెన్ గో! థాంక్ యూ" అన్నాడాయన.

థాంక్స్ చెప్పి బయటకొచ్చాను.

ఎందుకో ఆ కంపెనీలో నాకు ఉద్యోగం వస్తుందని అనిపించింది.

ఆఫీసుకు రాగానే అడిగింది రేవతి—"ఇంటర్వ్యూ ఎలా జరిగింది?"

చెప్పాను.

"శాలరీ విషయంలో అంత డేరింగ్ గా మాట్లాడావా?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును రేవతీ! అలా అయితేనే నేను ఆ కంపెనీలో చేరతాను. లేకపోతే ఇక్కడే వుంటాను."

వారం రోజుల్లోనే నేను అడిగిన శాలరీతో నన్ను తమ కంపెనీలో ఎపాయింట్ చేసుకున్నట్టుగా విజయవాడనించి జాబ్ ఆర్డర్ వచ్చింది.

దాన్ని చూసి సంతోషం కలిగినా రేవతిని వదిలి వెళ్ళాలనుకుంటే గొప్ప విచారం కలిగింది.

"సాధించావు రావ్" అన్నది రేవతి.

"సాధించాను. కాని నేను సాధించవలసిన ముఖ్యమైంది మరొకటి వుంది" అన్నాను ఆమె కళ్ళలోకి చూస్తూ.

"ఏమిటి?"

"చెబుతాను. సాయంత్రం."

సాయంత్రం వరకూ ఎలాగో గడిపాను.

ఆ రోజు మధ్యాహ్నమే మేనేజర్ని కలిసి నాకు

వచ్చిన మరో ఉద్యోగం గురించి చెప్పాను.

"ఐయామ్ వెరీ హేపీ రావ్! కాని నువ్వు ఈ కంపెనీ వదిలి వెళుతున్నందుకు నాకు చాలా విచారంగా వుంది. ప్రస్తుతం ఈ కంపెనీ నష్టాల్లో వున్నందున నీ శాలరీ పెంచి నిన్ను ఈ ఆఫీసు వదిలి వెళ్ళకుండా ఆపలేకపోతు న్నాను. కాని ఈ కంపెనీ ఫైనాన్షియల్ పొజిషన్ మెరుగైన రోజు నువ్వు ఎక్కడ వున్నా నువ్వు అడిగిన శాలరీమీద ఈ కంపెనీలోకి నిన్ను ఇన్వయిట్ చేస్తాను" అన్నాడు మేనేజర్ ఎంతో అభిమానంగా.

"థాంక్ యూ సర్" అన్నాను కృతజ్ఞతగా.

ఆ రోజునే రిజిగ్నేషన్ లెటర్ ఇచ్చాను.

సాయంత్రం ఆఫీసు వదలగానే రేవతితో బయటకు వచ్చాను.

ఇద్దరం విశాలంగా వున్న ఒక పార్కులోకి వెళ్ళి కూర్చున్నాం.

"ఐతే నువ్వు ఈ ఆఫీసులో మా అందర్నీ వదిలి ఒక్కడివే వెళ్ళిపోతున్నావ్" అన్నది రేవతి.

"అవును రేవతీ! ఈ ఆఫీసు వదిలివెళ్ళిపోతున్నందుకు నాకు బాధగాలేదు. కాని ఒక్క నిన్ను వదిలి వెళ్ళా లంటే నాకు దిగులుగా వుంది."

"రియల్లీ!"

"అవును."

"ఎందుకనో?" కళ్ళెగరేస్తూ అడిగింది.

"ఎందుకో నాకు తెలుసు....నీకూ తెలుసనే అనుకుం టున్నాను."

"నాకు తెలీదు రావ్."

"రేవతీ! నీ పట్ల నా ప్రవర్తన గురించి ఏమనుకుంటు

న్నావ్?" అడిగాను ఆమె కళ్ళలోకి చూస్తూ.

"ఏమో! నేనేమీ అనుకోవటం లేదు. ఒక మంచి స్నేహితుడివని అనుకుంటున్నాను" అన్నది.

"అంతేనా రేవతీ" నిస్పృహగా అడిగాను.

"అంతే అనుకుంటాను."

"ఆల్ రైట్ .... నా మనసులో వున్న మాట చెబుతాను. నిన్ను నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. నువ్వంటే నాకు యిష్టం. నువ్వు ఒప్పుకుంటే పెళ్ళి చేసుకుంటాను."

వెంటనే మాట్లాడలేదు ఆమె—

కొంచెంసేపు శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది.

తర్వాత "క్షమించు రావ్! నువ్వు చెప్పినంత సూటిగా క్లియర్‌గా నేనేమీ యిప్పట్లో చెప్పలేకపోతున్నాను. ఎందుకంటే నాకు నీమీద ప్రేమ వున్నదో, యిష్టం వున్నదో తెలీదు. నిర్ణయించుకోవాలి. ఒకటి మాత్రం క్లియర్‌గా చెప్పగలను. నువ్వంటే నాకు ద్వేషం లేదు.. అయిష్టం లేదు" అన్నది.

"థాంక్ యూ రేవతీ" అన్నాను.

ఆమె మౌనం వహించింది.

నేనే అన్నాను.

"నేను నీ గురించి ఆలోచించినంతగా నువ్వు నా గురించి ఆలోచించకపోవచ్చు. ఇప్పుడే నీ నిర్ణయం తెలియజెయ్యమని నేను బలవంతం చెయ్యను. నెమ్మదిగా ఆలోచించు. మనిద్దరి ఆలోచనలూ ఒక్కటే. ఇద్దరం ఉద్యోగం చేసేవాళ్ళం. మనం పెళ్ళి చేసుకుంటే ఆర్థికంగా కూడా యిబ్బందులను ఎదుర్కోవలసిన అవసరం రాదని నాకు నమ్మకం వుంది. ఆలోచించు రేవతీ. నీ

నిర్ణయం కోసం అనుక్షణం యెదురుచూస్తుంటాను. నీ నిర్ణయం నాకు సంతోషాన్ని కలగచేస్తుందని ఆశతో వుంటాను."

చీకటిపడింది.

బయటకు వచ్చి ఇద్దరం విడిపోయాం.

## 4

రేవతిని—మిగిలిన అందర్నీ వదిలి విజయవాడకు వచ్చేశాను. కొత్త ఆఫీసులో జాయినయ్యాను. ఈ ఆఫీసులో ఆడవాళ్ళు లేరు. అంతా మగవాళ్ళే. అందరిలోకి నేనే చిన్నవాడిని. పెళ్ళికానివాడిని.

రెండోరోజున రేవతికి ఉత్తరం రాశాను. ఆ ఉత్తరం చదవగానే వెంటనే రిప్లయ్ రాయమని కోరాను. నన్ను మరచిపోవద్దని చిన్న హెచ్చరిక కూడా చేశాను.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు.

కళ్ళముందు రేవతి రూపం కనపడింది. ఆమె నీలిరంగు కళ్ళు కనపడినాయి. ఆ చూపులు నన్ను వెంటాడుతున్నట్టుగానే వున్నాయి.

ఎందుకో గుండె వేగంగా కొట్టుకున్నది.

రేవతి మా పెళ్ళికి ఒప్పుకోకపోతే నేనేం చెయ్యాలి? తెలీలేదు. కాని హృదయంలో ఆమెకు నా పట్ల ప్రేమ వుందనీ, మెమ్మదిగా ఆ విషయాన్ని రేవతి గ్రహిస్తుందనీ సరిపెట్టుకున్నాను.

నాలుగురోజుల తర్వాత రేవతి దగ్గర్నించి జవాబు వచ్చింది.

అందులో ఇలా వుంది!

"డియర్ రావ్!

—నీ ఉత్తరం చేరింది. నువ్వు వెళ్ళిపోయిన

తర్వాత ఈ ఆఫీసు బోసిపోతున్నట్టుగా వుంది. నాకేమీ తోచలేదు. ఒక మంచి స్నేహితుడు దూరమైన బాధ స్పష్టంగా అనుభవమవుతోంది. మేనేజర్ కూడా నువ్వు లేకపోవటాన్ని ఒక లోటుగా భావిస్తున్నాడు.

ఇక నీ హెచ్చరిక గురించి నేను ఆలోచిస్తాను. పెళ్ళి విషయంలో తొందరపడటం యెందుకో నాకు యిష్టంలేదు. పూర్తిగా నీ గురించి ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాతనే నీకు తెలియజేస్తాను. ఉత్తరాలు రాస్తూవుండు. బై —

రేవతి."

రెండు మూడుసార్లు ఆ ఉత్తరాన్ని చదివాను. ఆమె యే ఉద్దేశంతో నన్ను డియర్ — అంటూ రాసినా నాకు యేదో తృప్తిగా అనిపించింది.

ఇక నేను నా దృష్టిని కంపెనీ పనిమీద కేంద్రీకరించటంతో నెలరోజులవరకు గట్టిగా వూపిరి తీసుకోలేకపోయాను.

ఈ నెలరోజుల్లోనూ ఎంతో కాలంగా పెండింగ్‌లో వున్న ఆఫీసు వర్కు నంతటినీ పూర్తిచేశాను.

ఆ రోజు మేనేజర్ నన్ను గదిలోకి పిల్చి కావలించుకున్నంత పని చేశాడు.

"యూ ఆర్ రియల్లీ గ్రేట్! నీ మాటను నిలబెట్టుకున్నావు రావ్! ఒక రూపాయికి మూడు రూపాయల వర్కు చేశావు. ఐయామ్ రియల్లీ హేపీ" అన్నాడు సంతోషంగా.

ఆయనకు థాంక్స్ చెప్పాను. నాకూ కూడా సంతోషం కలిగింది. ఆ రాత్రి ఈ విషయాన్ని తెలియజేస్తూ రేవతికి

ఉత్తరం రాశాను. పని ఒత్తిడిలో ఆలస్యంగా ఉత్తరం రాస్తున్నందుకు క్షమించమని కూడా రాశాను.

కొంచెం ఆలస్యంగానే జవాబు రాసింది రేవతి.

ఆమె ఆరోగ్యం పదిరోజులుగా బావుండలేదుట. ఆఫీసుకు సెలవు పెట్టిందిట. ఇప్పుడు ఫర్వాలేదని రాసింది.

ఒక్క రాత్రి కూడా రేవతి గురించీ ఆమె నీలిరంగు కళ్ళ గురించీ ఆలోచించకుండా నిద్ర పోలేక పోతున్నాను.

ఆమెను వదిలి అప్పుడే ఆరు నెలలయ్యింది.

రెండు నెలల క్రితం ఆమెకు ఉత్తరం రాశాను. కాని రేవతినించి జవాబు రాలేదు. ప్రతిరోజూ ఆమెనించి వచ్చే ఉత్తరం కోసం ఎదురుచూస్తున్నాను.

ఎందువల్ల రేవతి జవాబు రాయలేదు?

ఆమె కేమయ్యింది?

మళ్ళీ ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నదా?

ఇంకో ఉత్తరం రాశాను.

నాలుగురోజులకు ఆ ఉత్తరం నాకే తిరిగివచ్చింది — రేవతి అక్కడ లేదు అనే రిమార్కుతో.

నా ఆశ్చర్యానికి అంతులేదు.

రేవతి ఆ కంపెనీలో లేదా? ఏమయ్యింది? ఎక్కడకు వెళ్ళింది? ఎక్కడయినా మరో కంపెనీలో చేరిందా? అదే నిజమయితే నా కెందుకు తెలియపర్చలేదు?

ఇవన్నీ నా సందేహాలు.

ఒక్కదానికీ జవాబులేదు.

ఆ రోజునే ఆ ఆఫీసులోనే పనిచేసే మరో క్లర్కు సోమసుందర్ కి లెటర్ రాశాను రేవతిగురించి నాకు తెలియ

చేయమని—

సరిగ్గా ఐదురోజులకు సోమసుందర్ నించి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం చదవగానే నా గుండె పగిలింది. మతిపోయినట్లయ్యింది.

మైగాడ్! రేవతి మరో వ్యక్తిని పెళ్ళి చేసుకున్నదా?

ఆ కంపెనీలో నెల రోజుల క్రితం రేవతి రిజైన్ చేసింది. ఆ తర్వాత పెళ్ళి చేసుకున్నట్టుగా తెలిసిందిట. ఇక ఆమె యెక్కడ వున్నదో తెలియజేసే వివరాలు ఏవీ తనకు తెలియవని రాశాడు సోమసుందర్.

నాకు తెలిసి ఆమెకు ఎవ్వరూ లేరు.

ఒంటరిగానే వుండేది.

అతన్నించి ఆ ఉత్తరం వచ్చినరోజు రాత్రి నేను నిద్ర పోలేదు. గుండెలో యేదో కాలుతున్నట్టుగా అనిపించింది. నా గుండెమీద బలమైన దెబ్బ కొట్టి రేవతి యిలా చేస్తుందని అనుకోలేదు.

ఆమె ఎందుకు నన్నిలా మోసం చేసింది?

—నిన్ను పెళ్ళి చేసుకోవాలని నాకు లేదు రావ్. యెప్పటికీ మనం స్నేహితులుగానే వుండిపోదాం—అని ఓ ఉత్తరం రాసినట్టయితే బావుండేదేమో!

కాని ఆమె అలా చెయ్యలేదు.

# 5

ఆ రాత్రి రెండు పెట్టెల సిగరెట్లను ఖాళీ చేశాను. మనసంతా చెదిరిపోయింది.

శ్యామలను రేవతిలో చూసుకున్నాను. ఆమెతో నా జీవితాన్ని వెలుగుమయం చేసుకుందామని కలలుకన్నాను. కాని రేవతి కూడా నన్ను దగా చేసింది.

ఇప్పుడు నాకేమిటి దారి??

రేవతి ఎక్కడ వుందని వెతకాలి? వెతికి ఆమెను పట్టుకున్నా ప్రయోజనం యేమిటి? ఆమె కిప్పుడు పెళ్ళయ్యింది.

రేవతి మరో మగాడి భార్య.

నాలుగురోజులు ఆఫీసుకు సెలవు పెట్టాను. ఐదో రోజు ఆఫీసుకు వెళ్ళినప్పుడు నా రూపాన్ని చూసి మిగిలిన ఉద్యోగులు ఆశ్చర్యపోయారు.

"ఏమయ్యింద నీకు మిస్టర్ రావ్?" అడిగాడు సదానందం.

"ఒంట్లో బావుండ్లేదు."

"కాదు' నీ మనసు బాగోలేదు. నేను గ్రహించగలను" అంటూ నవ్వాడాయన. ఆయన వయసు యాభై పైన వుంటుంది.

నేను మాట్లాడలేదు.

"మానసికంగా నువ్వు దెబ్బతిన్నావు...." అన్నాడాయన మళ్ళీ.

ఆయనలా అంటున్నప్పుడు నాకు ఏడుపు వచ్చింది. ఒక్కసారిగా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మొదటిసారిగా శ్యామల ఈ లోకంనించి వెళ్ళిపోయి నన్ను ఏడిపించింది. ఈసారి రేవతి మరో మనిషితో వెళ్ళిపోయి నన్ను యేడిపిస్తోంది.

ఆ సాయంత్రం ఆఫీసు వదిలిన తర్వాత సదానందం నన్ను బలవంత పెట్టి స్కూటరుమీద తన ఇంటికి తీసుకెళ్ళాడు.

"నా అవతారం చూసి మీ ఇంట్లో మనుషులు భయపడతారేమో" అన్నాను లోపలకు వెళ్ళే ముందు.

"గుడ్ జోక్!" అన్నాడాయన నవ్వి.

సదానందం కుటుంబ సభ్యులకు నన్ను పరిచయం చేశాడు. వాళ్ళలో నన్ను జ్యోతి కొంచెంగా ఆకర్షించింది. జ్యోతి సదానందం పెద్దకూతురు. బియ్యే పరీక్షలు రాసి పెళ్ళికోసం యెదురుచూస్తోంది. అందంగా, ముఖ్యంగా ఆరోగ్యంగా వుంది.

ఆమె కళ్ళలో నాపట్ల అనురాగం కదలాడింది.

ఆ రాత్రి భోజనాలు చేస్తున్నాం....

"నాన్న ఆఫీసులో మీ వర్క్ గురించి అప్పుడప్పుడు చెబుతూ వుంటారు. ఈ రోజుల్లో మీలాగా కష్టపడి పని చేసే ఉద్యోగులు అరుదుగా వుంటారని నా నమ్మకం" అన్నది జ్యోతి.

ఆమె కాంప్లిమెంటుకు థాంక్స్ చెప్పాను.

ఆ రాత్రి అంతా నిద్రపోయినా నిద్రపట్టక బాల్కనీలో నిలబడి బయటకు చూస్తున్నాను.

బయటంతా వెన్నెల.

"ఇంకా మీరు నిద్రపోలేదా?"

వెనక్కు తిరిగాను.

జ్యోతి నిలబడి వుంది.

ఆమె కళ్ళు నన్ను అభిమానంగా చూస్తున్నాయి. మళ్ళీ ఆమే అన్నది:

"మీ మనసు బావుండలేదని నాన్న చెప్పారు. మీ మనసులోని మాట చెప్పుకునేందుకు మీకు యెవరూ వున్నట్టు ఆయనకు తెలీదుట....యెలాగయినా మీకు వూరట కలిగించమన్నాడాయన. ఒక స్నేహితురాలిగా అడుగుతున్నాను. చెప్పండి. మీ రెందుకు బాధ పడుతున్నారు....?" యెంతో లాలనగా—మృదువుగా అడి

గింది.

షాకైనాను.

ఎంతో సభ్యతగా—నా మనసుకు నొప్పి కలగకుండా ఆమె నన్ను అడుగుతోంది.

"నా ఆత్మీయుల ఒకప్పటి మరణం గుర్తుకొస్తోంది ఈ మధ్య.... నా కెవ్వరూ లేరు. ఒంటరివాడినని తెల్సు కొన్నప్పుడల్లా దిగులు పుడుతోంది."

"దిగులుపడకండి. మీరు ఒంటరి మనిషి కాదు. మీకు మేమంతా వున్నాం."

"జ్యోతీ!"

"ఇప్పటికే బాగా పొద్దుపోయింది. పడుకోండి. ఇది నిద్రపోయే సమయం. గుడ్ నైట్!" అని అక్కడినించి వెళ్ళిపోయింది.

పడుకున్న తర్వాత జ్యోతి గురించి నిద్ర వచ్చేవరకూ ఆలోచించకుండా వుండలేకపోయాను.

రేవతికీ జ్యోతికీ ఎంత భేదం?

ఒక్కరాత్రి సదానందం ఆతిథ్యం నామీద గొప్ప ప్రభావాన్ని చూపించింది. రేవతి నన్ను దారుణంగా మోసం చేసి వెళ్ళిపోవటంతో నా మనసు గాయపడింది. ఈ లోకంలో నేను ఒంటరి మనిషిననే భావం పూర్తిగా నాలో బలపడిపోయింది.

ఇప్పుడు నాకు తోడు కావాలి....

ఎవరు?

ఎవరో కాదు.

జ్యోతి....

సదానందంతో ఒకరోజు జ్యోతిని గురించి అడిగాను. ఆమెను పెళ్ళి చేసుకుంటానని చెప్పాను.

ఆయన సంతోషంగా ఒప్పుకున్నాడు.

జ్యోతి ఇష్టంతో మా ఇద్దరి పెళ్ళి నెలరోజుల్లోనే జరిగిపోయింది.

నా జీవితంలోకి వెన్నెలలా ప్రవేశించింది జ్యోతి. ఆమెతో కొత్త కాపురం పెట్టాను.

మూడు నెలలు గడిచాయి.

ఈ మూడు నెలల్లోనూ రేవతి రేపిన గాయాన్ని చాలా వరకు తన ప్రేమతో జ్యోతి నయం చేయగలిగింది. అయినా రోజులో ఒక్కసారైనా రేవతి నాకు చేసిన అన్యాయం గుర్తుకు వస్తూనే వుంది.

సరిగ్గా మూడునెల్ల తర్వాత సోమసుందరంనించి నాకో ఉత్తరం వచ్చింది. అందులో రేవతి గురించిన ఆచూకీ వుంది.

మద్రాసులో వుంది రేవతి.

ఎక్కడో తెలీదు.

ప్రయత్నంచేసి తెలుసుకోవాలి....

ఎలా?

ఇలాంటి ఆలోచనలతోనే పదిరోజులు గడిచి పోయాయి.

ఒకరోజు న్యూస్ పేపర్‌లో వాంటెడ్ కాలమ్స్ చూస్తున్నాను. అందులో ఒక ప్రకటన నన్ను విశేషంగా ఆకర్షించింది.

మద్రాసులో వున్న ఒక ప్రయివేటు కంపెనీలో ఉద్యోగానికి మనిషి కావాలిట. ఆసక్తి వున్నవాళ్ళు అప్లయ్ చెయ్యవచ్చు.

ఇదో గొప్ప అవకాశం అనిపించింది.

జ్యోతికి కూడా చెప్పలేదు. ఆ రోజునే నా

గురించిన వివరాలు యిస్తూ ఆ కంపెనీ ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టాను.

పదిహేను రోజులకు ఆ కంపెనీనించి ఇంటర్వ్యూకు రమ్మని ఉత్తరం వచ్చింది. ఆ రోజు ఆ విషయాన్ని జ్యోతికీ, సదానందానికీ చెప్పాను.

"ఇప్పుడెందుకు ఆ ఉద్యోగం?" అన్నాడు సదానందం.

నేను నవ్వి "బెటర్ ప్రాస్పెక్ట్స్ వుంటే అందులో జాయిన్ అవుతాను. హైద్రాబాద్ నించి ఈ కంపెనీకి రాలేమా. అలాగే మద్రాసు వెళతాను" అన్నాను.

మద్రాసులో వుండటం జ్యోతికి యిష్టమే అన్నది.

ఇంటర్వ్యూకు వెళ్ళాను.

బాగానే జరిగింది.

వాళ్ళ ప్రశ్నలకు సూటిగా జవాబులు తృప్తికరంగా చెప్పాను. వాళ్ళు యివ్వదల్చుకొన్న శాలరీ ప్రస్తుతం నేను గడిస్తున్నదే. ఐనా ఆ జీతానికి ఒకవేళ ఉద్యోగం యిస్తే చెయ్యటానికి ఒప్పుకొన్నాను.

ఎందుకంటే నా ధ్యేయం మరొకటి వుంది.

నాకు జీతం ముఖ్యంకాదు.

మద్రాసులో నివాసం ఏర్పరచుకొని ఎక్కడవున్నా కేవతిని వెతికి పట్టుకోవటం నా లక్ష్యం.

విజయవాడకు వచ్చేశాను.

పదిరోజులకే ఆ కంపెనీలో నాకు ఉద్యోగం వచ్చినట్టుగా తెలియజేశారు.

నా జీతం మద్రాసులో చాలా ఎక్కువ అని సదానందంతో అబద్ధం చెప్పాను.

జ్యోతి సంతోషపడింది.

విజయవాడని వదిలి మద్రాసు చేరాను.

## 6

మా బాస్ పేరు మహేంద్ర. కంపెనీ వ్యవహారా లన్నీ ఎక్కువగా ఆయనే చూసుకొనేవాడు. మేనేజర్ వున్నా కంపెనీలో పనిచేసే ఉద్యోగులు డైరెక్టుగా బాస్‌ను కలుసుకోవచ్చు.

మహేంద్రకు కోపం బాగా ఎక్కువని ఆనంద్ నాతో చెప్పాడు. ఆ కంపెనీలో చేరిన వారంరోజులకే అతను నాకు మంచి స్నేహితుడయ్యాడు.

ఆఫీసులో నాది కీలకమైన సీటు. నా సెక్షన్ నించే ముఖ్యమైన ఫైళ్ళు అన్నీ మా బాస్ సంతకాలకు వెళుతూ వుంటాయి. ఇంతకుముందు కొన్ని రోజులు నా సెక్షన్ని ఆనంద్ డీల్ చేశాడు.

మద్రాసు చేరుకొన్నాను కాని రేవతిని వెదకటం యెలాగో నాకు అర్థం కాలేదు. ఎందుకంటే మద్రాసు నగరంలో కేవలం వ్యక్తి పేరుతో ఒక మనిషిని ట్రేస్ చెయ్యటం అంటే సులభం కాదు. ఐనా యెప్పుడైనా యెక్కడైనా ఆమె నాకు ఒకసారి తటస్థపడు తుందనే నమ్మకం నాలో బలంగా వుంది.

ఆ రోజు అందరికంటే ఎర్లీగా ఆఫీసుకు వచ్చాను. బాస్ సంతకాలకు పంపవలసిన ఫైళ్ళు కొన్ని వున్నాయి.

ఫోన్ మోగింది.

రిసీవర్ తీసుకొన్నాను.

"హలో...." అన్నాను.

"ఎవరు మాట్లాడేది?"

షాక్‌తో వణికిపోయాను ఆ స్వరం వినగానే.

సందేహం లేదు. ఆ గొంతు బాగా గుర్తు....

రేవతి మాట్లాడుతోంది....

"మీరెవరు?" క్షణం తర్వాత అన్నాను.

"మిసెస్ మహేంద్ర. మీరు?"

"రావ్."

"రావ్ అంటే?"

వివరంగా చెప్పాను.

"మైగాడ్, రావ్ నువ్వా!" ఆశ్చర్యంగా అడిగింది రేవతి లోగొంతులో.

"అవును. నేనే రేవతీ! నిన్ను వెతుక్కుంటూ కేవలం నీ కోసమే మద్రాసుకు వచ్చాను విజయవాడ నించి."

అక్కడ యెవ్వరూ లేరు. అందుకే ధైర్యంగా మాట్లాడుతున్నాను. నా ఆశ్చర్యానికి అంతులేకుండా వుంది. వూహించని విధంగా రేవతి ఆచూకీ తెలిసింది.

"ఫోన్లో మాట్లాడటం కుదర్దు రావ్....మనం తీరిగ్గా మాట్లాడుకోవాలి. సాయంత్రం ఆరుగంటలకు ఎగ్మూర్ స్టేషన్ దగ్గర నాకోసం యెదురుచూస్తూ వుండు....ఆయన బాత్ రూంలో స్నానం చేస్తున్నాడు. పదిహేను నిముషాల్లో ఆఫీసుకు వస్తాడుట. ముఖ్యమైన ఫైళ్ళన్నీ రెడీ చేసి వుంచమని చెప్పాడు."

ఫోన్ పెట్టేసింది రేవతి.

రిసీవర్ని రెస్టుమీద వుంచినా నా గుండె వేగంగా కొట్టుకోవటం తగ్గలేదు.

జరిగినదంతా కలగా వుంది. ఇంత సులభంగా రేవతిని కలిసే అవకాశం వస్తుందని కల్లో కూడా వూహించలేదు....

పదిహేను నిముషాలకు మా బాస్ వచ్చాడు. ఫైళ్లన్నీ చూశాడు. గబగబా సంతకాలు చేశాడు. అంతా అయి పోయిన తర్వాత "నువ్వు బాగా వర్కు చేస్తున్నావు.... ఇంతకుముందు యెక్కడ వర్కు చేశావ్?" అనడిగాడు సిగరెట్టు వెలిగించుకొంటూ.

"విజయవాడ సదరన్ ఏజెన్సీలో."

"ఇంకా?"

హైద్రాబాద్ గురించి కూడా చెప్పాలనిపించినా ఇంకేవో నాకు తెలిసిన రెండు ప్రయివేటు కంపెనీల పేర్లు గబగబా చెప్పాను.

"గుడ్! జీవితంలో పైకి రావాలనే నీ తపన నాకు నచ్చింది. కష్టించి పనిచేసే నీ నేచర్ కూడా నాకు నచ్చింది. నీ శాలరీ రెయిజ్ చెయ్యమని మేనేజర్‌తో చెబుతాను" అన్నాడాయన.

ఆయనకు థాంక్స్ చెప్పాను.

ఆయన వెళ్ళిపోయాడు.

అసూయగా వుంది. ఆయన స్థానంలో రేవతి భర్తగా నేను వుండాలని కలలు కన్నాను. కాని నా స్థానాన్ని ఆయన అలంకరించారు.

రేవతి నాకు చెప్పకుండా యెందుకు పెళ్ళి చేసుకొన్నదో బాగా అర్థమయ్యింది.

కేవలం డబ్బుకోసం. హోదా కోసం.... సొసైటీలో ఉన్నతస్థానం కోసం.... అంతే....

ఆరుగంటలకు ఎగ్మోర్ స్టేషన్ దగ్గరకు వెళ్ళాను. నేను వెళ్ళిన పదిహేను నిముషాలకు టాక్సీలో రేవతి వచ్చింది. ఆమెలో యెక్కువగా మార్పు కనపడలేదు. ఐతే ఐశ్వర్యం తెచ్చే మార్పులు ఆమెలో స్పష్టంగా కనుపిం

చాయి.

"రావ్! ఎంతసేపయ్యింది నువ్వొచ్చి?"

"సరిగ్గా ఆరుగంటలకు వచ్చాను."

ఆమె వెంటనే టాక్సీని పిల్చింది.

"ఎక్కు."

బేక్ డోర్ తెరుచుకొని యెక్కాను. ఆమె నా పక్కన కూర్చుంటూ "అడయార్ బీచ్‌కు పోనీ" అన్నది డ్రయివర్‌తో.

టాక్సీ పరుగెత్తుతున్నప్పుడు రేవతి నాతో మాట్లాడలేదు. నా చేతిమీద చెయ్యివేసి మృదువుగా నొక్కింది.

ఆమె స్పర్శ నాలో ఉత్తేజాన్ని కలిగించింది.

తనకు తానే అలాంటి చొరవ తీసుకుంటుందని అనుకోలేదు.

టాక్సీ ఆగింది.

దిగి నిల్చున్నాను.

హేండ్ బేగ్ తెర్చి తనే డబ్బులు తీసి టాక్సీ-ఫేర్ చెల్లించింది.

బీచ్‌లో ఇసుకమీద నడుస్తున్నాం.

ఆమె ఒక చోట కూర్చుంది. పక్కనే కూర్చున్నాను.

సముద్రం గుఱ్ఱం యెక్కిన మనిషిలా వూగుతోంది. ఎవరో తరుముతున్నట్టు కెరటాలు దూసుకొస్తున్నాయి ఒడ్డుకు.

ఆవే నీలిరంగు కళ్ళు....

"రేవతీ....ఎందుకిలా చేశావ్?"

ఆమె మాట్లాడలేదు. నిశ్శబ్దంగానే ఏడ్చింది.

"ఏడుస్తున్నావా? ఎందుకు? నన్ను మోసగించి ఓ లక్షాధికారిని పెళ్ళి చేసుకొన్నందుకా?"

ఆమె కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి.

"నీ మాటలతో నన్ను హింసించకు రావ్...." చేతులతో మొహాన్ని కప్పుకుంటూ అన్నది ఏడుపు మధ్య.

"హింస అంటున్నావా రేవతీ! నువ్వు పెళ్ళి చేసుకొన్నావని తెలిసినప్పుడు నేనెంత హింసని, క్షోభని అనుభవించానో నువ్వు వూహించగలవా? నువ్వంటే నాకు యిష్టంలేదు రావ్! నేను మరో మనిషిని పెళ్ళి చేసుకుంటున్నాను—అని నువ్వు నాకు ఒక ఉత్తరం రాసినట్లయితే ఈ రోజు నేను నీ కోసం మద్రాసుకు వచ్చే అవసరం వుండేది కాదు రేవతీ. నువ్వింత దగా చేస్తావనుకోలేదు" కసిగా అన్నాను.

"రావ్! ఇక మాట్లాడకు రావ్. నిజం నీకు తెలీదు. నేను మోసపోయాను. నేను దగా చేయబడ్డాను. జరిగిందేమిటో నీకు తెలీదు. నన్ను చెప్పనివ్వు...." ఏడుపు ఆపి కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నది రేవతి.

"ఏమిటి రేవతీ నిజం?? ఏం జరిగిందని చెప్పి నన్ను నమ్మించే ప్రయత్నం చేస్తున్నావ్??"

"నువ్వు వెళ్ళిపోయిన కొన్ని రోజులకు మహేంద్ర ఒకసారి మన ఆఫీసుకు వచ్చాడు. మన బాస్‌తో ఒక ఒప్పందం గురించి ఇద్దరూ మాట్లాడుకొన్నారు. ఆ బిజినెస్ డీడ్ మహేంద్ర బసచేసిన హోటల్లో వుందనీ దాన్ని తీసుకురమ్మని బాస్ నన్ను పంపించాడు. హోటలుకు వెళ్ళాను. మహేంద్ర నన్ను నవ్వుతూ ఆహ్వానించాడు. ఏదో జూస్ యిచ్చాడు గ్లాసులో. ఆయన కూడా తీసుకున్నాడు. అనుమానించకుండా తాగేశాను. కొంచెం

నేపటికే నాకు కళ్ళు తిరిగాయి. స్పృహ తప్పాను.

మళ్ళీ స్పృహ వచ్చేసరికి జరిగిన ఘోరం తెలిసి కుమిలి పోయాను. మహేంద్ర నా శీలాన్ని బలిగొన్నాడు. ఏడ్చాను. చివరకు నన్ను పెళ్ళి చేసుకోటానికి ఒప్పుకున్నాడు. అక్కడ రిజైన్ చేసి వచ్చేశాను. నన్ను పెళ్ళి చేసుకొన్నాడు. పెళ్ళి చేసుకొని పంజరంలో పక్షిలా నన్ను బంధించాడు రావ్. ఇప్పుడు నేను ఆయన పశు కోరికలను తీర్చే యంత్రాన్ని. నీకు తెలీదు రావ్. ఆయన గొప్ప శాడిస్టు. ఆయనతో అనుక్షణం నరకం అనుభవిస్తున్నాను. ఆ ఇల్లు నాకు బందిఖానా."

ఆమె చెప్పినదంతా విని నమ్మాలో—నమ్మకూడదో తెలీక సందిగ్ధంలో పడిపోయాను.

"రేవతీ.... ఇదంతా నిజమా?!"

"నిజం రావ్! నూటికి నూరుపాళ్ళు నిజం."

"నమ్మలేను రేవతీ! మహేంద్ర అలాంటి మనిషంటే నమ్మలేకుండా వున్నాను."

"నిన్నెలా నమ్మించాలో చెప్పు రావ్! నన్నేం చెయ్యమంటావ్?? నన్ను నీ నుంచి దూరం చెయ్యటానికి కారణం ఈ మహేంద్ర. నేనేం చెయ్యను? మచ్చ పడిన నా చరిత్రను దాచి నీతో పెళ్ళికి ఒప్పుకోమంటావా? ఆ పని నేను చెయ్యలేక పోయాను రావ్! అందుకే యిలా జరిగింది. ఈ తప్పు నాదికాదు. ప్లీజ్! నన్నర్థం చేసుకో" ఆమెకు ఏడుపు ముంచుకొచ్చింది.

గొప్ప డైలమాలో పడిపోయాను.

"ఇన్నాళ్ళకి నాకో ఆశాకిరణం కనపడింది. ఆ కిరణం నువ్వే రావ్. ఎలాగయినా నన్నీ బందిఖానానించి విడిపించు. ఈ రాక్షసుడి బారినించి రక్షించు" నామీదికి

ఒరిగిపోతూ అన్నది రేవతి.

చలించిపోయాను నిజంగా.

# 7

"కొన్ని వూహించని సంఘటనలు జరుగుతూ వుంటాయి. రియల్లీ వండర్" అన్నాను టీ తాగుతూ.

ఇద్దరం రెస్టారెంట్‌లో కూర్చున్నాం.

"ఏ విషయం గురించి నువ్వు చెప్పేది?" అడిగాడు ఆనంద్.

"చెబుతాను. ఇక్కడకాదు. రోడ్డుమీదకు వెళ్ళి నడుస్తూ మాట్లాడుకొందాం. ఇవాళ నీకో కథ లాంటి నిజాన్ని చెప్పాలి."

బయటికొచ్చాం.

అతను నా పక్కనే నడుస్తున్నాడు.

రేవతి గురించి అంతా చెప్పాను. ఆమె నన్ను కలుసుకున్నట్టు కూడా చెప్పాను.

"మైగాడ్....మన బాస్ భార్య నువ్వు ప్రేమించిన మనిషా!"

"అవును. నన్ను మోసంచేసి రేవతి ఒక కథను కల్పించి చెప్పిందని అనుకొంటున్నాను."

"లేదు రావ్! ఆమె చెప్పిందంతా నిజం. మన బాస్ మహేంద్ర పెద్ద శాడిస్టు. ఆయన రేవతిని హింసించటాన్ని రెండుసార్లు నేను చూశాను."

"నిజంగానా?!"

"ఒకసారి ఒక ముఖ్యమైన ఫైలుమీద సంతకంకోసం బాస్ యింటికి వెళ్ళాను. ఆయన దాన్ని చూస్తున్నప్పుడు రేవతి కాఫీ తీసుకవచ్చింది. ఒకసారి కాఫీ సిప్ చేసి

'ఇడియట్! ఇది కాఫీయేనా?' అంటూ కాఫీ కప్పును ఆమె మొహంమీదకు విసిరాడు. ఆమె నుదుటికి తగిలింది కప్పు. వేడి కాఫీ మొహంమీద పడి కెవ్వుమన్నది. నేను షాక్ తిన్నాను" ఆనంద్ చెబుతున్నాడు.

నా మనసు వికలమయ్యింది.

దారుణం....ఐతే రేవతి చెప్పిందంతా నిజమేనా? మహేంద్ర యింతటి దుర్మార్గుడా?! రేవతికి యిప్పుడేమిటి దారి??

"రావ్! మన బాస్‌కు భార్యమీద కొంచెం కూడా ప్రేమలేదు. ఆయనకు యెంతోమంది ఇతర ఆడవాళ్ళతో అక్రమ సంబంధాలు వున్నాయి. రేవతికి ఆ ఇంట్లో రక్షణ లేదు. అతను పెట్టే బాధలు భరించలేక ఆమె యెప్పుడయినా ఆత్మహత్య చేసుకోవచ్చు. అలాంటి ఘోరం జరగక ముందే ఆమె నిన్ను వేడుకున్నట్టుగా రేవతిని ఆ కబంధ హస్తాలనించి బయటకు తీసుకువచ్చే ప్రయత్నం చెయ్యి. ఈ ప్రయత్నంలో యెటువంటి సహాయం అవసరమైనా నేను చేస్తాను. ఎందుకంటే రేవతి అనుభవిస్తున్న నరకాన్ని నేను ప్రత్యక్షంగా చూశాను."

నా తల తిరిగిపోయింది.

రేవతికి యేం జరుగుతోంది?

మహేంద్ర ఉక్కు కౌగిలిలో పువ్వులాంటి రేవతి నలిగిపోతోంది. నే సొంతగానో అభిమానించి ఆశపడిన ఓ సుకుమార పుష్పం అగ్ని కీలల్లో మండిపోతోంది. నేనేం చెయ్యాలి?

నా కర్తవ్యం యేమిటి?

రేవతిని యెలా రక్షించటం?

# 8

ఆఫీసులో అంతా వెళ్ళిపోయారు. నేనొక్కడినే ముఖ్యమైన ఫైలును చూసుకొంటూ కూర్చున్నాను. ఫైలు చూస్తున్నాను కాని నా ఆలోచనలన్నీ రేవతిమీదనే వున్నాయి. మళ్ళీ ఆమెను కలుసుకొనే అవకాశం దొరక లేదు. ఆనంద్—మహేంద్రవల్ల రేవతి అనుభవిస్తున్న నర కాన్ని ఎంతో క్లియర్ గా వివరించి చెప్పాడు.

ఫోన్ మోగింది.

గబుక్కున వెళ్ళి రిసీవర్ ఎత్తాను.

"రావ్ హియర్" అన్నాను.

"రావ్! నేను రేవతిని....ఆయన యిప్పుడే బయటకు వెళ్ళాడు. ఏదో ఫంక్షన్ వుందిట. ఇంకో రెండు గంటల వరకు తిరిగిరాడు. నువ్వు వెంటనే వచ్చెయ్యి....నీతో ఎంతో మాట్లాడాలి. ఎదురుచూస్తుంటాను."

ఫోన్ పెట్టేసింది.

ఒక్క నిముషం కూడా ఆలస్యం చెయ్యలేదు. ఫైలు మూసి ఆఫీసులోనించి బయటకు వచ్చాను. మెయిన్ రోడ్డుమీదకు వచ్చిన తర్వాత ఆటో యెక్కి అడ్రస్ చెప్పాను.

పావుగంట తర్వాత రేవతి మేడలోకి వెళ్ళాను. ఆమె పైన గదిలో నా కోసమే యెదురుచూస్తోంది.

లోపలకు వెళ్ళగానే తలుపులను మూసి ఒక్క సారిగా నా గుండెల మీద వాలిపోయి పెద్దగా యేడ్చింది.

"రేవతీ! ఏమిటిది?"

"నాకు బతకాలని లేదు రావ్! ఈ నరకం అనుభ విస్తూ బతకలేను. చచ్చిపోతాను" ఏడుస్తూనే అంది.

"ఎందుకు? మళ్ళీ యేం జరిగింది?"

రేవతి బెడ్ మీద కూలబడి చటుక్కున చీరకుచ్చిళ్ళను తొడలపైకి లాగింది, అక్కడ చూపించింది. ఎర్రగా కాలిన గాయం వుంది.

"రాత్రి పడకగదిలో బట్టలు వూడదీసి కాల్చాడాయన సిగరెట్టుతో, ఎంత మొత్తుకున్నా ఆయనకు జాలి కలగలేదు" ఏడుస్తూ చెప్పింది.

"మహేంద్రా!" నా పిడికిళ్ళు బిగుసుకొన్నాయి. ఆ క్షణంలో మహేంద్ర యెదురుగా వుంటే గొంతు నొక్కి చంపేవాడిని.

"నన్ను రక్షించు రావ్. ఈ బందిఖానానించి నాకు విముక్తి ప్రసాదించు."

నా గుండెల్లో ఆశ దిమీద పగ రగిలింది.

"విడాకులకు ప్రయత్నించు రేవతీ."

"విడాకులా! ఆయన ఒప్పుకోడు. ఈ ఆధారాలేవీ కోర్టులో నిలవ్వు రావ్."

"ఐతే నేనే యేదో మార్గం ఆలోచిస్తాను రేవతీ. తొందరపడి నువ్వు ప్రాణం తీసుకొనే ప్రయత్నం చెయ్యకు" లేచి నిల్చుంటూ అన్నాను. మహేంద్ర యింటికి వస్తాడనే భయం నాలో వుంది.

"రావ్! నన్ను విడిపించు. ఈ నరకం భరించలేను. నీ యింట్లో సేవకురాలిగా సంతోషంగా బతుకుతాను. నా కిక్కడ తెలిసినవాళ్ళెవరూ లేరు. నా ఆశలన్నీ నీ మీదనే రావ్. మరచిపోకు."

తలూపి వచ్చేశాను.

"ఏమిటి విచారంగా వున్నారు?" నా భార్య జ్యోతి అడిగింది ఆ రాత్రి పక్కమీద ఆలోచిస్తూ పడుకొన్న

నన్ను.

"ఏమీ లేదు జ్యోతీ."

"కాదు ఏదో వుంది. ఈమధ్య కొన్ని రోజులుగా మీరు దిగులుగా—విచారంగా వుంటున్నారు. చెప్పండి. మీ విచారంలో నేనూ భాగం పంచుకొంటాను...." అన్నది.

ఐనా జ్యోతికి చెప్పలేదు.

చెప్పకుండానే ఆమెను నిద్రపోనిచ్చాను.

నేను ఏదో ఒకటి చెయ్యాలి.

రేవతిని ఎలాగయినా రక్షించాలి.

ఎన్నిసార్లు ఆలోచించినా ఒక్కటే ఆలోచన నా మనసులోకి ఎక్కువసార్లు వచ్చింది.

అదే—

మహేంద్రను హత్య చెయ్యటం.

అవును. అంతకు మించి మరో దారిలేదు. మహేంద్ర అడ్డు తొలగించినప్పుడే నా రేవతి స్వేచ్ఛను పొందు తుంది.

ఐతే—నేను ఒక హత్యను చెయ్యగలనా?

ఇంకొంచెంసేపు ఆలోచించాను.

రేవతి దీనమైన చూపు నా కళ్ళముందు కదులుతుంటే హత్య చెయ్యగలననే ధైర్యం కలిగింది. జాగ్రత్తగా ఆలోచించి ఒక పథకం ప్రకారం అతన్ని హత్య చెయ్యాలి.

రెండు రోజుల తర్వాత ఒక రాత్రి ఆనంద్ మా యింటికి వచ్చాడు.

"నీతో మాట్లాడాలి" అన్నాడు.

"ఎవరి గురించి?" అడిగాను.

"రేవతి గురించి."

గదిలోకి వెళ్ళాం. తలుపులు దగ్గరకు మూశాను.

"రాత్రి రేవతిమీద మహేంద్ర హత్యా ప్రయత్నం చేశాడుట...." ఆనంద్ చెప్పాడు.

"మైగాడ్! నిజమా?!"

"అవును."

"నీకెవరు చెప్పారు? రేవతేనా?"

"కాదు ఆ యింట్లో పనిచేసే నౌఖరు చెప్పాడు. పాలలో విషం కలిపాడట. అదృష్టవశాత్తు రేవతి కంటే ముందే ఆ పాలను ఆ యింట్లో వుండే పిల్లి తాగి పది నిముషాల్లో తన్నుకొని చచ్చిపోయిందిట."

ఆ వార్త నాలో సంచలనాన్ని కలిగించింది.

ఇక నేను ఆలస్యం చెయ్యకూడదనుకొన్నాను.

"తప్పదు ఆనంద్, ఇక ఆ మహేంద్రను ఈ లోకం నించి తప్పించాలి. అప్పుడే రేవతిని ఆ చెరనించి విడిపించ గలం.. " అన్నాను.

"అవును రావ్! ఇందుకు నీకు యెటువంటి సహాయం అవసరం ఐనా నేను చెయ్యగలను. నువ్వు యెంతో గాఢంగా ప్రేమించిన స్త్రీ అలా మృత్యువు కోరల్లో పడివుండటం నేను సహించలేకుండా వున్నాను."

"థాంక్ యూ మై ఫ్రెండ్! ఇక నేను ఆలస్యం చెయ్యను" గట్టిగా అన్నాను.

కొంచెం సేపటికి ఆనంద్ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా ఆలోచించి పిస్తోలుతో మహేంద్రను హత్యచెయ్యటానికి నిర్ణయించుకొన్నాను. ఎలాగయినా ఒక పిస్తోలు సంపాదించాలి.

రాత్రి ఏడుగంటల సమయంలో మద్రాసులో వున్న

చైనాబజారుకు వెళ్ళాను. అక్కడ రకరకాల స్మగుల్డు వస్తువులు అమ్ముతూ వుంటారు. వాళ్ళదగ్గరే పిస్తోళ్ళు కూడా దొరుకుతాయని యింతకు ముందు కొన్నిసార్లు విన్నాను.

ఒక షాపును ఎంచుకొన్నాను. ఆ షాపులో జనం ఎవ్వరూలేరు. నెమ్మదిగా వెళ్ళి ఎలెక్ట్రానిక్ వాచీ చేత్తో పట్టుకొని "పిస్తోలు కావాలి" అన్నాను చిన్నగా దాన్ని చూస్తున్నట్టు నటిస్తూ___

అతడు నా మొహంలోకి చూశాడు.

"ఎవరు మీరు?" చిన్నగానే అడిగాడు.

"వివరాలు అవసరమా?" అన్నాను.

"కాదు. పిస్తోలు యెందుకో చెప్పండి. ఎవరైనా హత్య చేస్తారా?" మళ్ళీ అడిగాడు.

"నాకు కొంతమంది శత్రువులున్నారు. ఆత్మరక్షణ కోసం నాకు పిస్తోలు అవసరం."

అనుమాన నివృత్తికోసం అతను నన్ను చాలా ప్రశ్నలు అడిగాడు.

"ఈ షాపులో పిస్తోళ్ళు దొరుకుతాయని యెవరు చెప్పారు?" చివరగా అడిగాడు.

"అర్ముగం చెప్పాడు" గబుక్కున అన్నాను.

నిజానికి అర్ముగం ఎవరో నాకు తెలీదు. అతనికి నమ్మకం కలగటం కోసం నోటి కొచ్చిన పేరు చెప్పాను.

చివరకు బేరం కుదిరింది. అతనికి నేను పోలీసుమనిషిని కాదనే నమ్మకం కలిగింది. డబ్బు తీసుకొని బొమ్మలు పెట్టుకొనే అట్టపెట్టెలో పిస్తోలు పెట్టి ఇచ్చాడు అతను. దాన్ని యెట్లా ఉపయోగించాలో అతనే వివరంగా

చిన్నగా చెప్పాడు.

"మీరు పట్టుబడినా పిస్తోలును ఈ షాపులో కొన్నట్టుగా చెప్పకండి. ఒకవేళ చెప్పినా దాన్ని యిక్కడే కొన్నట్టు మీరు ప్రూవ్ చెయ్యలేరు" అన్నాడతను నేను తిరిగిరాబోయే ముందు.

తలూపి వచ్చేశాను.

నా భార్య నిద్రపోయిన తర్వాత ఆ పిస్తోలును జాగ్రత్తగా నా సూట్కేసులో భద్రపరిచాను.

తెల్లారి ఆఫీసుకు వెళుతూ తీసుకెళ్ళి ఎవ్వరూ చూడకుండా నా టేబిల్ సొరుగులో దాన్ని దాచి తాళం వేశాను.

అప్పుడప్పుడు మా బాస్ ఆఫీసు పని గంటలు అయిపోయి అంతా వెళ్ళిపోయాక వచ్చి ముఖ్యమైన ఫైళ్ళ మీద సంతకాలు పెట్టి వెళుతూ వుంటాడు. అప్పుడు ఆయన గదిలోనే పిస్తోలుతో మహేంద్రను కాల్చి చంపొచ్చు. అది సవుండ్ ప్రూఫ్ గది. పిస్తోలు పేల్చినా చప్పుడు ఎవ్వరికీ వినిపించదు.

ఆ సాయంత్రం నేనొక్కడినే ఆఫీసులో వున్నప్పుడు రేవతి ఫోన్ చేసింది—ఇంటికి వెంటనే రమ్మని.

వెళ్ళాను.

తలుపులు మూసి, నామీద పడి ఏడ్చింది.

"భయపడకు రేవతీ! మహేంద్రను ఈ లోకంనించి పంపటానికి తగిన పథకాన్ని సిద్ధం చేశాను."

"నీకు సాధ్యంకాదు రావ్. ఆయన తెలివిలేని మనిషి కాదు. అంత సులభంగా నీకు దొరుకుతాడనుకొంటున్నావా? లేదు, నాకు విముక్తి లేదు. ఆయన నామీద హత్యాప్రయత్నాలు కూడా చేస్తున్నాడు" ఏడుస్తూనే

అన్నది.

"నువ్వు కొన్నిరోజులు ఓపికపట్టు రేవతీ. జాగ్రత్తగా వుండి నిన్ను నువ్వు కాపాడుకో. ఆ తర్వాత మహేంద్రను ఎవ్వరూ కాపాడలేరు నానించి."

తిరిగివచ్చేను.

# 9

మైగాడ్! నా కాళ్ళు వణికాయి. శరీరం అంతా కంపించి పోయింది. నా టేబిల్ సొరుగులోని పిస్తోలు మాయమయ్యింది.

ఎవరు తీశారు?

వేసిన తాళం అలాగే వుంది.

అందులో పిస్తోలు వున్నట్టు ఎవరికి తెలుసు?

నా ఒక్కడికి తప్పించి ఎవ్వరికీ తెలీదు.

అయితే పిస్తోలు ఎలా మాయమయ్యింది?

ఆనంద్ తీశాడా? అతను తీసే అవకాశం లేదు. నేను పిస్తోలు కొన్నట్టుగా ఆనంద్‌తో చెప్పలేదు. పైగా అతను సహాయపడతా నన్నాడు. అలాంటప్పుడు అతనెందుకు పిస్తోలు మాయం చేస్తాడు??

మహేంద్ర హత్య జరగటం యిష్టంలేని మనుషులెవరో పిస్తోలును తీసేసివుంటారు?

ఎవరా మనిషి?

అసలు నేను మహేంద్రను హత్య చెయ్యటానికే ఆ పిస్తోలును ఆఫీసులో వుంచినట్టు ఎవరికి తెలుసు??

నా తల పగిలిపోతున్నట్టనిపించింది.

ఆ పిస్తోలు గురించి యిప్పుడు నేను ఎవర్ని అడగాలి? ఎలా అడగ్గలను?

ఓ....గాడ్....తల పట్టుకూర్చున్నాను.

ఆ రోజు ఉదయమే మహేంద్ర బిజినెస్ పనిమీద బొంబాయి వెళ్ళాడు.

మేనేజర్ సెలవు పెట్టాడు.

ఆనంద్‌తో పిస్తోలు గురించి చెప్పాలనుకొన్నాను. కాని చెప్పదల్చుకోలేదు. ముందు నేనే డిటెక్టు చెయ్యాలి. ఆ పిస్తోలు దొంగిలించే అవకాశం యెవరికి వున్నదో గమనించాలి.

నా చర్యలను యెవరైనా కనిపెడుతున్నారేమో తెలుసుకోవాలి. నేను పిస్తోలును టేబిల్ సొరుగులో ఉంచటాన్ని ఎవరైనా చూశారేమో ముందు నాకు తెలియాలి.

అందుకే ఆ సాయంత్రం అంతా వెళ్ళిపోయే వరకు ఏవో ఫైళ్ళు ముందు పెట్టుకూర్చున్నాను.

ఒక్కొక్కరే వెళ్ళిపోయారు.

అంతా వెళ్ళిపోయాక ఒక్కో టేబిల్ సొరుగు లాగి వెతికాను. అరగంటలో అన్నీ వెతికాను. ఎక్కడా పిస్తోలు కనపడలేదు.

నా ఆలోచనలన్నీ మొదటికొచ్చాయి.

నా కుర్చీలో కూర్చుని సిగరెట్టు కాలుస్తూ ఆలోచనలో వుండిపోయాను.

ఉన్నట్టుండి బయట యేదో కారాగిన చప్పుడయింది. రెండు నిముషాల్లో మా బాస్ లోపలకు వచ్చి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

వాట్! బాస్ బొంబాయి వెళ్ళలేదా?

నిజంగా ఇది మంచి అవకాశం. పిస్తోలు మాయం అవకుండా వుంటే మహేంద్రను హత్య చెయ్యటానికి

ఇంతకు మించి మరో అవకాశం వుండదు.

బెల్లు మోగింది గదిబయట.

బాస్ పిలుస్తున్నాడు.

డోర్ నెట్టుకొని వెళ్లాను.

వర్చీలో వెనక్కి వాలి సిగరెట్టు కాలుస్తున్నాడు బాస్. ఆ క్షణంలో నా చేతిలో పిస్తోలు లేనందుకు విచారం కలిగింది.

"కూర్చో!"

ఎదురుగా కుషన్ ఛెయిర్లో కూర్చున్నాను.

మహేంద్ర గాడ్రెజ్ టేబిల్ సొరుగు లాగి ఒక వస్తువు తీసి టేబిల్ మీద వుంచాడు.

నల్లగా నిగనిగ మెరుస్తోన్న నా పిస్తోలు!

ఆశ్చర్యంతో నా కళ్ళు పెద్దవైనాయి.

భయంగా మహేంద్రను చూశాను.

"తీసుకో రావ్! పిస్తోలు తీసుకో....నన్ను కాల్చెయ్యి....యిది నీకు అపూర్వమయిన అవకాశం...."

నిలువెల్లా వణికిపోయాను. మాట రాలేదు.

ఇదేమిటి! మహేంద్రకు యిదంతా తెలుసా? యెలా తెలుసు? నేను అతన్ని హత్య చెయ్యాలనుకోవటం అతనికి యెవరు చెప్పారు?

నా తల తిరిగిపోయింది.

"ఏమిటి రావ్ ఆలోచిస్తున్నావ్? నీ ప్లాను నాకెలా తెలిసిపోయిందనా? అంతే కదూ?"

అవునన్నట్టు తలూపాను.

"నన్ను చావునించి, నిన్ను హత్యానేరంనించి కాపాడింది—నీ భార్య జ్యోతి."

"జ్యోతి!" ముందుకు వంగుతూ నమ్మలేనట్టుగా అడిగాను.

"అవును నీకు తెలీదు. ఆనంద్, నువ్వు నా గురించి రేవతిగురించి మాట్లాడుకోవటం విన్నది. నువ్వు పిస్తోలు ఇంటికి తీసుకొచ్చి దాచటం, తర్వాత దాన్ని ఆఫీసుకు తీసుకురావటం గమనించింది. నీ ప్లాను అర్థంచేసుకుని నాకు ఫోన్ చేసి, నన్ను ఒకచోట కలుసుకుని అంతా క్లియర్‌గా చెప్పింది. నాకు నవ్వొచ్చింది. నువ్వెంత అమాయకుడివో తల్చుకుంటే జాలికలిగింది. ఐ పిటీయూ మిస్టర్ రావ్. వాళ్ళిద్దరూ నిన్ను గొప్ప ఫూల్‌ని చేశారు. హంతకుడిని చేసి జైలుకు పంపాలని గొప్పగా కథనాన్ని సాగించారు."

నాకు మతిపోతున్నట్లయింది.

"ఎవరు? ఎవరు నన్ను ఫూల్ని చేశారు?"

"ఎవరో కాదు ఆనంద్ రేవతి."

"మీరు చెబుతున్నది నిజమా?"

"జోక్ కాదు రావ్, జరిగిందేమిటో నీకు అర్థమయ్యేలా చెబుతాను. హైద్రాబాద్‌లో రాజన్ ఎక్స్‌పోర్టర్స్ ఆఫీసులో రేవతిని కలుసుకొన్నాను. ఆమె అందానికీ, ఆమె కళ్ళలోని ఆకర్షణకు లొంగిపోయి నన్ను పెళ్లి చేసుకొమ్మని అడిగాను. ఒప్పుకొంది. ఇక్కడకు తీసుకొచ్చి పెళ్ళిచేసుకొన్నాను. ఆమె నన్ను కాదు, నా డబ్బును పెళ్ళాడిందని ఆలస్యంగా గ్రహించాను.

తరచు ఫైళ్ళు తీసుకొచ్చే ఆనంద్ — రేవతితో ప్రేమలోపడ్డాడు. వాళ్ళిద్దరికీ సంబంధం వుందనీ రహస్యంగా కలుసుకొంటున్నారనీ నాకు ఈ మధ్యనే

తెలిసింది. వెంటనే ఇంట్లోనించి రేవతిని తరిమేద్దామను కొన్నాను. కాని వాళ్ళ అక్రమ సంబంధానికో ఆధారం సేకరించాలని వూరుకొన్నాను.

ఆ తర్వాత నువ్వు వచ్చావు. నీకో కథచెప్పి నన్నో క్రూరుడిగా చిత్రించారు. నువ్వు రేవతిని ప్రేమించిన ఉన్మాదంలో వున్నావు. అందుకే నీ చేత నన్ను హత్య చేయించి నా అడ్డు తొలగించుకోవాలని ప్లాను వేశారు.

రావ్! వాళ్ళు చెప్పినట్టుగా నువ్వు ఆడావు. నన్ను హత్య చెయ్యటానికి పిస్తోలు కూడా సంపాదించావు. కాని జ్యోతి నాతో అంతా చెప్పటంతో నేనే నువ్వు వెళ్ళిన తర్వాత వచ్చి నీ సొరుగులో పిస్తోలు తీసి నా టేబిల్ సొరుగులో దాచి వెళ్ళాను."

"రేవతి నన్నింతగా మోసగించిందా?"

"నిన్నే కాదు. నన్ను కూడా. కేవలం నా డబ్బుచూసి పెళ్ళి చేసుకుంది. ఆనంద్ తన అందంతో ఆమెను వశ పర్చుకున్నాడు. వాళ్ళిద్దరి నిజరూపాలను నీకు చూపిస్తాను రావ్. బయల్దేరు. నేను బొంబే వెళ్ళాననుకుని ఆనంద్ నా ఇంటికి వెళ్ళాడు."

నా గుండె మండుతున్నట్టుగావుంది. మహేంద్ర చెప్పినదంతా నిజమేనా?

టాక్సీలో మహేంద్ర ఇంటికి వెళ్ళాం.

అతను నన్ను మేడపైకి తీసుకెళ్ళాడు. ఒక గది దగ్గర ఆగిపోయాం. ఆ గది నాకు బాగా నే తెలుసు. ఆ గదికే రేవతి నన్ను తీసుకెళ్ళింది.

తలుపులు మూసివున్నాయి.

అద్దాల కిటికీలకు తెరలు వేల్లాడుతున్నాయి.

మహేంద్ర తెరను పక్కకు జరిపాడు కొంచెంగా.

లోపల దీపం వెలుగుతోంది.

ఆ దృశ్యం చూడగానే నా కళ్ళు తిరిగాయి.

రేవతి-ఆనంద్ నగ్నంగా వున్నారు. ఒకరి పక్కనే ఒకరు పడుకొనివున్నారు కబుర్లు చెప్పుకుంటూ.

"రేవతీ.... రావ్ మనం చెప్పేకథకు చలించిపోయాడు. మహేంద్రను చంపటానికి ఒక పథకం తయారుచేశానని చెప్పాడు. త్వరలోనే మహేంద్రను చంపుతాడు. అప్పుడు మనం ఇలా రహస్యంగా కలుసుకునే బాధవుండదు" ఆనంద్ అన్నాడు.

అప్పుడు రేవతి "ఆనంద్. రావ్‌లో మనుషులను హత్య చేసేంతటి ఉద్రేకం, ధైర్యంలేవు. అతన్ని ఎలాగైనా మనం ఉద్రేకపరచాలి. ఆయన నన్ను చిత్రహింసలు పెడుతున్నట్టుగా బాగా నమ్మించి ఆవేశాన్ని కలగజేయాలి. ఏమైనా రావ్‌నిచూస్తే జాలిగావుంది. గుడ్డిగా నన్ను ప్రేమించాడు. మన చదరంగంలో ఒక పావుగా వుపయోగపడుతున్నాడు. మహేంద్ర హత్యతో రావ్ జైలుకు వెళతాడు. ఇక మనిద్దరిదే రాజ్యం" ఆనంద్ మీదికి ఒరుగుతూ అన్నది.

నా చేతిలో పిస్తోలులేదు. వుంటే ఆ ఇద్దర్నీ తూటాలు ఐపోయేవరకూ కాల్చివుండేవాడిని. కోపంతో ఆవేశంతో పిడికిలితో కిటికీ అద్దాలమీద పొడవబోయాను. మహేంద్ర నన్ను వారించి కెమెరాతో కొన్ని ఫోటోలు తీశాడు.

"రావ్, నా గుండె కూడా మండుతోంది. మనం ఆవేశపడితే జరిగేది అనర్థం. ఇలాంటి కుక్కలకు చట్టంతోనే బుద్ధి చెప్పాలి. వీళ్లని తరిమెయ్యటానికి అవసరమైన

పాక్ష్యాన్ని సాధించగలిగాను. చాలు" అన్నాడు.

మహేంద్రను అపార్థం చేసుకున్నందుకు సిగ్గుపడ్డాను. "క్షమించండి" అన్నాను తలొంచుకొని. మహేంద్ర అనునయంగా నా భుజాన్ని తట్టాడు.

మనసులోనే నా భార్య జ్యోతికి థాంక్స్ చెప్పుకున్నాను—నన్నో హత్యా ప్రయత్నంనించి తప్పించినందుకు.

—: అయిపోయింది :—

# పోలీసు ఆతిథ్యం

వక్కంతం సూర్యనారాయణరావ్

వంకీలు తిరిగిన జుత్తు, వెడల్పాటినుదురు, నల్లకళ్ళద్దాలు, సన్నటి మీసాలు, నీలంరంగు నెక్ టై, ఏమాత్రం నలగని బ్రౌన్ సూటు; శివరామ్ ఠీవిగా అడుగులేస్తున్నాడు. నిగనిగలాడుతున్న బూట్లు పేవ్ మెంట్ మీద ఖరీదుగా చప్పుడు చేస్తున్నాయి. ఫిల్టర్ కింగ్ అతడి పెదవులమధ్య ఇరుక్కుని వేళ్ళాడుతోంది.

ఎడంవైపున వున్న నగల దుకాణాల్ని నిర్లక్ష్యంగా చూస్తూ శివరామ్ నడుస్తున్నాడు. 'గిరిధర్ లాల్ జ్యువలర్స్' ముందు ఆగాడు. నల్లద్దాల వెనకనుంచీ అతనికళ్ళు క్షణకాలం ఆ షాపుని ఎస్టిమేట్ వేశాయి. సగంకాలిన సిగరెట్ ని దూరంగా విసిరి, గ్లాస్ డోర్ ని తోసుకుంటూ శివరామ్ నగల దుకాణంలోకి ప్రవేశించాడు.

పట్టపగలే వెలుగుతున్న ఫ్లోరసెంట్ లైట్లకాంతి రకరకాల నగలమీద పడి మిరుమిట్లు గొలుపుతూ ప్రతిఫలిస్తోంది. ఖరీదైన మెత్తటి తివాసీ నేలని కప్పేసింది.

అరడజనుమంది ఆడవాళ్ళు రకరకాల నగల్ని తమ శరీరాల మీద ట్రై చేస్తూ నిలువుటద్దాలముందు నించున్నారు. బరువైన పర్సుల్ని మోస్తున్నవాళ్ళ భర్తలు డమ్మీల్లా నిలబడ్డారు. రాళ్ళ నెక్లెస్‌ని మెళ్ళో వేసుకొంటూ, నెక్లెస్‌ని మరిచిపోయి తన అందాన్ని తృప్తికరంగా చూసుకొంటున్న స్లీవ్‌లెస్ జాకెట్ యువతిని చూసి శివరామ్ తనలో నవ్వుకున్నాడు.

తెల్లటి మేఘాల్లావున్న బూరుగుమీద దిళ్ళకి ఆనుకుని అక్బర్ పాదుషాలా కూచున్న సేట్ గిరిధర్‌లాల్ మీద అతని చూపులు వాలాయి. శివరామ్ అతనివేపు దర్జాగా అడుగులేశాడు.

"దయ్‌చెయండి సాబ్, దయ్‌చెయండి!" సేట్ గిరిధర్‌లాల్ నాలుగు బంగారుపళ్ళు చూపిస్తూ ఆహ్వానించాడు.

శివరామ్ నగిషీలు చెక్కిన స్టూలుమీద కూచున్నాడు. ఏ. సి. షోరూంలో హాయిగావుంది. ఎడంచేతిలోవున్న గోల్డ్ సిగరెట్ కేస్‌నీ, లైటర్‌నీ గ్లాస్‌టాప్‌వున్న బల్ల మీద వుంచాడు. నల్లద్దాల్ని తీసి పట్టుకుని, సేట్ వైపు చిరునవ్వుతో చూశాడు.

"ఏంకావాలి సాబ్?" కూతుర్ని చూడ్డానికి వచ్చిన పెళ్ళికొడుకుని అడుగుతున్నంత ప్రేమగా అడిగాడు గిరిధర్‌లాల్.

"ఇవాళ మా వెడ్డింగ్ డే. నా భార్యకి ఖరీదైన ఒకటో నెంబర్ రింగ్ కావాలి," అన్నాడు శివరామ్.

"మా దగ్గిర అన్నీ ఒకటో నెంబరేసాబ్!" అంటూ గిరిధర్‌లాల్ సేల్స్‌గర్ల్‌కి సిగ్నల్ ఇచ్చాడు.

నీలంరంగు దుస్తులు ధరించిన బాబ్డ్ హెయిర్ సేల్స్ గర్ల్ ఉంగరాల కేస్ పట్టుకొచ్చింది. గిరిధర్‌లాల్ ఉంగ

రాళ్ళని వర్ణిస్తూ, రేట్లు చెప్పడం ప్రారంభించాడు. శివరామ్ సేల్స్‌గర్ల్‌ని చిరునవ్వుతో చూస్తున్నాడు. సేట్ చదువుతున్న దండకం అతన్ని ఈ లోకంలోకి లాక్కొచ్చింది. అతను అందించిన వాకీ ఉంగరాన్ని అందుకున్నాడు శివరామ్.

"తొమ్మిదివందలా డెబ్భైరూపాయలు, సాబ్!" అన్నాడు సేట్.

శివరామ్ ఉంగరాన్ని నిర్లక్ష్యంగా పడేశాడు. "ఇంకా ఖరీదైనవి లేవూ?" అన్నాడు, సేల్స్‌గర్ల్‌ని చూస్తూ—

గిరిధర్‌లాల్ తలపంకించాడు. ఆఠీన్ షేప్‌లో వున్న ఉంగరాన్ని శివరామ్‌కి అందించాడు. ఆఠీన్ షేప్ మధ్యలో డైమండ్ ఆకారంలో వజ్రం మెరుస్తోంది.

"ఎంత?" అడిగాడు శివరామ్, ఉంగరాన్ని పరిశీలిస్తూ.

"మీది సెలెక్షన్ ఠీక్ గావుంది!" అన్నాడు గిరిధర్‌లాల్ ప్రోత్సాహకరంగా. "ఏమంటావ్, రీటా?" ప్రశ్నించాడు సేట్, సేల్స్‌గర్ల్‌ని.

"సర్టెన్లీ!" అంది రీటా నవ్వి, వయ్యారం రంగరిస్తూ.

"ఎంత?" శివరామ్ కంఠంలో అసహనం ధ్వనించింది.

"వెయిట్ తక్కువున్నా, డిజైన్ జబర్దస్తీగావుంది. ఒక వెయ్యి తొమ్మిదివందలా ఎనభైయేడు రూపాయల్ అవుతుంది సాబ్!" సేట్ తడుముకోకుండా సమాధానం చెప్పాడు.

"రేటు ఎక్కువనిపిస్తోంది," శివరామ్ అనుమానంగా అన్నాడు.

"ఇక్కడ రేట్ హెచ్చా చెప్పేదీ లేదూ, తక్కా

చేసేదీలేదు సాబ్. ఫిక్సెడ్ ప్రైస్!" సేట్ మళ్ళీ నాలుగు బంగారం పళ్ళు చూపించాడు.

"ఓకే," అన్నాడు శివరామ్.

"సైజు చూసుకోండి" అంది రీటా.

"యస్. మరిచేపోయాను," శివరామ్ నవ్వాడు. "ఎక్స్‌క్యూజ్ మీ," అంటూ రీటా చేతిని పట్టుకుని ఆమె వేళ్ళను నొక్కుతూ పరిశీలనగా చూశాడు. అతని చూపులు సేట్ వేపు తిరిగాయి.

"మా ఆవిడ సైజూ, రీటా సైజూ ఒక్కటే!" అన్నాడు. రీటా నవ్వింది.

"రీటా, ఉంగ్రం ట్రై చెయ్!" సేట్ ఆజ్ఞాపించాడు ఉషారుగా.

"కరెక్ట్ సైజ్!" అంది రీటా ఉంగరం వేలికి తగిలించి, తీస్తూ.

"ప్యాక్ చెయ్యమంటారా సాబ్?" సేట్ అడిగాడు; ఎక్కువ రేటు చెప్పినందువ బేరం జారిపోతుందేమో అన్న గాబరాతో.

"ఓ యస్.... నేను క్యాష్ పట్రాలేదు. చెక్కిస్తాను. జేబుదొంగలు ఎక్కువైపోయారు. క్యాష్‌తో తిరగడం ప్రమాదం అని నా అభిప్రాయం. పైగా ఇవాళ శనివారం. బ్యాంక్ మూసేశారు...." అన్నాడు శివరామ్ జేబులోంచి చెక్కుబుక్ తీస్తూ.

గిరిధర్‌లాల్ ఇబ్బందిగా, ఒక్కరవ అనుమానంగా చూశాడు. నాలుకతో పెదవుల్ని తడుపుకొన్నాడు.

"పదమూడు రూపాయలు తక్కువ రెండు వేలు చెప్పారు. సగ్గా రెండు వేలకి చెక్కు రాస్తాను. నాకు రౌండ్ ఫిగర్స్ అంటే ఇష్టం. సోమవారం పొద్దుటే

చెక్కు బ్యాగులో వేసుకోండి," అన్నాడు శివరామ్ సేట్ కి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా.

సేట్ మొహంలో అనుమానం మాయమైంది. చిరునవ్వు ప్రత్యక్షమైంది.

"ఠీక్ హై.... అలాగే రాయండి. తమ పేరూ అడ్రసూ చెప్తే...." అన్నాడు సేట్.

"ష్యూర్. జె. శివరామ్, ఫీల్డు ఆఫీసర్, ఎక్స్ఇంపోర్టు కార్పొరేషన్, 284, చౌరస్తా."

గోల్డు కాప్ వున్న పెన్నుతో శివరామ్ చెక్కు రాసి, సేట్ ముందు పడేశాడు. రీటా రింగ్ పాకెట్ ని శివరామ్ కి అందించింది, చిరునవ్వుతో.

"థాంక్స్!" అన్నాడు శివరామ్.

"యూ ఆర్ వెల్ కం!" అంది రీటా మెరిసే కళ్లతో.

శివరామ్ బైటికి నడిచాడు. అప్రయత్నంగా తను చెప్పిన ఎక్కువ రేట్ కి మరో పదమూడు కలుపుతూ, తృప్తికరంగా నవ్వుకొంటూ సేట్ గిరిధర్ లాల్ చెక్కుని జాగ్రత్త చేశాడు.

తన తెలివి మీద గిరిధర్ లాల్ కి ఎంతో నమ్మకం. కస్టమర్ వాలకం చూసి, అతని తత్వం ఇట్టే గ్రహించి, తడుముకోకుండా రేటు రెండింతలు చేసి చెప్పేయగలడు! కొంతమంది కస్టమర్స్ కి డాబుసరి ఎక్కువ. ఇచ్చేడబ్బుకీ, పుచ్చుకునే వస్తువుకీ పొత్తుకుదురుతుందో, లేదో అని కూడా ఆలోచించరు! ఇందాకటి రింగ్ కస్టమర్ ఆజాతి వాడే! అంత చురుకైన బుర్ర వుండబట్టే సొంత రాష్ట్రం రాజస్థాన్ లో దివాలాతీసిన తను ఆంధ్రాలో అంతస్థు లెక్కుతున్నాడు! గిరిధర్ లాల్ గర్వంగా నవ్వుకున్నాడు.

"పకడ్బందీ అయిన కస్టమర్!" అన్నాడు రీటాతో,

నవ్వుతూ.

"నైస్, యంగ్ అండ్ స్పోర్టివ్!" అంది రీటా శివ రామ్ నొక్కిన వేళ్ళను తడుముతుంటూ.

## 2

చిందరవందరగా వున్నజుట్టు. బాగా నలిగిపోయిన పైజమా, జుబ్బా, ఎరుపెక్కిన కళ్ళు, శివరామ్ నీరసంగా నడుస్తున్నాడు. అతని కాళ్ళకున్న చెప్పులు పేవ్ మెంట్ మీద డల్ గా శబ్దం చేస్తున్నాయి. పడివెళ్తున్న నగల దుకాణాల్ని చూస్తూ మెల్లగా కదుల్తున్నాడతను.

'మహావీర్ జ్యువలరీ మార్ట్' ముందు ఆగాడు శివరామ్.

చిన్న షాపు. అట్టేజనం లేరు. శివరామ్ లోపలికెళ్ళాడు.

షాపు యజమాని తారాచంద్ శివరామ్ని అదో రకంగా చూశాడు. 'ఏం కావాలి?' అని బొంగురుగా అడిగాడు.

శివరామ్ జుబ్బా జేబులోంచీ ఉంగరాన్ని తీసి కౌంటర్ మీద పెట్టాడు.

"ఈ ఉంగరాన్ని అమ్మేస్తున్నా. ఎంతొస్తుందో చెప్పండి," అన్నాడు శివరామ్, అటూ ఇటూ చూస్తూ.

తారాచంద్ ఉంగరాన్ని నిర్లక్ష్యంగా చేతిలోకి తీసుకున్నాడు. ఉంగరాన్ని రెండు క్షణాలూ, శివరామ్ని నాలుగుక్షణాలూ చూశాడు. శివరామ్ ఆత్రంగా చూస్తున్నాడు.

"నాణ్యమైన సరుక్కాదు. డిజైన్ జర పాతది. ఆయిదువొందల్ కూడా చెయ్యదు....అయినా ఇలాంటివి మేం కొన్గోల్ చెయ్యం...."

"సేట్ జీ, చాలా అర్జెంటు. మీ రెంతిస్తారో ఇవ్వండి."

శివరామ్ కంఠం దీనంగా, ఆర్తంగా ధ్వనించింది.

సేట్ అర్ధమైనట్టు తల పంకించాడు. ఉంగరం చుట్టూ పిడికిలి బిగించాడు. "చూచో క్షణంలో వస్తా," అంటూ తన వెనకున్న తలుపుని తోసుకుని లోపలికి వెళ్ళి పోయాడు. శివరామ్ స్టూలుమీద చతికిలబడ్డాడు.

నిమిషాలు గడుస్తున్నాయి. శివరామ్ అసహనంగా కదుల్తూ చీటికీ, మాటికీ షాపులోని గోడ గడియారాన్ని చూస్తున్నాడు.

పదిహేను నిమిషాలు గడిచాయి.

షాపుముందు రోడ్డుమీద పోలీస్ జీపు సడన్ బ్రేక్‌తో ఆగింది. ఒక ఇన్స్‌పెక్టరూ, ఇద్దరు కానిస్టేబుల్సూ కిందకి ఉరికారు. నాలుగు అంగల్లో షాపులోకి దూరారు. అదే క్షణంలో తారాచంద్ తలుపు తెరుచుకుని షాపులో ప్రత్యక్షమయ్యాడు.

"నమస్తే ఇన్స్‌పెక్టర్ జీ, దయచెయ్యండి! దయచెయ్యండి!" అంటూ ఆహ్వానించాడు.

ఇన్స్‌పెక్టర్ చేతిలోని బెత్తం తారాచంద్‌కి ప్రతి నమస్కారం చేసింది.

"మీరు ఫోన్లో రిపోర్టిచ్చింది ఎవరి గురించి?" ఇన్స్‌పెక్టర్ ప్రశ్నించాడు.

"ఇతనే!" తారాచంద్ విజయోత్సాహంతో అరుస్తూ, శివరామ్‌ని చూపించాడు.

పోలీసులిద్దరూ శివరామ్‌కి చెరోవైపు నిలబడ్డారు, అలర్ట్‌గా. ఇన్స్‌పెక్టర్ అతన్ని తదేకంగా చూస్తున్నాడు. వాంటెడ్ లిస్టులోని ఏదో ఫొటోతో పోలిక కలపడానికి ప్రయత్నిస్తున్నట్టున్నాయి అతని చూపులు. అతని చేతిలో లాఠీ తైతక్కలాడుతోంది. శివరామ్

ఇన్‌స్పెక్టర్ని, తారాచంద్‌నీ అయోమయంగా చూశాడు.
ఇన్‌స్పెక్టర్ తారాచంద్ వైపు యెడంచేతిని చాచాడు. తారాచంద్, శివరామ్ యిచ్చిన ఉంగరాన్ని ఇన్‌స్పెక్టర్‌కి అందించాడు.

"ఈ ఉంగరం పదహారు వందల్లాగా చేస్తుంది ఇన్‌స్పెక్టర్ సాబ్. ఇతను అయిదు వొందల్కి అమ్మడానికి తయార్ అయ్యేసర్కి మాకీ హానుమానం కేసింద సాబ్. ఇది దొంగసొత్తు అయ్‌వుంటుందని మేం పసిగట్టినామ్. అందుకే బరూర్‌గా తమ్కి ఫోన్ కొట్టినామ్...." తారాచంద్ ఉత్సాహంతో చెప్పుకుపోతున్నాడు. ఇన్‌స్పెక్టర్ లాఠీతో అతన్ని వారించి, శివరామ్‌ని తీక్షణంగా చూశాడు.

"నీ పేరు?"

శివరామ్ చెప్పాడు.

"అడ్రస్?"

శివరామ్ చెప్పాడు.

"ఎక్కడ కొట్టేవు దీన్ని?" ఇన్‌స్పెక్టర్ ఉంగరాన్ని చూపిస్తూ గద్దించాడు.

"గిరిధర్‌లాల్ జ్యూవలర్స్‌లో .... కొట్టేయలేదు; కొన్నాను," శివరామ్ జవాబిచ్చాడు.

"అలాగా! ఎంతకో?" ఇన్‌స్పెక్టర్ కంఠంలో వెటకారం ధ్వనించింది.

"రెండువేలు...."

"అబ్బో! డబ్బిచ్చావా?" ఎలుకతో ఆడుకుంటున్న పిల్లి మోస్తరుగా ప్రవర్తిస్తున్నాడు ఇన్‌స్పెక్టర్.

"లేదు; చెక్కిచ్చాను" శివరామ్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఎప్పుడు?"

"ఇవాళ మధ్యాహ్నం....ఇంతకీ యేమి టిదంతా?" శివరామ్ విసుగ్గా అడిగాడు.

"ప్రశ్నలు నేను అడుగుతాను; నువ్వు జవాబులు చెప్పు. వొళ్ళు దగ్గర పెట్టుకుని....అఁ....మధ్యాహ్నం రెండు వేలకి కొన్న ఉంగరాన్ని సాయంత్రానికల్లా అయి దొందలకి అమ్మజూశావ్. ఎందుకు? బంగారం వెల అంత భయంకరంగా పడిపోలేదే!" ఇన్స్పెక్టర్ యెగతాళిగా అన్నాడు. శివరామ్ అతన్ని చురచుర చూశాడు.

"నా యిష్టమొచ్చినంతకు కొంటాను; అమ్ముతాను. అది నేరం కాదుగా?"

"ఏది నేరమో, ఏదికాదో మేం చెప్తాం. దీన్ని తెగ నమ్మడానికి యెందుకు ప్రయత్నించావో మర్యాదగా చెప్తావా! చెప్పించమంటావా?" ఇన్స్పెక్టర్ కోపంగా అడిగాడు.

శివరామ్ క్షణకాలం ఆలోచించాడు. "ఆల్ రైట్! ఇవాళ మా వెడ్డింగ్ డే. నా భార్యకి ప్రెజెంట్ చేయా లనుకొన్నాను. ఆర్నెల్లుగా మా ఇద్దరి మధ్యా అంత బాగాలేదు. ఈ రింగు అంతా సర్దుబాటు చేస్తుందను కున్నా....కానీ....నా భార్య....నాతో సంబంధాన్ని శాశ్వతంగా తెంచేసుకొంటున్నా నంది. ఆమె మనసుని యెవరో పాడుచేశారు....యెంత బతిమాలినా ఆమె విన లేదు. నేను కట్టిన తాళిని....తీసి....విసిరికొట్టింది.... నాకు జీవితంమీద విరక్తి కలిగింది. ఆమెకు దూరంగా ఈ ప్రదేశానికి దూరంగా యెటో వెళ్ళిపోవాలనిపించింది. సమయానికి నా దగ్గిర క్యాష్ లేదు. అందుకే ఉంగరాన్ని అమ్మేస్తున్నా. దాన్ని కొన్న ఉద్దేశం నెరవేరనప్పుడు,

'నా జీవితం నాశనం అయ్యేటప్పుడు దాని విలువతో నాకు పనిలేదు...." శివరామ్ ఆగాడు.

ఇన్‌స్పెక్టర్ విసుగ్గా చూశాడు. ఇలాంటి కథలు తను యెన్నో విన్నాడు! ఒక కానిస్టేబుల్‌ని షాపు మూలకి తీసుకెళ్లాడు. శివరామ్ యిచ్చిన అడ్రసుకి వెళ్ళి, అక్కడ అతని భార్య అంటూ వుంటే ఆమె కథనం ఏమిటో కనుక్కు రమ్మన్నాడు. శివరామ్ చెప్పింది నిజమో కాదో కనుక్కొని; గిరిధర్‌లాల్ షాపులో తన్ను కల్సుకో మన్నాడు. కానిస్టేబుల్ గబగబా వెళ్ళిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ శివరామ్‌వైపు నడిచాడు. "కమాన్!" అన్నాడు.

"ఎక్కడికి? ఎందుకు? నాకు అర్జెంటు పనుంది...." శివరామ్ అరిచాడు.

"నీ పని నేను చూస్తాను....గిరిధర్‌లాల్ షాపుకి వెళ్దాం, అతడు యేమంటాడో విందాం....టూ నాట్టూ ఇతన్ని జీపులో యెక్కించు!" అంటూ సేట్ తారా చంద్ వేపు తిరిగాడు. "మీరూ రండి" అన్నాడు.

శివరామ్ మెల్లిగా కదిలాడు. తారాచంద్ ఇన్‌స్పెక్టర్ ముందుకి నడిచాడు. "జరూర్ అయేగా ఇన్‌స్పెక్టర్ సాబ్! ఏడాదిలో మేం సంపాదించేదాన్ని ఒక్క క్షణంలో మాయంచేసే ఇలాంటి బదాచోర్లని పట్టుకోడానిక్కి ఏం చెయ్యమన్నా చేస్తామ్! పదండి, పదండి!" తారాచంద్ ఉత్సాహంగా అన్నాడు.

శివరామ్ అతనివేపు కోపంగా చూస్తూ తిరిగాడు. కానిస్టేబుల్ చెయ్యి అతని భుజంమీద బలంగా పడింది. అతను కదిలాడు. క్షణంలో జీపు స్టార్టయింది.

# 3

ఇన్‌స్పెక్టర్ని, కానిస్టేబుల్ని చూసి, సేట్ గిరిధర్ లాల్ ఆదరాబాదరా లేవబోయాడు. అతని భారీ శరీరం సహకరించలేదు. తలగడలమీద చతికిలబడి, నాలుగు బంగారుపళ్ళు చూపిస్తూ ఇన్‌స్పెక్టర్ని, వోటర్ని ఆహ్వానించే ఎన్నికల అభ్యర్థిలా ఆహ్వానించాడు. తారా చంద్‌కి 'రామ్ రామ్' చెప్పాడు.

ఇన్‌స్పెక్టర్ ఉంగరాన్ని గిరిధర్‌లాల్ ముందు పడేశాడు. శివరామ్‌ని అతని ముందుకు తోశాడు. గిరిధర్ లాల్ ఉంగరాన్నీ, శివరామ్‌నీ అయోమయంగా చూశాడు.

"ఈ ఉంగరాన్ని ఇతను మీదగ్గర కొన్నాడా?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

గిరిధర్‌లాల్ గుటకలు మింగాడు. మరీ సాదా అయిన వేషంలో వున్న శివరామ్‌ని అతను చటుక్కున పోల్చుకో లేక పోయాడు. దీనంగా రీటా వేపు చూశాడు.

"అతనే సేట్ జీ! కాకపోతే, ఇప్పుడు రాళ్ళు తీసేసిన ఉంగరంలా వున్నాడు!" అంది రీటా. సేట్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

"ఠీక్ హై. ఉంగ్రం ఇతనేకి అమ్మామ్ ఇన్‌స్పెక్టర్ సాబ్!"

"ఎంతకి?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

గిరిధర్‌లాల్ గతుక్కుమన్నాడు. చాలా యెక్కువ రేటు తీసుకొన్నట్టు తెల్సుకొని యితను పోలీసులకు ఫిర్యాదు చేశాడా? అంతా కలిసి, తారాచంద్ చేత ఉంగరాన్ని మదింపు వేయించారా? నిజం చెప్పక తప్పదు....

"... రెండు వేలకే అమ్మేశామ్ సాబ్! ఆ డిజైన్, ఆ

వజ్రమ్ రేట్ థోడా హై కా అని ముందే చెప్పి నామ్...."

"డబ్బిచ్చాడా?" ఇన్స్పెక్టర్ విసుగ్గా, అడ్డొస్తూ అడిగాడు.

"అహహ .... క్యాష్ తేలేదన్నాడు; చెక్కిచ్చాడు...."

"ఊ....ఏదీ ఆ చెక్కు? బ్యాంకులో చెల్లేదో, కుంపటి వెలిగించేదో చూద్దాం!"

గిరిధర్‌లాల్ క్షణంలో గాలి తీసేసిన బెలూన్‌లా అయిపోయాడు. చెరువులోంచి గట్టుమీదకి విసరబడిన చేప మొప్పల్ని తెరిచినట్టు నోరు తెరిచాడు.

శివరామ్ అతన్నే చూస్తోన్నాడు. అతని నాలుగు బంగారు పళ్ళూ కిందికి రాలిపోతాయేమో అని పించింది.

గల్లాలోంచి అతి కష్టంమీద చెక్కుని ఇవతలికి తీసి వణికే చేతో ఇన్స్పెక్టర్‌కి అందించాడు. ఇన్స్పెక్టర్ చెక్కుని పరిశీలిస్తూ వుండిపోయాడు. గిరిధర్‌లాల్, శివ రామ్‌నీ, తారాచంద్‌నీ, ఇన్స్పెక్టర్నీ గాబరాగా చూస్తూ వుండిపోయాడు. ఇన్స్పెక్టర్ మాటలు అతని లోంచే ఒక గాబరాని తీసేసి, మరో గాబరాని ఎక్కిం చాయి.

"మధ్యాహ్నం రెండు వేలకి కొన్న ఈ ఉంగరాన్ని సాయంత్రం అయిదొందలకి అమ్మే ప్రయత్నం చేశా డితను. దాంతో, ఇది దొంగసొత్తు అని అనుమానించి తారాచంద్ మాకు తెలియజేశాడు. చూస్తోంటే ఇది దొంగ చెక్కు అనిపిస్తోంది...."

"ఇన్స్పెక్టర్ జీ, ఉంగ్రం మాకి ఇచ్చేయండి! ఈ

జోకర్ సాలాను జైల్లో పెట్టండి...." గిరిధర్ లాల్ ఆత్రంగా అరిచాడు.

ఇన్స్పెక్టర్ చిన్నగా నవ్వాడు. "గాబరాపడకండి. మీ ఉంగరం ఎక్కడికీ పోదు! చెక్కు చెల్లుతుందో లేదో బ్యాంకుకి వెళ్ళేగానీ తెలీదు. ఇవాళ శనివారం. సోమ వారం దాకా ఆగాలి...."

చెవిలో జోరీగ దూరిన ఎద్దులా, గిరిధర్ లాల్ తలని అటూ ఇటూ ఆడించాడు. "ఇన్స్పెక్టర్ సాబ్. ఈ జులాయిని వదలకండి. ఇదేదో తేలి మా పైకం మాకీ ముట్టేదాకా మీ కస్టడీలో వుంచుకోండి...." గిరిధర్ లాల్ రొప్పుతున్నాడు.

ఇన్స్పెక్టర్ సాలోచనగా శివరామ్ వేపు చూస్తూ, బెత్తాన్ని గిరగిర తిప్పుతున్నాడు, వేళ్ళమధ్య. తలుపు తోసుకుని మొదటి కానిస్టేబుల్ ఆదరాబాదరావచ్చాడు. ఇన్స్పెక్టర్ అతనికి దగ్గరగా, శివరామ్ కి దూరంగా జరిగాడు. కానిస్టేబుల్ తగ్గుస్వరంలో ప్రారంభించాడు.

"తను గొడవగురించి అతను చెప్పిందంతా నిజమే సార్. అతనితో సంబంధాన్ని తెంచేసుకుంటున్నట్టూ, త్వరలో చట్టరీత్యా విడాకులు తీసుకోబోతున్నట్టూ అతని భార్య— పేరు లత— చెప్పిందిసార్. ఉంగరం గురించీ, చెక్కు గురించీ చెప్పాను. బ్యాంకు ఖాతాలో డబ్బు లేక పోయినా, చెక్కు-బుక్కు మాత్రం ఎప్పుడూ అతనిదగ్గ రుంటుందనీ, ఎంత పాడుపని చెయ్యడానికైనా అతను వెనుదీయడనీ అంది సార్, ఆమె. అందుకే అతని పీడ వదిలించుకోబోతున్నట్టు, దొంగ చెక్కుతో ఉంగరంకొని తనకి వెడ్డింగ్ డే ప్రెజెంట్ గా ఇవ్వబోయిన అతని లుచ్ఛా ప్రయత్నాన్ని విడాకుల కేసులో ఒక పాయింటుగా ఉప

యోగించుకుంటానంది సార్!" అతను ఊపిరి పీల్చుకుంటూ ఆగాడు.

ఇన్‌స్పెక్టర్ సాలోచనగా తల పంకించాడు. అతని కళ్ళు మెరుస్తున్నాయి. గంభీరంగా శివరామ్‌వేపు అడుగు లేశాడు. అతని మొహంలోకి తీక్షణంగా చూశాడు. "ఈ క్షణంనుంచీ నువ్వు మా అతిథివి!" అన్నాడు వెటకారంగా.

"ఇన్స్‌పెక్టర్ జీ. మంచిమాట చెప్పినార్. ఉంగ్రం మాకీ యిచ్చేస్తారా?" సేట్ గిరిధర్‌లాల్ ఆత్రంగా అడిగాడు.

"ఇదేదో తేలేదాకా ఇతనూ, ఉంగరం మా కస్టడీలో వుంటారు. సోమవారం చెక్కుని బ్యాంక్‌లో వేసేదాకా అది చెల్లుతుందో, లేదో తెలీదు...."

గిరిధర్‌లాల్ తలను గంగిరెద్దులా ఆడించాడు. "ఠీక్ గా చెప్పినార్! మేమ్ ఫిర్యాద్ రాసిస్తాం. ఈ గూండాని జెయిల్లో పడేయండి!"

"ఓ కే....ఓ కే....మీరు కంప్లెయింట్ యివ్వండి. తారాచంద్ జరిగిందంతా స్టేట్‌మెంట్ రాసిస్తాడు. వాటి బేస్‌మీద వీణ్ణి లోపల తోస్తాం. సోమవారం బ్యాంక్‌కి వెళ్ళి, నన్ను కల్సుకోండి," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

శివరామ్ తనని పట్టుకున్న కానిస్టేబుల్ చేతిని విదిలించుకొని ఇన్‌స్పెక్టర్ దగ్గరగా నడిచాడు. అతని కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. "ఇన్‌స్పెక్టర్, తొందరపడుతున్నారు. ఆ చెక్కు చెల్లుతుంది. నన్ను అరెస్టు చేస్తే ఆ తరవాత విచారిస్తారు!"

ఇన్‌స్పెక్టర్ పళ్ళు కొరికాడు. "పటవ్! నీ కిది

మొదటి కేసు కావొచ్చు. నీలాంటి జాలాయిల్ని నా తలలో వున్న వెంట్రుకలంత సంఖ్యలో చూశాను! ... టూ నాట్టూ, బేడీలు తగిలించు!"

"ఇది అన్యాయం!" శివరామ్ అరిచాడు. అతని ఎడం చేతికి బేడీ క్లిక్ మంది. శివరామ్ తన చేతికి వున్న బేడీని, ఇన్ స్పెక్టర్ని క్షణకాలం చూశాడు. అతని చూపులు సేట్ గిరిధర్ లాల్ మీదా, తారాచంద్ మీదా నిలిచాయి. ఇద్దరూ యేదో రాస్తున్నారు. రీటా అతన్నే ఆశ్చర్యంగా చూస్తోంది.

సేట్ జీలు యిద్దరూ కంప్లెయింట్ నీ, స్టేట్ మెంట్ నీ ఇన్ స్పెక్టర్ కీ అందించారు.

గిరిధర్ లాల్ సైగతో రీటా ఫ్రిజ్ లోంచి చల్లటి బాదంపాలుని ఇన్ స్పెక్టర్ కీ, పోలీసులకీ అందించింది.

కాసేపట్లో శివరామ్ని యెక్కించుకొని పోలీస్ జీపు వెళ్ళిపోయింది.

గిరిధర్ లాల్ నీరసంగా పరుపుమీద చతికిలబడ్డాడు. అతని యెదురుగా పద్మాసనం వేసుక్కూచుని తారా చంద్ తను బుర్రను వుపయోగించిన విధానాన్ని పురాణ కాలక్షేపంలా చెప్పడం ప్రారంభించాడు.

## 4

సోమవారం, ఉదయం పదకొండు కావస్తోంది.

ఫియట్ కారు పోలీస్ స్టేషన్ ముందు ఆగింది.

సేట్ గిరిధర్ లాల్ భారీశరీరం కార్లోంచీ యివతలకి వచ్చింది. గున్న ఏనుగులా నడుస్తూ అతను స్టేషన్ లోపలికి ప్రవేశించాడు.

అతని మొహం నిండా చెమటలు కమ్మాయి. ఉల్లి

పొరలాంటి తెల్లటి జుబ్బా చెమటతో అతని శరీరానికి అక్కడక్కడా అతుక్కుపోయింది. గోల్డ్ రిమ్ అద్దాలు తీసి, జేబురుమాలుతో అతను ముహం తుడుచుకొని, ఇన్ స్పెక్టర్ కి నమస్తే చెప్పాడు. ఎల్లముంగున్న కుర్చీలో తన శరీరాన్ని అతి కష్టంమీద ఇరికించాడు. నాలుకతో పెదాలు తడుపుకున్నాడు.

"చెక్కు తిరగ్గొట్టబడిందా?" ఇన్ స్పెక్టర్ అసహనంగా అడిగాడు.

"ఠీక్ గా క్యాష్ హుయ్యింది ఇన్ స్పెక్టర్ సాబ్." గిరిధర్ లాల్ అదోరకంగా చూస్తూ జవాబిచ్చాడు. ఇన్ స్పెక్టర్ ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"వాట్!"

"హా, సాబ్! సొమ్ము తీస్కుని తిన్నగా యిక్కడికి వచ్చినామ్!"

ఇన్ స్పెక్టర్ నిరుత్సాహంగా నిట్టూర్చాడు. "సేట్ తారాచంద్ దొంగని చూసి దొంగ అనుకున్నాడు. ఆల్ రైట్ ....మనమేం చేస్తాం?...." అంటూ బెల్ నొక్కాడు. టూనాట్టూ వచ్చి, గడకర్రలా నిలబడ్డాడు.

"శివరామ్ని వొదిలేయండి. చెక్కు క్యాషయ్యింది" అన్నాడు మెల్లిగా. గిరిధర్ లాల్ వేపు చూశాడు.

"సేట్ జీ చెక్కు క్యాషయ్యిందనీ, ఉంగరంతో బాటు శివరామ్ని వదిలేయమనీ రాసియ్యండి," అన్నాడు.

"జరూర్ గా రాసిస్తామ్!" అంటూ సేట్ కుర్చీలో ఇరుగ్గా సర్దుకొన్నాడు.

టూనాట్టూ శివరామ్ని వెంటబెట్టుకొచ్చాడు. శివ

రామ్ కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. జుట్టు చిందర వందరగా వుంది. గెడ్డం బాగా మాసింది. పైజామా, జుబ్బా బాగా నలిగి ముట్టిగొట్టుకు పోయాయి.

"మిస్టర్ శివరామ్, పొరపాటు జరిగింది. చెక్కు క్యాష్ అయ్యింది. అనుమానంమీద అరెస్టు చేశాం. ఉంగరం మీదే. తీసుకెళ్ళొచ్చు," అన్నాడు ఇన్‌స్పెక్టర్ తల వంచుకొని, టేబుల్ మీదున్న పేపర్ వెయిట్ పరిశీలిస్తూ.

శివరామ్ మౌనంగా అతన్ని చూశాడు. అతని చూపులు గిరిధర్‌లాల్ మీద వాలాయి. నాలుక కొసని పెదిమల మధ్యకు చాపి, గోల్డు పెన్‌తో కష్టపడుతూ ఏదో రాస్తున్నాడు గిరిధర్‌లాల్. శివరామ్ ఇన్‌స్పెక్టర్ వేపు వెటకారంగా చూశాడు.

"థాంక్స్ ఎ లాట్, ఇన్‌స్పెక్టర్!" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ తటాలున తలెత్తి చూశాడు. శివరామ్ నవ్వు అతనికి కమ్చీ దెబ్బలా తాకుతోంది.

"ఉంగరం ముట్టినట్టు రిసీట్ రాసివ్వండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మెల్లిగా.

"చెక్కు క్యాష్ అయ్యిందనీ, ఉంగరం పైకం ముట్టిందనీ, అది దొంగసొత్తు కాదనీ సేట్‌ని రాసివ్వమనండి. దాన్ని మీరు ఎండార్స్ చెయ్యండి. ఆ తర్వాత ఆ ఉంగరంతో ధైర్యంగా తిరగ్గలను," అన్నాడు శివరామ్.

"జరూర్, జరూర్ .... రాసిస్తాం, రాసిస్తాం" అన్నాడు సేట్ గిరిధర్‌లాల్ ఆత్రంగా.

పదినిమిషాల తరవాత శివరామ్ ఉంగరంతో స్టేషన్ బైటికి నడిచాడు.

# 5

బుధవారం మధ్యాహ్నం మూడు కావస్తోంది.

సేట్ గిరిధర్‌లాల్ బూరుగుమూది దిళ్ళమీద వెనక్కి వాలి తృప్తికరంగా నిట్టూర్చాడు. ఈ వారం బేరం బాగా సాగుతోంది. ఈ ఏడు పూర్తిగా ఇలాగే సాగితే, చార్‌స్తాలో మరో బ్రాంచి తెరవ్వొచ్చు. త్వరలో చార్‌స్తాలో తెరవబోయే బ్రాంచికి ఎంతపడుతుందో గిరిధర్‌లాల్ లోపల్లోపలే ఎస్టిమేట్స్ వేయసాగేడు.

షాపు గుమాస్తా ఒక రిజిష్టర్డు కవర్ని అతనికి అందించి వెళ్ళిపోయాడు.

గిరిధర్‌లాల్ ఆలోచిస్తూ కవర్ని చింపి, కాగితాల్ని ఇవతలకి లాగి, అప్రయత్నంగా చదువుతూ వుండిపోయాడు. కాగితాల్ని పట్టుకున్న అతని చేతులు మెల్లగా వణకడం ప్రారంభించాయి. అక్షరాలు అలుక్కుపోతున్నాయి. అతి ప్రయత్నంమీద సర్దుకొని, కాగితాల్ని బల్లమీద పరిచి, జాగ్రత్తగా మరోసారి చదవడం ప్రారంభించాడు.

రాజారామ్ అండ్ రాజారావ్, అడ్వొకేట్స్, పంపించిన నోటీసది. దాన్ని చదూతూంటే గిరిధర్‌లాల్‌కి ఊపిరి పీల్చుకోడం కష్టమైపోతోంది. పీలుస్తున్న ఆక్సిజన్ చాలటం లేదనిపిస్తోందతనికి.

తమ క్లయింటు, జె. శివరామ్‌మీద తప్పుడు కేసు బనాయించి గత శనివారం సాయంత్రం నుండీ సోమవారం ఉదయం పదకొండు గంటలదాకా అక్రమంగా జైల్లో నిర్బంధించబడేలా చేసినందుకు తమ క్లయింటు సేట్ గిరిధర్‌లాల్‌మీద లక్షరూపాయలకు పరువునష్టం దావా వేస్తున్నట్టు ఆ నోటీసుద్వారా అడ్వొకేట్స్

తెలియజేశారు.

గిరిధర్‌లాల్ శరీరం వశంతప్పి, గడగడ వణక సాగింది. ఒళ్ళంతా చెమటలు కమ్మేశాయి. నాలుక తడి ఆరిపోయి రబ్బరుముక్కలా తయారవుతోంది. గ్లాసులో వున్న నీళ్ళను గడగడా తాగేశాడు. రెండు మూడుసార్లు ముక్కుతో, నోటితో ఒకేసారి గాలి పీల్చుకున్నాడు. తారాచంద్ తెలివి, ఇన్‌స్పెక్టర్ ఆవేశం తన కొంపకి నిప్పెట్టేశాయి. ఇద్దరూ కలిసి తనలో లేని పోని అనుమానాలు కల్పించి, చాకులాంటి కస్టమర్ మీద కంప్లెయింట్ ఇప్పించారు. లోతుచూసి, మెడకి రోలు కట్టి నట్టేట్లో ముంచారు.

గిరిధర్‌లాల్ కోపంతో నాలుగు బంగారం పళ్ళని జాగ్రత్తగా కొరుక్కున్నాడు. టెలిఫోన్‌ని దగ్గరకు లాగి ఇన్‌స్పెక్టర్ నెంబర్ తిప్పాడు. అటువేపునుంచీ ఇన్‌స్పెక్టర్ కంఠం ఖంగుమంది.

"ఇన్‌స్పెక్టర్ సాబ్, గిరిధర్‌లాల్ని మాట్లాడుతున్నా. మా కొంపా మున్గి పోతోంది. ఆ శివరామ్ లక్షరూపాయల్ దేమేజస్ కేసూ ప్లీడర్ నోటీస్ ఇచ్చాడు. మీకీ తొంద్రపాటువల్లా మాకీ లుక్సానా...."

"ఐసీ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఐసాకాదు సాబ్. ఇప్పుడు మాకీ ఏం చెయ్యమంటార్?"

"అది మీ యిష్టం" ఇన్‌స్పెక్టర్ ముక్తసరిగా అన్నాడు.

"అః! పిల్వాని పేరంటాన్కి వచ్చి....అడకత్తెరలో ఇర్కించి...."

"సేట్ జీ, మేం మీ క్షేమంకోరే వచ్చాం. అప్పుడే మీరు కంప్లెయింట్ ఇవ్వకుండా మానుకోవాల్సింది!" ఇన్ స్పెక్టర్ కంఠంలో వెటకారం ధ్వనించింది.

"ఏ బహత్ అన్యాయ్ హై! లేనిపోని వానుమానాలు పుట్టించి...." క్లిక్ మన్న శబ్దం వినిపించి గిరిధర్ లాల్ కోపంగా మాతృభాషలో బూతులు తిట్టుకొంటూ ఫోన్ని దభాల్న పడేశాడు.

ఏదో గుర్తొచ్చి, తారాచంద్ నెంబరు తిప్పాడు. తారాచంద్ పలకగానే ఆదరాబాదరా అంతా ఏకరువు పెట్టాడు. అతని అతితెలివిని తిట్టిపోశాడు. లక్షరూపాయలూ అతనే యిచ్చుకోవాలన్నాడు. ఇన్ స్పెక్టర్ కీ, అతనికీ ఒక్కటిగా మాటల్లోనే గోరీ కట్టేశాడు. తారాచంద్ శాంతంగా అంతా విన్నాడు. గిరిధర్ లాల్ రొప్పుతూ కొంచెం ఆగేక ఇలా అన్నాడు:

"గిరిధర్ భాయ్. కొంపల్ అంటుకుంటే నిప్పెట్టిం దెవరా అని ఆలోచిస్తూ కూచోడం తెల్వితక్కువ పని. ముందుగా మంటల్ని ఆర్పాలి. మీ జాగాలో మేముంటే ఏం చేస్తామో తెల్సా?"

"ఏం చేస్తావ్?" గిరిధర్ లాల్ గద్దించాడు.

"జరూర్ గా, నోటీసిచ్చిన వకీల్ ద్వారా పార్టీని కల్సుకుంటాం. మెల్లిగా, సజావ్ గా పార్టీని దువ్వి, డామేజస్ లో కొన్ని సున్నాల్ని తగ్గించేస్తాం! జరిగిందీ చూస్తే జరగబోయేదీ ఆగేలా లేదనిపిస్తోంది...."

"క్యా?" గిరిధర్ లాల్ ఆశ్చర్యంతో అరిచాడు.

"హా! అరే భాయీసాబ్! మాకీ తిద్దే ఫాయిదానై. అది దొంగ చెక్కై అయ్యివుంటే మీరూ మాకీ మెచ్చు

ఖ నేవార్! అంచేత జరూర్ గా నిప్పుని ఆర్పండి....ఆగ్ బుజావ్! రాజీ ప్రయత్నం చేయండి!" అంటూ తారాచంద్ ఫోన్ పెట్టేశాడు.

గిరిధర్ లాల్ చేతిలోంచి రిసీవర్ అప్రయత్నంగా క్రిందికి జారింది. తనకి తెలీకుండానే అతను పాములా బుసకొడుతున్నాడు. రెండు గ్లాసుల నీళ్ళు తాగాడు.

నిదానంగా ఆలోచిస్తే తారాచంద్ మాటలు అర్థవంతంగా అవుపిస్తున్నాయి. తను ముళ్ళకంపమీద మఖ్మల్ గుడ్డని ఆరేశాడు. జాగ్రత్తగా, వొడుపుగా లాక్కోవాలి. ఇప్పుడు తను తన వ్యాపార నైపుణ్యాన్ని ఉపయోగించాలి.

గిరిధర్ లాల్ టెలిఫోన్ డైరెక్టరీ తిరగేసి, రాజారామ్ అండ్ రాజారావ్, అడ్వొకేట్స్ నెంబరు చూశాడు. ఇప్పుడు కొంచెం తక్కువగా వణుకుతున్న వేళ్ళతో నెంబరు తిప్పాడు.

"అడ్వొకేట్ రాజారామ్ హియర్!" అందో కంఠం.

"నమస్తే వకీల్ సాబ్! సేట్ గిరిధర్ లాల్ని మాట్లాడుతున్నా. శివరామ్ గారి తరఫున మీరు పంపిన నోటీస్ ఇప్పుడే అందింది. ఆ విషయంగా మీతో కొంచెం డిస్కస్ ...."

"ఐసీ....మీ అడ్వొకేట్ని తీసుకుని కోర్టుకిరండి...." అంది రాజారామ్ కంఠం నిర్లక్ష్యంగా.

"నోనోనోనో .... మీతో పర్సనల్ గా మాట్లాడాలి....కోర్టూ గీర్టూ ఎందుక్కులెండి...." గిరిధర్ లాల్ ఆగాడు.

"ఐసీ....లక్కీ లీ, మా క్లయింటు ఇక్కడే వున్నారు. ఆయన్ని అడుగుతా.. ఒక క్షణం...."

రెండు నిమిషాలపాటు గిరిధర్ లాల్ నిశ్శబ్దాన్ని వింటూ దిళ్ళమీద కూచున్నాడు. అతనిలో ఏవో ఆలోచనలు తిరుగుతున్నాయి. చౌరస్తాలో ప్రారంభించాలనుకున్న బ్రాంచి పొగలో కలిసిపోయినట్టే! రాజారామ్ కంఠం తీగమ్మట పాకుతూ అతని చెవిని తాకింది.

"మిస్టర్ గిరిధర్ లాల్, మా క్లయింటు బాగా అఫెండయ్యారు. ఆయనకి మీరు అన్యాయం చేశారు. మీతో కోర్టులో తప్ప మరెక్కడా మాట్లాడ్డానికి సుముఖంగా లేరు...."

"నోనోనోనో....అవ్ ఐసా నై బోల్నా....తమరలా అనకూడదు. పొరపాటు జరిగిపోయింది. సర్దుకుందాం.... మీరు...."

"పూర్తిగా వినండి. ఎలాగో మా క్లయింటుని ఒప్పించాను. ఆయన మిమ్మల్ని చూస్తారు. ఏ విధమైన గ్యారెంటీ మేం ఇవ్వలేం. కావాలంటే మీరు అరగంటలో ఇక్కడికి రావచ్చు" అంటూ రాజారామ్ ఫోన్ పెట్టేశాడు.

గిరిధర్ లాల్ కొంచెం తేలిగ్గా నిట్టూర్చాడు. షాపు చూసుకొమ్మని కొడుక్కి చెప్పి, ఆదరాబాదరా వెళ్ళి తన కారు ఎక్కాడు.

# 6

శివరామ్ నలగని సూటులో స్మార్ట్‌గా నడుస్తూ స్టేషన్‌లో ప్రవేశించాడు. అతని చేతిలో సరికొత్త సూట్ కేస్ వుంది. ప్లాట్ ఫామ్ ముందు రెడీగా వున్న ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్ వైపు నడిచాడతను, జనాన్ని తోసు

కుంటూ. ఠీవిగా ఏ. సి. కంపార్టుమెంట్ లోకి దూరాడు.

లత - అతని ప్రియురాలు—అతన్ని చిరునవ్వుతో చూసింది.

“కాయా, పండా?” అందామె.

“మన చెయ్యి తాకితే కాయలన్నీ పళ్ళవుతాయ్!” శివరామ్ సగర్వంగా అన్నాడు.

సీటుమీద చతికిలబడి, క్లిక్ మనిపిస్తూ బ్రీఫ్ కేస్ ని తెరిచాడు. లోపలున్న ఎర్రటి కేస్ తెరిచి తళతళ లాడుతున్న రత్నాల నెక్లెస్ ని తీశాడు. లతవైపు చిరునవ్వుతో చూశాడు. ఆమె వయ్యారంగా ముందుకి వంగింది.

నెక్లెస్ ని ఆమె మెళ్ళో వేశాడు శివరామ్. లత ఆనందంలో ఉక్కిరిబిక్కిరవుతూ అతన్ని వాటేసుకో బోయింది.

“ఇంకా వుంది; వోపికపట్టు!” అంటూ శివరామ్, బ్రీఫ్ కేస్ లో పరచిన పల్చటి తువాల్ని లాగాడు. లత కళ్ళల్లో దీపాలు వెలిగాయి. బ్రీఫ్ కేస్ నిండుగా వంద రూపాయల నోట్లకట్టలు నీట్ గా పేర్చబడి వున్నాయి.

“ఓహ్! డార్లింగ్! ఎంత?” లత ఉద్రేకంతో అరిచింది.

“గిరిధర్ లాల్ కాళ్ళ బేరానికొచ్చాడు. అయిష్టాన్ని నటిస్తూ, అరగంట ఏడిపించి, యాభై వేలకి వొప్పుకున్నా. ఈ నెక్లెస్ కొసరు వడ్డించాను! ఏడ్చాడు; మొత్తుకున్నాడు. ఆఖరికి లొంగిపోయాడు!”

“థాంక్యూ, డార్లింగ్!” అంది లత, నెక్లెస్ ని తడువుకుంటూ.

"డోంట్ థాంక్ మీ మానీ! పోలీసుల ముందు నువ్వాడిన నాటకం నా ప్లానుకి ప్రాణం పోసింది!" అన్నాడు శివరామ్ నవ్వుతూ.

లత అతనితో శ్రుతి కలుపుతూ అతని వొళ్ళో వాలి పోయింది.

ఎక్స్‌ప్రెస్ కూత పెట్టి కదిలింది ఢిల్లీ వేపు.

—:అ యి పో యి ం ది:—

అంకితం

అపరాధ పరిశోధక సాహిత్యాన్ని ఆంధ్ర పాఠకులకు పరిచయం చేసిన సాహితీ శిల్పి కీ|| శే|| టెంపోరావ్ గారి — దివ్యస్మృతికి —

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

చింపాంజీ అంతదాకా వెనక సీట్లో ఒదిగి కూచున్నది. కొండముచ్చులమీద తిరగబడాలనుకున్నది గాని, యింతలోనే నవీన్ కాల్పులు జరపటంతో సీటు కిందికి ఒదిగి ముడుచుకుని కూచుండిపోయింది.

దారి కిరువైపులా పెద్ద పెద్ద కొండలున్నాయి. వాటిపైన బండరాళ్ళు మనుషులెవరో పేర్చినట్టుగా ఒకదాని మీద మరొకటి నిల్చుని వున్నాయి. ఆ ప్రాంతంలో అన్నీ బండరాళ్ళే!

చింపాంజీ ఎందుకో కిచకిచమంటుంటే దానివైపు యథాలాపంగా చూశాడు నవీన్. చింపాంజీ అనిమిత్తంగా కదుల్తోంది. ఏదో చెప్పాలని ఆరాటపడ్తున్నట్టు కనిపించింది. నవీన్ తనవైపు చూడగానే బండరాళ్ళ వైపు చూసింది.

నవీన్ దాని చూపు వెంట దృష్టి సారించాడు. వెంటనే అదిరిపడ్డాడు. ఎప్పుడు కొండమీదికి ఎక్కాయో తెలీదు గాని, నలభై ఏభై కొండముచ్చులు రెండువైపుల వున్న కొండల్ని ఎక్కి బండరాళ్ళను దొర్లిస్తున్నాయి. హెడ్ లైట్స్ కాంతిలో జీప్ ముందు దొర్లుకొస్తున్న బండ రాళ్ళని చూశాకగాని నవీన్‌కి పరిస్థితి పూర్తిగా అర్థం కాలేదు.

జీప్ సడన్ బ్రేక్‌తో ఆపేశాడు. అప్పటికే దారికి అడ్డుగా పెద్ద బండరాళ్లు కోటగోడలాగా నిల్చున్నాయి. యెప్పట్నుంచి వాటిని కిందికి తోస్తున్నాయోగాని పెద్ద గుట్టగా పేరుకుని పోయాయి.

ప్రమాదాన్ని క్షణంలో గుర్తించాడు నవీన్. "సౌమ్యా, జీప్ దిగు. జీప్ వెనక్కి పరుగెత్తు. క్విక్!" అన్నాడు.

సౌమ్య మెరుపులా జీప్ దిగి వెనక్కి పరుగెత్తింది ఆ పక్కనుంచి. స్టీరింగ్ ముందునించి కిందికి జంప్ చేసి తనూ జీప్ వెనక్కి పరుగెత్తాడు నవీన్. చింపాంజీ ఒక్క గెంతున నేలమీదికి ఉరికి వాళ్ళని చేరుకున్నది.

సరిగ్గా అదే సమయంలో రెండు పక్కలనుంచి పెద్ద పెద్ద బండరాళ్ళు దొర్లుకుంటూ వచ్చి జీప్‌ని అప్పడంలా ఒత్తేశాయి. జీప్ రేకు ముక్కలా వంగిపోయింది ఆ ధాటికి. లోపల యెవరున్నా ఆ ఒత్తిడికి బండరాళ్ళ మధ్య నలిగిపోయి ప్రాణాలు వదలాల్సిందే!

క్షణంలో ప్రాణ ప్రమాదం తప్పింది.

బండరాళ్ళు యింకా దొర్లుకుంటూ వస్తూనేవున్నాయి. క్షణాల్లో జీప్ కనిపించడానిక్కూడా లేకుండా ఓ పెద్ద బండరాళ్ళ గుట్ట ఏర్పడింది అక్కడ.

నవీన్, సౌమ్య ముఖాలు చూసుకున్నారు. "ఆ కొండ ముచ్చులు యెంత క్రూరంగా ప్రతీకారం తీర్చుకున్నాయో చూడు! ఒక్క క్షణం ఆలస్యమయితే నామరూపా లేకుండా నుగ్గయి పోయుండేవాళ్ళం!...." అన్నాడు నవీన్.

కొండలమీద కిచకిచ మంటూ ఉధృతంగా గెంతుతున్నాయి కొండముచ్చులు—తోకల్ని నేలకి కొట్టుకుంటూ, ఆనందంగా. అది వాటి సహజ లక్షణం.

మరోసారి చింపాంజీ తమ ప్రాణాలు కాపాడింది. ఇద్దరూ దానివైపు అపురూపంగా చూశారు. ఇది ఏనాటి జన్మబంధమో!

"ఇప్పుడెలా? ఉన్న ఆధారమల్లా ఆ జీప్ ఒకటే. అది కాస్తా నాశనమయిపోయింది" అన్నది సౌమ్య. ఆమె తన గొంతులో నిరాశ ప్రకటితం కాకుండా యెంత జాగ్రత్త తీసుకున్నా ఒకింత తొంగిచూడనే చూసింది.

వాచీ చూసుకున్నాడు నవీన్. అయిదుగంటలు కావటానికి పదినిమిషాలుంది.

"గాడ్! మరో గంటలో గంటన్నరలో అడవిలోకి వెలుగు వచ్చేస్తుంది. మళ్ళీ శత్రువుల వేట మొదలవుతుందేమో!" అన్నాడు నవీన్.

సౌమ్య దేనిగురించో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

ఇంతలోనే, చింపాంజీ మళ్ళీ కిచకిచ మంటూ అపాయాన్ని సూచించే శబ్దాలు చేసింది. జీప్ మీదికి బండరాళ్ళు దొర్లే సమయంలో చేసిన శబ్దాల్లాంటివే!

నవీన్ దానివంక ప్రశ్నార్థకంగా చూశాడు. పొదల్లోయేదో పెద్దగా అలజడి వినిపించింది.

సూదిలాగా బల్లెం కొనల్లాగా నిక్కబొడుచుకొని

వున్న కోణాలు పొదల్లో కదులుతూ కనిపించాయి. చాలా వేగంగా వాళ్ళున్నవైపే వస్తున్నాయవి.

నవీన్‌కి క్షణంలో సగంసేపు మాత్రం అనుమానం తలెత్తి అంతలోనే అదేమిటో అర్థమయిపోయింది.

అవి ముళ్ళపందులు! దాదాపు డజనువరకు వున్నాయి. దూసుకుంటూ వాళ్ళమీదకు వచ్చేస్తున్నాయి. వాటినుంచి తప్పించుకోవాలంటే ముందు సురక్షితమైన ప్రదేశానికి యెత్తుకు వెళ్ళపోవాలి! ఆ తర్వాత వాటిని హతమార్చటమో, బెదరగొట్టటమో చెయ్యొచ్చు!

"సౌమ్యా! నాతో పరుగెత్తు. ఆ జీవ్ దగ్గర రాళ్ళగుట్ట మీదికి యెక్కి యీ ముళ్ళపందుల నుంచి రక్షించుకోవాలి!" అంటూ ఆమె చెయ్యి పట్టుకొని రాళ్ళ గుట్టవయిపు పరుగుతీశాడు. చింపాంజీ వాళ్ళని వెంబడించింది.

సరిగ్గా వాళ్ళు రాళ్ళగుట్ట యెక్కేలోపల ముళ్ళ పందులు గుట్టదగ్గరకు చేరాయి. సౌమ్య బండరాళ్ళ మీదుగా జారిపోతూంటే నవీన్ ఆమె నడుంపట్టి పైకి చేరుకున్నాడు.

ముళ్ళపందులు గుర్రుమంటూ రాళ్ళగుట్ట చుట్టూ తిరగసాగాయి. నవీన్ గన్‌తో కాల్చగానే రెండు నేల కూలిపోయాయి. ఆ శబ్దానికి తమవాళ్ళకి పట్టిన దుస్థితిని చూసి, ముళ్ళపందులు వేగంగా పొదల్లోకి పరుగెత్తుకొని పోయాయి.

కొండముచ్చులు సమయం కోసమే ఎదురుచూస్తున్న వాటిలా మళ్ళీ రాళ్ళు దొర్లించటం మొదలెట్టాయి. రాళ్ళ చప్పుడు వింటూనే ప్రమాదాన్ని గుర్తించాడు నవీన్.

మళ్ళీ నేలమీదికి గెంతి రాళ్ళగుట్టకి దూరంగా వెళ్ళి పోయారు నవీన్, సౌమ్య. బండరాళ్ళు దొర్లుతూనే వున్నాయి.

"ఈ కొండముచ్చులు మనమీద పగబట్టాయి. విడవ కుండా తమ ప్రయత్నం చేస్తూనే వున్నాయి. వీలయి నంత త్వరగా యీ ప్రదేశం వదిలి వెళ్ళిపోవాలి!" అన్నాడు నవీన్.

అప్పటికే అడవిలో సన్నగా వెలుగు పరుచుకుం టోంది. ఎదురుగా యేముందో, పక్కల ఏముందో అస్ప ష్టంగా కనిపిస్తున్నాయి.

జీవ్ వెళ్ళేదారే సంగమంగా వున్నట్టు తోచింది నవీన్‌కి. జీవ్ ముందుకి వెళ్ళకుండా గోడలా రాళ్ళగుట్ట అడ్డుగా వేశాయి కొండముచ్చులు. ఆ అడ్డుగోడ దాటి వెళ్తే మళ్ళీ తిన్ననయిన దారి వున్నట్టు గ్రహించాడు.

సౌమ్యతో అటు నడిచాడు. రాళ్ళగుట్ట పక్కనుంచి అడ్డుగోడ దాటుకుని, అవతలకు దిగారిద్దరు. చింపాంజీ వారిని అనుసరించి నడుస్తూ పక్కలకు, ముందుకి పరీక్షగా చూస్తూ అనుసరిస్తోంది.

అక్కడి దారి బాగానే వున్నది. జీవ్ ప్రయాణం చేయగలిగినంత వెడల్పయిన దారి. అక్కడ మొక్కలు బాగా నలిగివున్నాయి. అంతక్రితం బీరేంద్ర ఆ దారినే గ్లాస్ హావుస్‌కి వచ్చివుండాలి!

• • •

అప్పటికి వెలుగు రేఖలు అడవి లోపల పరుచు కున్నాయి. అయితే పోను పోను చెట్లు దట్టంగా వ్యాపించి వుండటంవల్ల దారి మళ్ళీ సన్నగా అయి పోయింది.

ఆ దట్టమైన చెట్ల మధ్య నుంచి ఏవో ఘీంకారాలు వినిపించాయి.

సౌమ్య, నవీన్ చటుక్కున ఆగిపోయారు.

అవి ఏనుగుల ఘీంకారాలు!

గాడ్! ఏనుగుల మందకు దొరికితే క్షణాలమీద తొక్కి చంపేస్తాయి. తొండాలతో చుట్టి బండకేసి మోదేస్తాయి!

నవీన్ ప్రశ్నార్థకంగా సౌమ్యవంక చూశాడు. ఆమె కూడా ఆ ఘీంకారాల్ని గుర్తించింది. అక్కడితో దారి అంతమైపోయినట్టుంది. ఎక్కడా మనుషులుగాని, జంతువులు గాని మసలిన గుర్తులేవు. బహుశా ఆ స్థలంలో ఏనుగులు మసల్తూ వుండటమే అందు కారణమయి వుంటుంది!

వాళ్ళు యేదో విషయం నిర్ణయించుకునే లోపల ఏనుగుల మంద చెట్లకొమ్మల్ని తొండాలతో విరుచుకుంటూ నానా బీభత్సం చేస్తూ పరుగులు పెడుతూ రావటం జరిగిపోయింది.

మదించిన ఏనుగుల్ని అన్నిటిని ఒక్కసారిగా వాళ్ళు యెన్నడూ చూడలేదు. సర్కస్‌లో చూసే ఏనుగులు వీటి ముందు కుక్కపిల్లలా వుంటాయి. ఒక్కొక్కటి పదిహేను అడుగుల ఎత్తుతో నిగనిగలాడే నల్లటి చర్మంతో మఱ్ఱిచెట్టు బోదెంత లావుపాటి కాళ్ళతో భయంకరంగా వున్నాయి.

"సౌమ్యా, యీ మఱ్ఱిచెట్టు ఎక్కటం తప్ప ప్రస్తుతం మరో దారి లేదు. ముందు నువ్వెక్కు!" అన్నాడు నవీన్ ఏనుగుల గుంపువైపే కన్నార్పకుండా చూస్తూ.

ముందుగా చింపాంజీ మర్రిచెట్టెక్కేసింది. చేతులు చాచి సౌమ్యని అందుకుంది. నవీన్ చేదుకున్నట్టే పైకి చేదుకున్నది. ఆ వెనకనే నవీన్ ఎక్కేశాడు.

అప్పటికి ఏనుగుల మంద చెట్లను నేలకూల్చటం చేసుకుంటూ వాళ్ళు యెక్కిన చెట్టుదగ్గరకు వచ్చేశాయి. దాట్లో రెండు చెట్లను మొదళ్ళను కుంభస్థలంతో కదిపి నేలకూల్చేశాయి. ఆ మంద తల్చుకొంటే తామెక్కిన చెట్టును కూడా క్షణాల్లో నేలమట్టం చేసెయ్య గలవు!

సౌమ్య, నవీన్ కొమ్మల మధ్య గొంతుక్కూచున్నారు. ఏనుగులు తమని చూశాయా? ఏమో, తెలీదు. తమ చెట్టు వైపే పరుగెత్తుక వస్తున్నాయి.

ఊపిరి బిగబట్టి వాటివైపే చూస్తున్నారు నవీన్, సౌమ్య.

ఏనుగులు వాళ్ళెక్కిన చెట్టును సమీపించాయి. ఆ క్షణంలోనో, మరుక్షణంలోనో తొండాలతో చెట్టు కొమ్మల్ని అందుకోబోతున్నాయి.

సరిగ్గా అదే సమయంలో సింహగర్జనలు వినిపించాయి.

ఏనుగుల తొండాలు సౌమ్య, నవీన్ కూచున్న కొమ్మనందుకోబోతూ చటుక్కున ఆగిపోయాయి.

ఏనుగుకి సింహానికి జన్మవిరోధం! సింహం ఏనుగు కుంభస్థలాన్ని కొట్టి మెదడు తింటుంది. సింహం స్వప్నంలోకి వచ్చినా ఏనుగు దడదడలాడిపోతుంది!

ఏనుగులు ఒక్కసారిగా అక్కడ్నుంచి పరుగు పెట్టాయి. అయితే యీలోపలే వెనుక వెళ్తున్న రెండు ఏనుగులు బాధతో పెద్దగా ఘీంకరించాయి. అప్పటికే రెండు సింహాలు ఆ రెండు ఏనుగుల కుంభస్థలాల మీదికి

లంఘించబోతున్నాయి.

తక్కిన సింహాలకి, మదపు టేనుగులకి మధ్య ఘోరమైన పోరు ప్రారంభమయింది. ఆ రెండు ఏనుగులు తప్ప తక్కినవన్నీ యెప్పుడో పారిపోయాయి. సింహం కన్న ఎన్నో రెట్లు భారీ శరీరాలున్న ఏనుగులు భయపడి పారిపోతుంటే చెట్టుమీద కూచున్న నవీన్, సౌమ్యలకి యెంతో వింతగా, అద్భుతంగా కనిపించిందా దృశ్యం!

ఏనుగులు రెండూ సింహాల్ని తొండాలతో చుట్టడానికి ప్రయత్నించాయి. కాని సింహాలు పంజాలు విసిరి తొండాలను గాయపరిచాయి. కాళ్ళతో తొక్కి అణిచెయ్యాలని ఏనుగులు విశ్వప్రయత్నం చేస్తూంటే సింహాలు ఎగిరి కాళ్ళను కోరల మధ్య నొక్కేస్తున్నాయి.

ఏనుగుల శరీరాలు రక్తసిక్తమైపోయి నల్లటి ఆకారాలు ఎర్రగా అయిపోతున్నాయి. అయినా అవి సింహాలతో పోరాడటం మానలేదు.

అప్పటికి బాగా తెల్లవారిపోయిన సూచనగా వెలుగు బాగా వచ్చేసింది.

సౌమ్య వాచీ చూసుకుంది. "బాప్ రే, దాదాపు రెండు గంటలనుంచి ఆ సింహాలు, ఏనుగులు ఎడతెగకుండా పోరాడుతున్నాయి. కథల్లో వినటమే గాని ఎన్నడూ ప్రత్యక్షంగా వీటి పోరాటం చూడలేదు. బతికి బయటపడితే నా స్నేహితురాళ్ళకందరికీ చెప్పుకొని కలకాలం గుర్తుంచుకో దగ్గ గొప్ప అనుభవం....!" అన్నది తదేక దీక్షతో సింహ గజేంద్ర సంగ్రామం తిలకిస్తూ....

అంతిమ విజయం నిర్ణయమైపోయింది. మహాకాయులయిన యేనుగులు బాగా అలసిపోయాయి. సింహాలు

రెట్టించిన ఉత్సాహంతో వాటిమీదికి లంఘించాయి. ఈ సారి అవి యేనుగుల కుంభస్థలాలపైకి సునాయాసంగా యెక్కేశాయి. వాటిని యేనుగులు ప్రతిఘటించలేక పోయాయి.

సింహాలు రెండూ, ఆ రెండు యేనుగుల కుంభస్థలాలను చీల్చేసి నెత్తురు తాగేశాయి. మహాపర్వతాల్లా యేనుగులు నేలమీద కూలబడిపోయాయి. వాటి మెదళ్ళు, మాంసంతో నంజుకుంటూ సింహాలు ఆకలిని తీర్చుకొన్నాయి.

ఆ తర్వాత నాలకలతో మూతుల కంటిన నెత్తురును తుడుచుకుంటూ ఠీవిగా నడుచుకుంటూ ఎటో అదృశ్యమయిపోయాయి సింహాలు.

♦ ♦ ♦

అప్పటికి గాని యీ లోకంలోకి రాలేదు సౌమ్య. ఆమె కళ్ళముందు ఆ భీకర పోరాటమే మెదుల్తోంది.

"ఈ అడవిలోని సింహాలకి ఓ ప్రత్యేక లక్షణముంది, గుర్తించావా?" అడిగింది సౌమ్య.

ఏమిటన్నట్టు చూశాడు నవీన్.

"సాధారణంగా క్రూరమృగాలు రాత్రిళ్ళు గుహ నుంచి బయటికొచ్చి ఆహారం కోసం వేటాడుతాయన్నది మనం విన్నాం. కాని యీ అడవిలోని సింహాలు తెల తెలవారుతున్న సమయంలో ఆహారంకోసం వేటాడుతున్నాయి. నిన్న ఇదేసమయానికి అటవికుల్ని వేటాడాయి. ఈ రోజు యేనుగుల్ని!"

"కరెక్ట్! నువ్వు మౌనంగా ఆలోచనల్లోకి జారిపోతుండటం చూసే అనుకున్నాను. నువ్వు చాలా తెలివైనదానివని, తార్కికశక్తిగల మేధావివని!"

"నన్ను మునగచెట్టెక్కించకు."

"ఇది మునగ చెట్టుకాదు, ఊడల మర్రి."

"ఎందుకయినా మంచిది ఓసారి ఆ వేలాడేవి ఊడలో, కొండ చిలువలో చూసుకోవటం చాలా అవసరం!"

ఆమె మాటలు హాస్యానికే అన్నా, కొట్టిపారెయ్య వలసినవి కాదని నవీన్ కి గత అనుభవం నేర్పింది. పరీక్షగా చెట్టుకొమ్మలవైపు చూశాడు!

అతని అనుమానం వ్యర్థంకాలేదు.

తాబేలు సైజులో వున్న మండ్రగబ్బలు సరిగ్గా వాళ్లు కూచున్న కొమ్మ మీదికే మెల్లగా వస్తున్నాయి పాక్కుంటూ. అప్పటికే రెండు మండ్రగబ్బలు కొండీలు పైకెత్తుకొంటూ సౌమ్యను సమీపించేశాయి కూడా.

నవీన్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా తుపాకీ బారెల్ తో వాటిని కొమ్మలకి అణచిపెట్టి నొక్కేశాడు. నుగ్గునూచగా నలిగిపోయాయి. తక్కినవాటిని కూడా అదే పద్ధతిలో చంపేశాడు. పొడవాటి తుపాకి బారెల్ ని కసిగా కొండీతో టపీటపీ మని కొట్టాయి మండ్రగబ్బలు. కాని నవీన్ నల్లుల్ని నలిపినట్టు నలిపేశాడు వాటిని. టప టప నేలమీద పడిపోయాయి.

చింపాంజీ ఆనందంగా కిచకిచలాడింది నవీన్ వాటిని చంపుతుంటే.

"వాటి తోవన అవి పోయేవికదా, ఎందుకు చంపావు వాటిని?" అడిగింది సౌమ్య, కొంటె నవ్వును పెదిమల మధ్య బిగించి.

"పాపం, యీ మండ్రగబ్బలు మంచివే గాని, ఆ కొండీలున్నాయి చూడు, వాటి ప్రమేయం లేకుండానే

తన పర భేదం లేకుండా కట్టుకుంటూ పోతాయి. అందుకనే వాటికి పనిష్మెంటు తప్పనిసరి!" అన్నాడు నవీన్ పాముల విషయంలో తను యిచ్చిన స్టేట్మెంట్ని ఆమె తిప్పికొడుతోందని గ్రహించి.

"మనం చూడబోతే యీ జీవితమంతా చెట్లమీద, రాళ్ళ గుట్టలమీదా గడిపేసేలా వున్నాం" అన్నది హ్యూమరస్ గా సౌమ్య.

నవీన్ గట్టిగా నవ్వేసి, "పోనీ, అడవిలోనే కాపురం పెట్టేసే పోలా!? ఈ జంతువుల మధ్య జీవితం గడిపేసుకోవచ్చు—పిల్లా పాపల్తో!" అన్నాడు ఆమెవైపు కొంటెగా చూస్తూ

"ఛీ, పాడు. అదేం మాటలు....?" అంది చిరుకోపంగా.

"మనం, ఎదురయిన కష్టాలకి కుంగిపోకుండా హాయిగా యిలా మాట్లాడుకోగలగటం నిజంగా అదృష్టం!"

"అనుక్షణం ప్రాణభయంతో, టెన్షన్తో నలిగిపోకుండా హాయిగా తుళ్ళుతూ మృత్యువుతో ఆడుకోవటం నయం కదూ!"

"అయామ్ రియల్లీ ప్రౌడ్ ఆఫ్ యు సౌమ్యా! నీ సాన్నిహిత్యంలో నేను సర్వం మరచిపోతున్నాను. మనం ప్రమాదాల నడిబొడ్డులో వున్న సంగతే మరచిపోయి హాయిగా నవ్వగలుగుతున్నాను."

"అసలు నా మూలాన్నే కదా నవీ, నీ కిన్ని కష్టాలు? లేకుంటే యెప్పుడో ఢిల్లీలో హాయిగా అప్రెంటిస్ చేస్తూండేవాడివి. రోజా సాయంత్రాలు ఆనందంగా ఏ కన్నాట్ ప్లేస్ లోనో, చాందినీ చౌక్ లోనో, మరో

ఫేమస్ సెంటర్‌లోనో గడుపుతూండేవాడివి! ఈ అడవిలో క్రూరమృగాల మధ్య...."

"ఉహుం గుర్తుచెయ్యకు! నీతో యిలా మాట్లాడుతూ నిప్పులకుంపటిమీద కూచోమన్నా సిద్ధంగా వున్నాను. ఈ అనుభూతి కలకాలం నా గుండెల్లో నిలిచిపోనీ!" ఆమె చేతిని మృదువుగా తన చేతుల్లోకి తీసుకుని మృదువుగా ముద్దుపెట్టుకొని తియ్యగా నవ్వాడు.

ఆమె పరవశంగా అతన్నే చూస్తోంది. కొద్ది నిమిషాలు అలాగే ఒకరి కళ్ళల్లోకి మరొకరు ఆరాధనగా ప్రేమగా చూస్తూ వుండిపోయారు. వాళ్ళు కూచున్నది చెట్టుకొమ్మలా లేదు; పట్టుపరుపులాగా వున్నది. అది కీకారణ్యంలా లేదు; మనోహరమైన సుందర ఉద్యాన వనంలాగా వుంది. పక్షుల కూతలు సన్నాయి వాద్యంలాగా శ్రావ్యంగా వున్నాయి.

చింపాంజీ వాళ్ళిద్దరి వంక ఆనందంగా చూస్తోంది. ఏమీ ఎరగని ఆ అడవి జంతువు అంతా అర్థమైపోయినట్టు తమ యిద్దర్నీ మార్చి మార్చి చూడటం వాళ్ళిద్దరికీ నవ్వు తెప్పించింది.

"ఇక చెట్టు దిగుదామా?" అన్నది సౌమ్య.

నవీన్ చెట్టుమీది నుంచి అందినంత మేరా పరిశీలనగా చూశాడు. కనుచూపు సాగినంత వరకు దట్టంగా అలముకున్న చెట్లు, గుట్టలు తప్ప ఏమీ కనిపించలేదు.

"దిగుదాం. వెలుతురున్నప్పుడే మనం ప్రయాణం సాగించటం మంచిది. అయిదారు మైళ్ళ దూరంలో అడవి ప్రారంభంలో ఫారెస్టు వాళ్ళ క్వార్టర్సున్నాయని వీరేంద్ర చెప్పాడు. మనం తిరిగిన చోటనే పది మైళ్ళు తక్కువ కాకుండా తిరిగాం. ఎక్కడా ఆ క్వార్టర్సు

జాడ కనిపించటంలేదు"

"అవి ఏ దిశలో వున్నాయో తెలీదు కదా! మనకి తోచిన దిక్కుకు పోవటమే. కనిపిస్తే సరేసరి, లేకుంటే మరో వింత అనుభవం. షరా మామూలే!" సీరియస్‌నెస్‌ని కూడా హుందాగా, ఈజీగా తీసుకుంటున్న సౌమ్య వంక ప్రశంసగా చూశాడు నవీన్.

ఇద్దరూ చెట్టు దిగారు. చింపాంజీ వాళ్ళకన్న ముందే చెట్టు దిగి ఎటో పరుగు త్తింది. ఎందుకోనని ఆశ్చర్యంగా అలే చూస్తుండిపోయారు నవీన్, సౌమ్య.

పదినిమిషాల్లో రెండు చేతుల్లోను ఏవో పళ్ళు పట్టుకుని ప్రత్యక్షమయ్యింది చింపాంజీ. పళ్ళు జారిపోకుండా చేతుల్ని గుండెలకు హత్తుకొని జాగ్రత్తగా తెచ్చి నేల మీద పోసి, మళ్ళీ పరుగెత్తింది.

పళ్ళను చూడగానే ఆకలి గుర్తొచ్చింది వాళ్ళకి. నవీన్ వాచీ చూసుకున్నాడు. పదకొండూ పది నిమిషాలయింది. "అబ్బా, చాలా టైమయిందే!" అన్నాడు జనాంతికంగా.

చింపాంజీ మరికొన్ని పళ్ళు తెచ్చి పోసింది. నవీన్ సౌమ్యకి కొన్ని పళ్ళు అందించి, "తిను. మన నేస్తం మన ప్రాణాలు కాపాడటమే కాదు, ఆకలికి ఆహారం కూడా యేర్పాటు చేస్తున్నాడు" అన్నాడు.

ఇద్దరూ కడుపునిండా తిన్నారు.

ఈసారి చింపాంజీ కొన్ని దుంపల్ని కూడా తెచ్చింది. వాటిని కూచుని తినటం మొదలెట్టింది. మనిషికన్న వివేకంగా ప్రవర్తిస్తున్న ఆ మనిషి కాని మనిషిని మురిపెంగా చూస్తున్నారు వాళ్ళు.

♦ ♦ ♦

మళ్ళీ ప్రయాణం మొదలయింది.

బాగా యిరుకు దారి. అయితే తుప్పలు, ముళ్ళకంచెలు లేకుండా నూటిగా వున్న సన్నటి బాట. చకచక నడుస్తున్నారు.

నవీన్ గన్ పొజిషన్‌లో వుంచుకొన్నాడు. మేగజైన్‌లో గుళ్ళు లోడ్ చేసుకున్నాడు.

ఆ గన్‌లో రెండుగుళ్ళే ఒక సారికి వేసుకునే అవకాశముంది. ఒకేసారి నాలుగయిదు గుళ్ళు వుపయోగించవలసిన సందర్భాల్లో అందుకే ఆలస్యమవుతోంది. రివాల్వర్ అయితే ఆరుగుళ్ళు వెంట వెంటనే ప్రయోగించే సౌకర్యముం దేది!

బెల్టులో యిక ఎన్నో గుళ్ళు లేవు. చాలా ఖర్చయిపోయాయి. అడవి వదిలేవరకు సరిపోతాయనే నమ్మకం లేదు. అడవి యింతవరకు విస్తరించి వున్నదనే అంచనా లేదు. ఆరగంటలో దాటవచ్చు. ఆరురోజులు పట్టొచ్చు. ఈ లోపల ఎదుర్కోవలసిన ప్రమాదాలకు ఎంత మందుగుండున్నా సరిపోదు. యెంతో అవసరమైతే తప్ప గుళ్ళు వాడకూడదని నిర్ణయించుకున్నాడు నవీన్.

"ఏమిటి నవీ, దీర్ఘాలోచనలో వున్నావు?" అడిగింది సౌమ్య.

నవీన్ తేరుకొని, "అహ ఏంలేదు! దురదృష్టవశాత్తు నాకేదయినా ప్రమాదం సంభవిస్తే నీ విషయం ఎలాగా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

సౌమ్య తన సున్నితమైన వేళ్ళతో అతని పెదిమలని మూసి, "హాస్యానికయినా అలాంటి మాట అనొద్దు. నీకేదయినా అయితే నేను బతికుంటాననుకొంటున్నావా? చావైనా, బ్రతుకైనా యిద్దరం కలిసే అనుభవించాలని

నిర్ణయించుకున్నాం, మరచిపోయావా?" అన్నది.

"లేదనుకో! మనసుకి కీడు శంకించటం అలవాటు కదా."

ఆ సమయానికి వాళ్ళు ఏటవాలుగా వున్న ప్రదేశానికి చేరారు. అక్కడితో కాలిబాట అంతమై పొదలు, పిచ్చి మొక్కలు ప్రత్యక్షమయ్యాయి.

"మరో దారి చూసుకోవాల్సిందే!" అంది సౌమ్య చిన్నగా నిట్టూర్చి.

"చూద్దాం, యీ దారి యిక్కడితో యెందుకు అంత మయ్యిందో...." అంటూ పొదల్ని దాటుకుంటూ రెం డడుగులు వేశాడో లేదో, కాలు ముందుకు జారినట్టనిపించి వెనక్కి తీసుకోబోయాడు నవీన్.

కాని అప్పటికే ఆలస్యమయింది. చింపాంజీ ఎందుకో అనిమిత్తంగా కిచకిచ మన్నది. అది అపాయసూచకమని సౌమ్య వెంటనే గ్రహించింది. నవీన్ కూడా గ్రహిం చాడు. కాని, అప్పటికే అతను ముందుకు తూలాడు. శరీర మంతా ముందుకి, ఏటవాలుగావున్నవైపు వాలిపోయింది.

అంతే! కిందికి జరజర జారుకుంటూ దొర్లిపోయాడు నవీన్.

"నవీ!" అని గట్టిగా అరచింది సౌమ్య.

కాని అప్పటికే నవీన్ కిందికి దొర్లిపోయాడు.

సౌమ్య తనూ అటు అడుగులు వేసింది.

చింపాంజీ చటుక్కున ఆమె చేయి పట్టి ఆపింది. సౌమ్య యేటవాలుగా వున్న ప్రదేశంవైపు తొంగి చూసింది.

అది పెద్ద లోయ! అడుగు యెక్కడుందో కనిపించ నంత లోతయిన లోయ. ఆ లోయలోకి దొర్లిపోయాడు

నవీన్.

సౌమ్య ఒక్కసారిగా భయంతో, గగుర్పాటుతో కవ్వున అరచింది. అంత లోతుకి దొర్లిపోయాక మానవ మాత్రుడు బతికి వుండటం కల్ల.

'అయితే....నవీన్....గాడ్! నేనిక బ్రతికి ప్రయోజనం లేదు. నేనూ ఉరికేస్తాను' అంటూ మరోసారి లోయవైపు జరిగింది సౌమ్య.

మరొక్కక్షణం ఆలస్యమయితే ఆమె కూడా లోయలోకి దొర్లిపోయి వుండేదే!

కాని, చింపాంజీ చాలా ఎలర్టుగా వుంది. ఆమె మనసు తెలిసినదానిలాగే ఆమెని చటుక్కున పట్టి వెనక్కు లాగేసింది.

“వదులు, నన్నువదులు! నేను ఆయన్ని వెతుక్కుంటూ లోయలోకి వెళ్తాను. నన్ను విడిచిపెట్టు” అంటూ గింజుకున్నది.

కాని చింపాంజీ ఆమెను వదిలిపెట్టలేదు. చింపాంజీ బలం ముందు తనెంత బలహీనురాలో మొదటిసారిగా గ్రహించింది సౌమ్య.

ఆమెకి గుండె అడుగుపొరల్లోనుంచి నవీన్ మీది ప్రేమ వెల్లుబికి, దుఃఖంగా మారిపోయి గొంతుకు అడ్డుపడి భోరున యేడవాలన్న ఆమె కోరికని నెరవేరకుండా చేసింది.

సరిగ్గా అదే సమయంలో ఆ నిర్జరారణ్యంలో ఎక్కడ నుంచో గుర్రపు డెక్కల సవ్వడి వినిపించింది. దూరంగా దుమ్ము రేగుతోంది. ఎవరో గుర్రంమీద వస్తూన్నారు. ఇంతవరకు యీ అడవిలో గుర్రంమీద ప్రయాణించగా యెవర్నీ చూడని సౌమ్య ఒక్కక్షణం దృష్టిని అటు

సారించింది.

ఒకచేపు గుర్రం! తెల్లటి గుర్రం. దానిమీద రౌతు. ఓ చేత్తో తుపాకి, మరో చేత్తో గుర్రం కళ్ళెం పట్టు కొన్నాడు.

దాదాపు అతనికి ముప్పయి సంవత్సరాల వయసుం టుంది. హాంటర్స్ వేసుకునే వైట్ డ్రస్‌లో ఇంగ్లీషు సినిమాల్లోని కౌబాయ్‌లా వున్నాడు. విలాసంగా పొగరుగా గుర్రాన్ని డొక్కలో తన్నుతూ పరుగెత్తిస్తు న్నాడు.

ఇంకో అయిదునిమిషాల్లో గుర్రం తనని సమీపిస్తుంది. తను యెదురుపడటం మంచిది కాదని ఆమె సిక్స్త్ సెన్స్ చెపుతోంది.

అటు యిటు చూసింది. పెద్ద చెట్టు పక్కకి జరిగింది. అక్కడ్నుంచి చూస్తే ఆ రౌతు తనకి కనిపిస్తాడు. తను అతనికి కనిపించదు.

చింపాంజీ కూడా ఆమె పక్కకు వెళ్ళి నించుంది.

సరిగ్గా అప్పుడే ఆ రౌతు ఆ స్థలానికి చేరుకున్నాడు. గుర్రాన్ని ఆపుచేశాడు. నేలమీదికి గెంతాడు.

అతను తనని చూశాడా? యేమో, అలాగే వుంది. సరిగ్గా అక్కడికొచ్చాక నే యెందుకు ఆగిపోయాడు?.... అతను తనని చూస్తే మాత్రం వదలిపెట్టి పోడు! సౌమ్య ఉత్కంఠతో అటే చూస్తోంది.

ఆ రౌతు ముందుకి నాలుగడుగులు వేశాడు.

♦ ♦ ♦

నవీన్ చాలా వేగంగా లోయలోకి దొర్లిపోతూ న్నాడు.

ఏదయినా కొమ్మనో, మొక్కనో, రాయినో పట్టుకుని

దొర్లిపోకుండా ఆపుకోవాలనుకున్నాడు. కాని అతని ప్రయత్నమేదీ ఫలించలేదు. తనని తను కంట్రోల్ చేసుకోవటానికి చేసిన ప్రయత్నం విఫలం కావటం, తన ప్రమేయం లేకుండా యెక్కడికో అధఃపాతాళానికి జారిపోవటం అతనికి వింతగా అనిపిస్తోంది.

నేల తగిలింది. కాళ్ళు నేలమీద ఆనుకుని లేచి నించోవాలనుకున్నాడు. కాని కాళ్ళు సహకరించలేదు. అక్కడ చాలా నున్నగా, మృదువుగా వుంది ప్రదేశం.

చిమ్మచీకటి. కంటికేమీ కనిపించటంలేదు. నవీన్‌కి ఆశ్చర్యంగా వుంది. తనిప్పుడెక్కడున్నాడు?

సరిగ్గా అప్పుడే అతని పక్కన బుస్సుమన్న ఛీత్కారం వినిపించింది. అనుమానంలేదు. ఏదో సర్పం కాటందుకోబోతోంది. ఒకటి రెండు కాదు—ఒకేసారి యెన్నో సర్పాలు కలకల్లాడుతూ తిరుగుతున్న సవ్వడి స్పష్టంగా వినిపించిందతనికి.

చూడగా ఈ అడవి విషసర్పాలకి నిలయంలాగా వుంది. ఎక్కడ చూసినా పాములే కనిపిస్తున్నాయి. ఇంతవరకూ తప్పించుకున్నాడు గాని, యిప్పుడు తప్పేలాగా కనిపించటం లేదు. లోయలోకి దొర్లిపోయేటపుడు తన తుపాకీ యెక్కడో జారిపోయినట్టుంది. నడుముకి కట్టుకొన్న బుల్లెట్ బెల్టు కూడా పడిపోయింది. ఇదెలా సంభవం....? నడుముకి గట్టిగానే చుట్టుకున్నాడే!

ఇంతలో యెక్కడ్నుంచో వెలుతురు ప్రసరించింది. కళ్ళు చికిలించి చూశాడు నవీన్.

ఆ వెలుతుర్లో కనిపించిన దృశ్యం అతన్ని నిశ్చేష్టుడిని

చేసింది.

ఎదురుగా చుట్టలు చుట్టుకొని పడగ విప్పి మహోగ్రంగా నిల్చుని వుందో బ్రహ్మాండమయిన సర్పం. పురాణాల్లో చెప్పుకునే ఆదిశేషువులాగా కనపడుతోంది.

కనీసం యిరవై అడుగులకు తక్కువ పొడవుండదు! తను పుట్టి బుద్ధెరిగి అంత పెద్ద సర్పాన్ని చూసివుండలేదు.

ఆ సర్పం పడగమీద అటు యిటు ఊగుతోంది. బుస్సుమన్న శబ్దంతో ఆ లోయ అంతా ప్రతిధ్వనిస్తోంది. అది యే క్షణంలో నయినా తనను కాటందుకునేలా వుంది!

నవీన్ నిశ్చలంగా ఆ సర్పంవైపే చూస్తూ వుండిపోయాడు.

• • •

ఆ రావి చెట్టుకింద పది నిమిషాలు కూచున్నాడు.

చాలా దూరం నించి ప్రయాణం చేసి వస్తున్నట్లు అలిసి వాడిపోయిన అతని ముఖం చెపుతోంది. ఏదో జమీందారీ వంశానికి చెందినవాడిలా వున్నాడు. ముఖంలో వర్చస్సు, ఠీవి ఒకదానితో మరొకటి పోటీ పడ్తున్నాయి.

సౌమ్య తదేక దీక్షతో అతనివంకే చూస్తోంది. అతను కేవలం వేటకోసం వచ్చినవాడి లాగానే వున్నాడు. నవీన్ విషయం చెప్పి అతని సహాయం కోరితే....!

ఈ ఆలోచన వచ్చిన వెంటనే దాన్ని వెన్నంటి మరో అనుమానం వచ్చింది. అతడు మంచివాడో, దుర్మార్గుడో! తన కేదయినా అపకారం తలపెడితే ఆ నిర్జనారణ్యంలో తనకెవరు దిక్కు? ఒక్కోసారి పరిస్థి

తులు కూడా మనిషిని రాక్షసుడిగా, దుర్మార్గుడిగా మార్చెయ్యవచ్చు!

అతన్ని పలకరించకపోవటమే క్షేమకరమని ఆమె మనసుకి తట్టింది.

ఆ రౌతు లేచి నించున్నాడు. గుర్రాన్ని మూపుమీద నిమిరాడు. ఆ తర్వాత గుర్రంపై అధిరోహించాడు. గుర్రం బాణంలా దూసుకుపోయింది.

సౌమ్య తేలికగా నిట్టూర్చింది.

• • •

నవీన్ భయపడినట్టు ఆ సర్పం అతన్ని యేమీ చెయ్యలేదు సరికదా, తక్కిన సర్పాల్ని వేటినీ అతని సమీపానికి రానివ్వకుండా నిరోధిస్తోంది.

నవీన్‌కి విషయం చాలా అద్భుతంగా నమ్మలేనిదిగా అనిపించింది.

ఇంతలో యెక్కడ్నుంచో సన్నటి స్వరం వినిపించింది. "ఉగ్ర నాగూ!" అని.

పడగ విప్పిన ఆ త్రాచు ఒక్కసారిగా ఆ పిలుపు వినపడినవైపు తిరిగింది.

ఆ స్వరం ఆజ్ఞాపించింది. "ఇక నువ్వు వెళ్ళవచ్చు!" అని. అది స్త్రీ కంఠం. కాని అందులో చాలా గంభీరత, పరిపక్వత, కమాండ్ వున్నాయి.

నవీన్‌కు అంతా అయోమయంగా వుంది.

ఆ త్రాచు చుట్లను విప్పుకుని చరచరా వెళ్ళిపోయింది. దాని వెనకనే ఆ లోయలో అంతదాకా సంచరించిన పాములన్నీ వెళ్ళిపోయాయి.

నవీన్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అప్పుడు ప్రత్యక్షమయ్యింది అతని ముందు, విలక్ష

ణంగా వున్న ఓ. స్త్రీమూర్తి!

నవీన్ ఆమెవంకే పరిశీలనగా చూశాడు.

ఆమె ఆపాదమస్తకం పోతపోసిన కంచు విగ్రహంలా నల్లగా నిగనిగ లాడుతోంది. నల్లగా వున్నా ఆ శరీరం యెంతో మృదువుగా, తాకితే కందిపోతుందన్నంత సున్నగా వుంది. ఆమె కళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి నల్లటి ముఖంలో. ఆమె వయసు యిరవై రెండు యిరవై అయిదు యేళ్ళ మధ్య వుండొచ్చు.

ఆమె కట్టుకున్న చీర యేదో చెట్టు బెరడునుంచి తీసిన నారతో నేసినట్టుంది. అంతకన్న వింతయిన విషయమేమి టంటే ఆమె కుడిచేతికో సర్పం, ఎడమచేతికో సర్పం చుట్టుకుని వున్నాయి. ఆమె వాటిని పెంపుడు జంతువుల్ని యజమాని నిమిరినట్టు పడగమీద మెల్లగా సుతారంగా నిముముతోంది.

"ఎవరు నువ్వు? ఏమిటీ వింత వేషం?" అడిగాడు నవీన్ ధైర్యంగా.

ఆమె ఫెళ్ళున నవ్వింది నవ్వు మనోహరంగానే వున్నది. నల్లని ముఖంలో తెల్లటి పలువరస ముత్యాల వరసలా మెరిసింది.

నవీన్ మళ్ళీ రెట్టించాడు.

ఆమె నవ్వు నాపుకుని, "ఇది వింతవేషం కాదు, స్వంత వేషమే!" అన్నది స్వచ్ఛమైన తెలుగులో.

నవీన్ నిర్ఘాంతపోయాడు. ఆమె యే కోయపిల్లో, అనాగరికురాలో అనుకున్నాడు. కాని నాగరికురాలని ఉచ్చారణని బట్టి గ్రహించాడు.

"దయచేసి నన్ను వదిలెయ్యి. నాతోపాటువచ్చిన నా స్నేహితురాలు నేనేమైపోయానోనని యిప్పటికే సతి

మతమై పోతుంటుంది, నేను వెళ్ళాలి!" అన్నాడు నవీన్.

"నిన్నంత త్వరగా వదిలిపెట్టడానికా పనిపడి యిక్కడికి రప్పించింది....!" ఆమె నవ్వింది.

"అంటే....నువ్వే నన్నిక్కడికి రప్పించావా? నేను కాలుజారి పడిపోయాను కదా ఈ లోయలో....!"

"అరవై అడుగుల లోతున్న నాగులకొండ లోయలో పడ్డాక మనిషి బతికుంటాడా? నీకు దెబ్బలు తగలకుండా చెక్కు చెదరకుండా యెలా వుండగలిగావు? నేను చేసిన యేర్పాటు వల్లనే...."

"అంటే....నన్నిక్కడికి రప్పించవలసిన అవసరమేమి వచ్చింది?"

"నీతో నాకు పని పడింది."

"నాతోనా?"

"అవును నేను చెప్పినట్టు వింటానని నాకు మాట యివ్వు."

"నువ్వు చెప్పినట్టు నేనెందుకు వినాలి?....వినకపోతే...."

"నీ ప్రియురాలు సౌమ్య ప్రాణాలని పోగొట్టినవాడివి అవుతావు."

"ఏమిటి నువ్వనేది? సౌమ్య పేరు నీకెలా తెలుసు?"

"నువ్వు పిలుస్తుండగా విన్నాను. నీ పేరు కూడా తెలుసు; నవీన్!"

"వింతగా వుందే! నిన్నిప్పుడే మొదటిసారి చూస్తున్నాను."

"నేను మాత్రం మీ యిద్దరు యీ అడవిలో ప్రవేశించిన మరుక్షణాన్నించీ చూస్తున్నాను! ఈ అడవిలోని

ప్రతి అంగుళం నాకు చిరపరచితమే! మీకు కనిపించకుండా మిమ్మల్ని అనుక్షణం వేంటాడుతూనే వున్నాను"

"ఓహో, అలాగా! అయినా సరే, ముక్కు-మొహం తెలీని నీకు వాగ్దానాలు చెయ్యలేను!"

"చెప్పానుగా, చెయ్యకపోతే నీ ప్రియురాలికి పట్టబోయే దుర్గతి.... నా సర్వజాలాన్ని ఒక్కసారిగా దండయాత్ర పంపించానంటే చాలు.... పైగా నా అనుచరుడు నీ సౌమ్య వెంటనంటే వున్నాడు...."

"అనుచరుడా? అతనెవరు?"

"చింపాంజీ."

"చింపాంజీ నీ అనుచరుడా?"

"మరి....? నిన్ను యిక్కడికి రావటానికి కారకుడు చింపాంజీయే. నేనే చెప్పి పంపాను. లేకుంటే ఆ అడవి జంతువుకి ఇంత తెలివితేటలు ఎలా వచ్చాయనుకున్నావు? నేను పూర్తి శిక్షణ యిచ్చాను."

నవీన్ ఒక్కసారి చింపాంజీ పరిచయం కావటంనించి అప్పటిదాకా జరిగిన సంఘటనలని మననం చేసుకున్నాడు. ప్రతిసారీ ప్రమాదం జరగటానికి ముందే హెచ్చరించే చింపాంజీ తను లోయలో పడిపోతుండగా హెచ్చరిక చేసింది. కావాలనే హెచ్చరించకుండా ఆలస్యం చేసింది. ఇదంతా ప్లాన్ ప్రకారం జరిగిందా?

"ఇప్పుడు అర్థమయ్యింది కదూ....అంతేకాదు, నా ప్లాన్‌లో ఓ భాగం బీరేంద్రని చంపటం! అది అప్పుడే నీవల్ల నెరవేరింది కూడా...."

నవీన్ తెల్లబోయి చూశాడు.

"అవును నవీన్, వీరేంద్ర దగ్గరికి తీసుకువెళ్ళమని చింపాంజీని నేనే ఆదేశించాను. కాయలు, పళ్ళు తెచ్చే నెపంమీద చింపాంజీ మిమ్మల్ని వదలి బయట కొచ్చి నా ఆదేశాలు తీసుకొని మళ్ళీ మీ దగ్గరకు వస్తుండేది!...."

నవీన్ కి చింపాంజీ యెంత తెలివైనదో, మనిషికన్న యెంత నైపుణ్యంగా పనిచేసిందో అర్థమయ్యింది.

"ఆల్ రైట్! నావల్ల నీకు కావలసిన సాయం గురించి చెప్పే ముందు అసలు నువ్వెవరివో, ఏమిటో అంతా వివరంగా చెప్పాలి!"

"అలాగే చెపుతాను. నా పేరు విషకన్య."

"విషకన్యా? .... నో, అది నీ అసలు పేరయి వుండదు."

"అసలు పేరుతో నీకు పనేమిటి? మనకి సంబంధించినంతవరకు నా పేరు విషకన్యే! మరీ వివరాలు అడగొద్దు. అవసరమైనంతవరకు నేనే చెపుతాను."

నవీన్ తలూపాడు.

"ఈ క్షణంనించి నీ రక్షణ భారం సౌమ్య రక్షణ భారం నేను, నా అనుచర బృందం వహిస్తాం. సరేనా?...."

"నీ అనుచర బృందమా? వాళ్ళెవరు?"

"చూశావుగా.... అది శేషువులా వున్నాడని నువ్వు భావించిన సర్పం పేరు ఉగ్రనాగు! నా ప్రధాన అనుచరుడు. ఎలాంటి పని చెప్పినా క్షణాల్లో పూర్తిచేస్తాడు. ఇదిగో తక్కిన అనుచరులు యింతసేపు నిన్ను చుట్టుముట్టి వున్న ఈ సర్పాలు....ముందు నా గురించి సంక్షిప్తంగా చెప్తాను విను. ఆ తర్వాత నువ్వు చెయ్యాల్సిన పనిగురించి

వివరిస్తాను."

నవీన్ ఆమె చెప్పేది వినటానికి సిద్ధమయ్యాడు.

విషకన్య చెప్పటం మొదలెట్టింది.

• * •

"హాయ్ డాడీ, నువ్వొచ్చావో లేదోనని హడలి ఛస్తున్నాను. అసలే అడవి. పైగా చీకటి పడిపోయింది. వెధవ బస్సు రెండుసార్లు ఆగిపోయింది. ఓసారి టైర్ పంక్చర్, మరోసారి బ్యాటరీ డౌన్! లైట్లు లేవు. అలాగే తడుముకుంటూ వచ్చినట్టు మెల్లగా నడుపుకొచ్చాడు. మై గాడ్.. మళ్ళీ బస్‌లో ప్రయాణం చెయ్యకూడదు జన్మలో" జ్వలిత మాటలకు రాఘవేంద్రరావు నవ్వుకున్నాడు.

"కాని, అమ్మా....యీ అడివికి బస్ ప్రయాణం తప్పని సరి! బస్ ఎక్కకుండా హైదరాబాద్ వెళ్ళి, చూద్దాం!" అన్నాడు.

"ఎందుకు వెళ్ళలేను? మన జీవ్ వుందిగా" అన్నది ధీమాగా జ్వలిత.

"ప్రభుత్వ వాహనాన్ని స్వంతపనులకి వాడుకోకూడదు తెలుసా?"

"అఁ. ఆ రూల్స్ యెవరు పాటిస్తున్నారు డాడీ! పాటిస్తే మన గవర్నమెంటు ఎందుకు అప్పులపాలవుతుంది?"

రాఘవేంద్రరావు బిగ్గరగా నవ్వేశాడు.

"రామ్మా.... వెనక వద్దు, ఫ్రంట్ సీట్లో కూర్చో! ఇతను యిక్కడి డ్రైవర్ యాదగిరి. వెనక కూచున్న వ్యక్తి తాణేదారు. మా వాచ్‌మన్ కూడా వస్తానని ఉబలాట పడ్డాడు. కాని నేనే వద్దన్నాను.

జీవ్ బయల్దేరింది. తన వెంట తెచ్చిన సూట్ కేస్ ఎర్ బాగ్ జీవ్ వెనకసీట్లో పెట్టింది జ్వలిత. ఫ్రంట్ సీట్లో మధ్య కూచోమంటే డోర్ పక్కనే కూచుంటానని పట్టుబట్టింది. జీపుకి డోర్ వుండదు, పడిపోతావు తల్లీ అని రాఘవేంద్రరావు బతిమాలుతున్నా వినలేదామె. తల మీదుగా రాడ్ కి వేలాడుతున్న రెక్సిన్ సపోర్టర్ని పట్టుకుని హుందాగా కూచున్నది.

"డాడీ, నాకీ అడవంతా చూపించాలి. అన్నట్టు యీ అడవిలో వన్యమృగాలున్నాయా?" అడిగింది జ్వలిత.

"ఇంటీరియర్ గా వెళ్తే చాలా క్రూరమృగాలున్నాయి. అయితే అవి మనవాళ్ళకి ఎన్నడూ అపకారం చెయ్యలేదనుకో! ప్రభుత్వం కూడా యింకా పూర్తిగా అడవిని సర్వే చేయలేదు. అడవి లోపలికి సరైన దారికూడా యింకా ఏర్పడలేదు. మనకిచ్చిన క్వార్టర్స్ కూడా అడవి ఎంట్రన్స్ లోనే కట్టబడ్డాయి. అందుకు కారణం కూడా లేకపోలేదు. ఈ అడవి కొంతభాగం ఆంధ్రప్రదేశ్ లోకి, మరికొంత మహారాష్ట్ర లోకి కలిసింది. అడవిలోపల కొన్ని కోయగూడేలున్నాయి. అయితే ఆ కొండజాతి ప్రజలు నాగరికతకు చాలా దూరంగా, పూర్తి అజ్ఞానంలోనే వున్నారు."

"గిరిజన కోపరేటివ్ స్టోర్సు, ట్రైబల్ స్కూలువంటివేమీ లేవా యిక్కడ?" అడిగింది జ్వలిత.

"అబ్బే, అవేవీ యింకా ప్రారంభించలేదమ్మా! చెప్పానుగా, యింకా యీ అడవి ప్రాథమిక సర్వేలోనే వున్నది. ఇదివరకయితే ఇక్కడ మానవమాత్రుడు కాలు పెట్టడానికే భయపడిపోయేవాడు. పులులు, సింహాలు విచ్చలవిడిగా తిరిగేవట! మా ఫారెస్టు డిపార్టుమెంటు

యీ అడవిని సర్వే చేయ తలపెట్టిన కొత్తలో కొంతమంది ఉద్యోగుల్ని పంపేశాయట. తర్వాత కొన్నిటిని కాల్చేసి మరికొన్నిటిని ప్రాణాలతో పట్టుకుని జూకి తరలించేశారట. అయితే ఎక్కువ శాతం క్రూరమృగాలు అడవి లోపలికి—బాగా యింటీరియర్ ఫారెస్టులోపలికీ—పారిపోయాయట. వాటిని ఎవరూ పట్టుకోలేకపోయారు."

"అలాగా!....మరి అడవిలోపల కోయగూడేలువున్నాయని చెప్పావు కదా! ఆ కోయలకి ఆ మృగాలు హాని చెయ్యవా?"

"ఎందుకు చెయ్యవు? కాని వాళ్ళు ప్రాణాల్ని తృణప్రాయంగా భావిస్తారమ్మా! మృగాల మధ్య తాము కూడా మృగాల్లా బతికేస్తారు. క్రూరమృగాలతో నిత్యం పోరాడుతునే వుంటారు. ఆహారంకోసం లేళ్ళ, దుప్పులు, కుందేళ్ళ వంటి వాటిని నిత్యం వేటాడుతునే వుంటారు. మనవాళ్ళుకూడా అప్పుడప్పుడు కుందేళ్ళని, అడవి పందుల్ని వేటాడి తెస్తూంటారు. మనకి నిత్యం మాంసాహారం దొరుకుతుందిక్కడ!"

"మాంసాహారం మాటకేంగాని, క్రూరమృగాల్ని తల్చుకుంటూంటే మాత్రం వెనక్కి హైద్రాబాద్ పారిపోవాలనిపిస్తోంది డాడీ! అబ్బ, నేను యిక్కడ వుండలేను. నువ్వు, అమ్మకూడా హైద్రాబాద్ వచ్చెయ్యండి డాడీ, వెళ్ళిపోదాం!" జ్వలిత గుండెలమీద చేయివేసుకుని కళ్ళు పెద్దవిచేస్తూ తండ్రివంక చూసింది.

రాఘవేంద్రరావు నవ్వేశాడు. జీప్ ఘాట్ రోడ్ మీద సాఫీగా పోతోంది. ఘాట్ రోడ్డు దాదాపు పాతిక కిలోమీటర్లుంటుంది. ఇరవై కిలోమీటర్లు తారురోడ్డు. ఆ తర్వాత అడవి ప్రారంభం కావటానికి అయిదు కిలో

మీటర్లు ముందునుంచి కంకరరోడ్డు. ఎగుడుదిగుడు రోడ్డు. లారీలు కూపుల లోడ్‌తో నిత్యం తిరుగుతుండటంవల్ల ఆ రోడ్డు బాగా గతుకులు పడిపోయింది.

"మాడమ్మా, నేను, మీ అమ్మ నీతో హైద్రాబాద్ వచ్చేస్తే మరి నా ఉద్యోగం ఎవరు చేస్తారు? ఉద్యోగం లేకుంటే నా చిట్టితల్లికి రాజకుమారుడ్ని తేవటానికి లక్షలు ఎలా వస్తాయి?"

"పోనాన్నా! నేనసలు పెళ్ళే చేసుకోను! లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తాను" అన్నది జ్వలిత బుంగమూతి పెట్టుకొని. ఆమె హోంసైన్స్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేస్తోంది హైద్రాబాద్‌లో.

"అలాగే తల్లీ, ఇంకా నీ చదువు పూర్తికావాలి కదా. చదువయ్యాక, నువ్వు సంపాదించటం మొదలెట్టాక నేను ఉద్యోగం విరమించుకుని నీ దగ్గరకు యిద్దరం వచ్చేస్తాం, సరేనా?" నవ్వుతూ అన్నాడు రాఘవేంద్రరావు.

"నిన్ను యీ అడవిలో ఉద్యోగం యెందుకు వద్దంటున్నానో గ్రహించలేవు డాడీ నువ్వు? ఇక్కడ క్రూర మృగాలకు నిలయమంటున్నావు కదా! ఎందుకు రిస్క్ తీసుకోవాలి? ప్రాణంకన్న విలువైనదా ఉద్యోగం?"

"రిస్క్ యెక్కడ వుండదమ్మా....ఏ అడవిలోనైనా తప్పదు కదా...."

"ఇంత క్రితం తూర్పు గోదావరి జిల్లాలోని కుట్రవాడ, మారేడుమిల్లి, దేవీపట్నం అడవుల్లో ఈ జంతువుల గొడవలేదు కదా! పైగా అక్కడ వాతావరణం ఎంతో బావుండేది కూడా!"

"ఓహో, అది బాగా డెవలప్ డ్ ఏజెన్సీ అమ్మా! ప్లెయిన్ ఏరియా కన్న అక్కడి అడవులే బావుంటాయి,

అలా అని ఎల్లకాలం ఒకేచోట ఉంచుతారా మరి? ఇప్పుడు నీ తండ్రి ఫారెస్ట్ డిపార్ట్‌మెంటులో అత్యున్నత పదవిలో వున్నాడు. నా అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ ఫారెస్ట్‌ని కూడా డెవలప్ చేయగలననే నమ్మకంతో నన్నిక్కడికి బదిలీ చేసింది ప్రభుత్వం! ప్రభుత్వం నామీదుంచిన కార్యభారం నా ప్రాణం కన్న విలువయినదిగానే భావిస్తానమ్మా!"

జీప్ కంకర రోడ్డు పట్టింది. గతుకుల్లో పడినప్పుడల్లా జ్వలిత యెగిరిపడుతోంది. అద్దానికోసారి తల కొట్టుకొన్నది కూడా.

"యాదగిరీ, మెల్లగాపోనివ్వు. అమ్మాయికి ఈ రూట్ కొత్త!" అన్నాడు రాఘవేంద్రరావు.

యాదగిరి వినయంగా "అట్టాగే సార్!" అన్నాడు.

"అమ్మెలా వుంది డాడీ!" అడిగింది జ్వలిత.

"నువ్వొస్తున్నావని వారం రోజుల్నుంచి అడవిలోని చెట్లకు పుట్లకు పక్షులకి జంతువులకి తెగ చెప్తూ వచ్చిందిలే! అవన్నీ నిన్ను చూడటానికొస్తాయేమో కూడాను. నీ కిష్టమైన పిండివంటలన్నీ స్వయంగా తయారు చేసి రెండు రోజుల్నుంచి ఎదురుచూస్తోంది. నువ్వొస్తానని రాసింది ఈ రోజేనని చెప్పినా కూడా వారంరోజులుగా ప్రతి రోజు జీప్‌ని తీసుకొని ఘాట్ రోడ్‌కి వెళ్ళమని ఒకటే గొడవ చేసింది. పొరపాటున నువ్వీ రోజు రాకపోయుంటే హైద్రాబాద్ బయల్దేరతీసి వుండేది నన్ను!"

తల్లిని తలచుకుని ముసి ముసిగా నవ్వుకున్నది జ్వలిత.

"సెలవులన్నీ యిక్కడే గడపాలమ్మా! లేకుంటే మీ అమ్మ నన్నూరుకోనివ్వదు. నేను నలిగిపోతాను మధ్య!"

"అడవంటే నాకు చాలా యిష్టమని నీకు తెల్సుగా డాడీ! అడవి చూడటానికి నా సెలవులు యే మాత్రం సరిపోవు కూడా! సెలవు వాడుకోకుండా యెక్కడికి వెళ్ళాను!?"

"నీ కోసం ఎస్. జానకి భక్తి గీతాలు ఎల్. పి. తెప్పించి పెట్టాను. లేటెస్టు తెలుగు, హిందీ సాంగ్స్ రికార్డు చేయించి తెప్పించాను సిరిపూర్ నించి. ఆ వూరే మనకి దగ్గర్లో వున్న సిటీ!"

"అవును. బస్ కాగజ్ నగర్ మీది నుంచే వచ్చింది."

"మనకేం కావాలన్నా డెబ్భై కిలోమీటర్లు పోయి రావల్సిందే! అదే పెద్ద డిజడ్వాంటేజ్."

"జీపు వుంది కాబట్టి దూరం లెక్కలోది కాదు. ఆ సౌకర్యం లేనివాళ్ళు యిలాంటి చోట బతకటం చాలా కష్టం!"

"మా ఫారెస్ట్ డిపార్టుమెంటు తప్ప యిక్కడ మరెవరున్నారు గనక!? చెప్పానుగా, యిది బాగా వెనకబడ్డ ప్రాంతమని. ఇక్కడ అంతా కలుపుకున్నా పదిమంది కన్నా స్టాఫ్ లేరు!"

మాటల్లో క్వార్టర్సు చేరుకున్నది జీపు. పక్క పక్కనే మూడు బిల్డింగ్సు కట్టబడి వున్నాయి.

రాఘవేంద్రరావు కిచ్చిన క్వార్టర్ అన్నిటికన్నా పెద్దది. ప్రత్యేక వసతులతో కట్టబడినది. చుట్టూ పెద్ద కాంపౌండ్ వాల్ — క్రూరమృగాలు గాని, జంతువులు గాని ప్రవేశించటానికి వీల్లేని విధంగా కట్టబడి వున్నది. గోడపైన 2. రెండు అడుగుల ఎత్తున ఇనప కంచెతో ఫెన్సింగ్ వున్నది. కిటికీలకు గ్లాసెస్ వున్నాయి—

చెక్క తలుపులతో బాటు ఏవి కావాలంటే, అవి వేసుకునే సదుపాయం వుంది.

"ఇల్లు చాలా బావుంది డాడీ!" అంది జ్వలిత బయటనుంచే తదేక దీక్షతో క్వార్టర్స్‌వంక చూస్తూ.

గుమ్మంలోనే నిల్చుని వున్న సుభద్రమ్మ పరుగెత్తుకొచ్చి కూతుర్ని అక్కున చేర్చుకుంది. చిన్న పిల్లలాగా తల్లిని కరుచుకుపోయింది జ్వలిత.

"హాస్టల్ తిండి యేం తింటున్నావో ఏమో పుల్లలా అయిపోయావు తల్లీ! ఉన్నది ఒక్కగా నొక్క ఆడపిల్లవు. పెద్ద చదువుల పేరుతో మా అందరికీ దూరంగా ఒంటరిగా ఆ సిటీలో యెందుకంటే నా మాట ఎవరు వినిపించుకుంటారు? పెళ్ళి కావలసిన పిల్ల... ఓ అయ్య చేతిలో పెట్టేస్తే...."

జ్వలిత తల్లిని విడిపించుకుని దూరంగా జరిగి, "అమ్మా, వాకిట్లోకి అడుగుపెట్టానో లేదో అప్పుడే నా పెళ్ళి గురించి దండకం మొదలెట్టావా? అలా అయితే హైద్రాబాద్ తిరిగి వెళ్ళిపోతానంతే!" బుంగమూతి పెట్టుకుని బెదిరించింది.

"అంత మాటనకు తల్లీ. నీ యిష్టమొచ్చినట్టే చెయ్యి. కాదన్నానా?" సుభద్రమ్మ కూతుర్ని పొదివి పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది.

• • •

వారం రోజులపాటు కూతుర్ని వెంటబెట్టుకుని అడవంతా చూపించాడు రాఘవేంద్రరావు. రాత్రిళ్ళు పులులు సింహాలు చేసే గర్జనలు, యింకా యితర క్రూర మృగాల అరపులు స్పష్టంగా వినిపించేవి జ్వలితకు.

"డాడీ! కట్టిపడెయ్యకుండా నేచురల్‌గా ఫారె

స్టులో సంచరించే పులుల్ని సింహాల్ని చూడాలని వుంది. దూరంనించి చూసి వచ్చేద్దామా?" అంది తండ్రితో.

రాఘవేంద్రరావు తడబడ్డాడు. "ఏమిటమ్మా, నీ వింత కోరిక? అవేమన్నా కుక్కపిల్లలా పిల్లి పిల్లలా ముచ్చటపడి చూడటానికి? వాటి కళ్ళబడితే ప్రాణాలతో వదులుతాయా? ఆరితేరిన మా ఉద్యోగులు పగలే ఈ అడవిలో తిరగటానికి భయపడతారు, ఏ మూలనించి వచ్చిపడతాయోనని! అదిగో కనపడే సర్వే తోపు దాటి వెళ్ళకూడదు. ఆ తర్వాతి నుంచి, ఆ ప్రదేశమంతా పులులు, సింహాలు స్వేచ్ఛగా తిరుగుతుంటాయి. మా ఫారెస్టుగార్డ్ ఓసారి దూరంనించి పులిని చూసి తారెత్తి పారిపోయి వచ్చాడు. అదృష్టవశాత్తు దాని కళ్ళ పడలేదు గాని, చంపేసి వుండేది. ఒక్కసారి మనిషి రక్తం మరిగిన పులి మాన్ ఈటర్ అవుతుంది. దాంతో మనుషుల్ని వెతికి వేటాడి చంపటం మొదలెడ్తుంది. ఆ తర్వాత దాన్ని వేటాడటం చాలా కష్టం!"

"కాని డాడీ...."

"వద్దమ్మా. ఆ ఆలోచనే వద్దు. నువ్విప్పటివరకు చూసినదే చాలా యెక్కువ. ఇప్పటికి దాదాపు పన్నెండు విషసర్పాల్ని చంపారు మనవాళ్ళు, ఈ వారం రోజుల్లోను. వెంట్రుకవాసిలో నాలుగుసార్లు సర్పం కాటునించి తప్పించుకున్నాం. ప్రతిసారి అదృష్టం మనల్ని వెంటనంటి వుండదు. ఇక రేపట్నుంచి అడవిలో తిరగొద్దు!! ...."

రాఘవేంద్రరావు యేదో చెప్తుండగా ఫారెస్టుగార్డ్ పరుగెత్తుకొని వచ్చాడు. "సార్! ఆ నాయుడు అతని మనుషులు ఎర్రచందనం చెట్లు కొట్టేసి లారీ కెత్తు

తున్నారు. అడ్డగించబోతే చంపుతామని బెదిరించారు.." అన్నాడు ఆయాసపడుతూ.

రాఘవేంద్రరావు ఒక్క క్షణం ఆలస్యం చెయ్య లేదు. "అమ్మా, నువ్వు మన బక్ వీరయ్యతో యింటికి వెళ్ళిపో! నేనిప్పుడే వస్తాను" అంటూ గారుతోను మరో యిద్దరు సిబ్బందితోను, డ్రైవర్ యాదగిరితోను చందనం చెట్లవైపు పరుగెత్తాడు.

అప్పటికి సగానికి పైగా లారీ లోడ్ అయిపోయింది. బుంగమీసాలతో, నెత్తురుముద్దలా వున్న క్రూరమైన కళ్ళతో, లావుగా పొడవుగా వున్న వ్యక్తి అధ్వర్యంలో అయిదుగురు మనుషులు చకచక చందనం మానుల్ని లారీ కెత్తుతున్నారు.

"మిస్టర్ నాయుడూ, వెంటనే ఆ లారీని అన్ లోడ్ చేయించు. లేకుంటే నీమీద చట్టరీత్యా చర్య తీసుకో వలసి వుంటుంది" హుంకరించాడు రాఘవేంద్రరావు.

నాయుడు చలించలేదు. చిద్విలాసంగా నవ్వాడు. "మై డియర్ ఆఫీసర్! ఎందుకలా కేకలు పెడతావ్. నిజాయితీ, ఉద్యోగ ధర్మం అంటూ మడిగట్టుకుని కూర్చుంటే నీకు మిగిలేదేమీ వుండదు మన్ను తప్ప! నా మాట విను. నీ ముందు పనిచేసి పోయిన ఆఫీసర్లు రెండు చేతులా ఆర్జించి యిప్పుడు నాలుగు బంగళాలు కట్టారు హైద్రాబాద్ లో. నువ్వు ఊ అన్నావంటే వేలకివేలు నీ యినప్పెట్టెలో కాపురముంటాయి. సరే నను...." అన్నాడు.

"షటప్! అందర్నీ ఒకేగాటకి కట్టకు. వాళ్ళవలో గడ్డి కరిసే కరిచి వుండొచ్చు. నాకు కొన్ని ప్రిన్సిపుల్స్ వున్నాయి. వాటి నతిక్రమించను. మర్యాదగా చందన

మంతా దింపించు. లేకంటే పోలీస్‌కి తెలియచెయ్యాల్సి వుంటుంది."

నాయుడు విరగబడి నవ్వాడు. "పోలీసులా? సిరిపూర్ నించి తెప్పిస్తావా? అంతదాకా నేను యిక్కడ ఆడుకుంటాననుకున్నావా?"

మరుక్షణం రాఘవేంద్రరావు చేతిలో పిస్తోలు నిగనిగలాడుతూ ప్రత్యక్షమయ్యింది. గార్డ్ చేతిలో గన్ నాయుడి మనుషులవైపు గురిచేయబడి వుంది.

"మిస్టర్ నాయుడూ! ఇప్పటికి రెండుసార్లు నిన్ను వార్నింగ్‌తో వదిలేశాను. ఈసారి ఏక్షన్ తీసుకోక మానను. పోలీసు రానక్కర్లేదు. అక్రమంగా అటవీ సంపదను తరలించేవారిమీద రివాల్వర్ కాల్చటానికి నాకు పర్మిషన్ వుంది. నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను. ఊఁ! పది నిమిషాల్లో కలప నా స్వాధీనం చేసి యీ స్పాట్ వదిలి వెళ్ళకపోతే పదకొండో నిమిషంలో నా రివాల్వర్ నీ రక్తాన్ని రుచి చూస్తుంది! ఇది బెదిరింపు మాత్రం కాదు, జాగ్రత్త!" రాఘవేంద్రరావు కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి.

నాయుడు పళ్ళు పటపట కొరికాడు. తన మనుషుల్ని లారీ నుంచి సరుకు దింపెయ్యమని ఆదేశించాడు. రాఘవేంద్రరావుని సమీపించి క్రూరంగా అతని కళ్ళల్లోకి చూశాడు.

"ఆఫీసర్! ఇల్లలకగానే పండగాదు. ఇన్నాళ్ళు నువ్వు నా దారికొస్తావని యెదురుచూశాను. కాని నువ్వొట్టి మూర్ఖుడివి! లక్ష్మిని కాలదన్నుకొంటున్న పిచ్చోడివి! చూడు.... పదిరోజుల్లో నిన్నిక్కడి నుంచి ట్రాన్స్‌ఫర్ చేయించక పోతే నా పేరు నాయుడే కాదు! హైద్రాబాద్‌లో నా

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకూ చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

వున్న యిన్‌ఫ్లుయన్స్ నీకు తెల్వదు. లక్ష రూపాయలు ఖర్చయినా సరే, నిన్నిక్కడ్నుంచి లేపేస్తాను. నా మాటి కెవోడ్నే వేయించుకుంటాను. పదండిరా!" అంటూ లారీ కేబిన్‌లో యెక్కాడు.

"ఆగు!" అంటూ తన సిబ్బందికి సైగ చేశాడు రాఘవేంద్రరావు.

లారీ కేబిన్‌లో నుంచి, కేబిన్ పై భాగంలో వుంచిన టార్పాలిన్స్ కిందినుంచి గంధపు చెక్కల్ని వెతికి పైకి తీశారు గార్డు, తక్కిన ఉద్యోగులు. నాయుడు దొరికి పోయినట్టు చూశాడు. ఉక్రోషంతో, కోపంతో రాఘవేంద్రరావువైపు చూసి, "నన్ను యింతమందిలో అవమానించావు. ఇంతకింతా వంతు తీర్చుకుంటాను. నాయుడి పగ పాము పగ, గుర్తుంచుకో!" అన్నాడు.

మరుక్షణం దుమ్ము రేపుకొంటూ వెళ్ళిపోయింది లారీ.

రాఘవేంద్రరావు రివాల్వర్ జేబులో పెట్టుకుని "స్కౌండ్రల్! వీడి బెదిరింపులకు లొంగిపోయే లోఫర్ ననుకున్నాడు. ఠాణేదార్, యికమీదట అక్రమంగా లారీలు ప్రవేశించకుండా తగిన జాగ్రత్తలు తీసుకోండి!" అన్నాడు.

ఠాణేదార్ వినయంగా తలూపి, "అలాగే సార్!" అన్నాడు.

రాఘవేంద్రరావ్ ఫారెస్టుగార్డు భుజం తట్టి, "వెల్ డన్ మిస్టర్ ఫిలిప్! చాలా స్పోర్టివ్‌గా వ్యవహరించి, సమయానికి యిన్ఫర్మేషన్ అందించావు. ఐ అప్రిషియేట్ యువర్ సిన్సియారిటీ!" అన్నాడు.

ఫిలిప్ వినయంగా నమస్కరించాడు.

ఇంటికి తిరిగొచ్చిన తండ్రి నడిగి వివరాలు తెల్సుకున్న

జ్వలిత, "రియల్లీ వండ్రఫుల్ డాడీ! పాట్రియాటిక్! నీలా ప్రతి ఉద్యోగి బాధ్యతాయుతంగా నిజాయితీగా వ్యవహరిస్తే అవినీతికి తావుండదు. ప్రభుత్వానికి నష్టాలే రావు....అయితే కూతురుగా నీ పనిని హర్షించలేను.ఎందుకంటే, నేను నీ శ్రేయోభిలాషిని, నీ కన్న కూతుర్ని కాబట్టి!" అన్నది.

"అంటే....? వాళ్ళు నాకేమయినా హాని తల పెడతారని నీ అనుమానమా అమ్మా !?"

"దుర్మార్గుడు మామూలు సందర్భాల్లోనే తుచ్ఛమైన పనుల్లో నిమగ్నుడై వుంటాడే, యిలా దెబ్బతిన్న సందర్భాల్లో ఎంత క్రూరంగా, అమానుషంగా ప్రవర్తిస్తాడో నేను వేరే చెప్పాలా?"

"అలా భయపడితే అన్యాయం పెచ్చు పెరిగి పోతుంది. ఇలాంటి అక్రమ వ్యాపారులకు పట్టపగ్గాలుండవు. అసలే మా డిపార్టుమెంట్ మీద ప్రజలకి విశ్వాసం లేదు. కేవలం కొందరు అవినీతి పరులవల్ల ప్రభుత్వ ధనం దుర్వినియోగమవుతోంది; ఆస్తి నష్టం జరుగుతోంది. కాదనను. అలాంటివాళ్ళను విచిలేన్స వాళ్ళు పట్టి ప్రభుత్వాని కప్పచెప్పాలి. అందుకు చిత్తశుద్ధి, కార్యదీక్ష కావాలి! ప్రజలు కూడా అలాంటివాళ్ళ గురించి ప్రభుత్వానికి యిన్ఫర్మేషన్ యిస్తే యింకా వేగంగా అవినీతిని నిర్మూలించగలుగుతాం! కాని, అదే జరగటం లేదు!"

"భోజనానికి లేవండి!" అంటూ సుభద్రమ్మ పిలవటంతో సంభాషణ అంతటితో ఆగిపోయింది.

(సశేషం)

